అపరాధ పరిశోధన అనుబంధం—120

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## తను తవ్విన గొయ్యి

రచన: వసుంధర

## మృత్యుతరంగాలు

రచన: అజీజ్

## ఈనాటి సావిత్రి

రచన: టెంపోరావ్

విషసర్పాలు - చివరి భాగం
కళ్యాణదుర్గం - మొదటి భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 120
డిసెంబర్, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# తను తవ్విన గొయ్యి

వసుంధర

ఆ ప్రేమజంట పార్కులో ఓ క్రోటన్స్ మొక్కకు పక్కగా కూర్చుని వున్నారు. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటున్న పద్ధతి చూస్తుంటే ఒకరికోసం ఒకరు ప్రాణాలైనా ఇచ్చుకుంటారా అనిపిస్తుంది.

ఆమె వయస్సు ఇరవై దాటదు. మనిషి నిస్సందేహంగా అందగత్తె. కళ్ళలో ఆహ్వానమున్నది. ఆ ఆహ్వానం అతడికేనని తెలుస్తున్నది.

“లీలా! నీ పరిచయం నా అదృష్టం—” అన్నాడతను.

లీల మనోహరంగా నవ్వి—“నిన్ను గురించి నేనూ అలాగే అనుకుంటున్నాను—” అన్నది.

“ఇంకా అదృష్టం—” అన్నాడతను.

“నేను అందరిలాంటి ఆడదాన్ని కాను. నిన్ను చూసీ చూడగానే నాలో ప్రేమ పుట్టింది. నీతో జీవితం గడపాలనిపించింది. నాకు డబ్బుకి లోటులేదు. అయినప్పటికీ

నా జాగ్రత్తకోసం నేను డబ్బు తీసుకుంటాను—" అన్నది లీల.

"నీ షరతులు కూడా నాకు నచ్చాయి—" అన్నాడతను.

"థాంక్స్!" అని నవ్వింది లీల—"మిష్టర్ సుగుణ్! ఈ ప్రపంచంలో పురుషుడికి స్త్రీ అవసరమెంతో స్త్రీకి పురుషుడి అవసరమూ అంతగా వున్నది. అయితే పురుషుడికి ఆవేశం ఎక్కువ. ప్రపంచ విశేషాల్లో అతడు ప్రజ్ఞావంతుడు కావచ్చు. ఆలోచనాపరుడు కావచ్చు. స్త్రీ విషయం వచ్చేసరికి అతడి ప్రజ్ఞ, ఆలోచన పని చేయవు. మనిద్దరం మాట్లాడుకున్నప్పుడు నేను నిన్ను గమనించాను. నువ్వు మైకంలో వున్నావు. ఊహాలోకాల్లో తేలిపోతున్నావు. ఊహాలోకాల్లో నువ్వేమేమి చూశావో, ఏమేమి ఊహించుకున్నావో అన్నీ నిజం చేస్తాను. కానీ ఒక్కసారి మైకంలోంచి బయటపడు. నేను చెప్పేది శ్రద్ధగా విను—"

"అన్నీ శ్రద్ధగానే విన్నాను. నీ తృప్తికోసం మళ్ళీ వింటాను. చెప్పు!" అన్నాడు సుగుణ్.

"నేను నిన్ను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను—" అన్నది లీల.

"థాంక్స్!" అన్నాడు సుగుణ్.

"పెళ్ళి గురించి నిన్ను అందరు ఆడవాళ్ళలా తాళి కట్టమనిగానీ, రిజిస్ట్రారాఫీసుకు తీసుకువెళ్ళమనిగానీ బాధించను. మనమిద్దరం కలిసి వుంటాం. ఒకరినొకరు నమ్ముకుంటాం. ఆ నమ్మకం ఉన్నంత కాలం భార్యాభర్తలం. లేని రోజున విడిపోతాం. నా మటుకు నాకు మనం శాశ్వతంగా కలిసి ఉంటామని నమ్మకం ఉన్నది"

అన్నది లీల.

"నాకూ ఉంది—" అన్నాడు సుగుణ్.

"ఎట్లాచ్చీ మనం కలిసి ఉండడం ప్రారంభించిన రోజునుంచి నీవు నాకు మొదటి నెల రోజుకు వంద రూపాయల చొప్పున జీతంగా ఇవ్వాలి. రెండవ నెలలో రోజుకు డెబ్బైఅయిదు రూపాయలు. మూడవ నెల యాభై. నాల్గవ నెల పాతిక. ఆ తర్వాత నుంచీ నీవు నాకు జీతం ఇవ్వనవసరంలేదు—"

"చాలా బాగుంది—" అన్నాడు సుగుణ్.

"ఏ నెల జీతం ఆ నెల ఆరంభంలో నే అడ్వాన్స్‌గా ఇవ్వాలి—"

"మొత్తం నాలుగు నెలల జీతమూ ఒక్కసారే అడ్వాన్స్‌గా ఇస్తాను...."

"నువ్వు....నువ్వు....నిజంగా చాలా మంచివాడివి. నిన్ను జీవిత భాగస్వామిగా పొందబోతున్నందుకు నాకెంతో సంతోషంగా వున్నది—" అన్నది లీల.

"లీలా! నీ విలువ నీకు తెలియడంలేదు. నీ అందానికి వెల కట్టమంటే రోజుకు వేలతో ఇచ్చేవాళ్ళుంటారు. నువ్వు ఇంత చవకగా నా స్వంతం కావడం నాకెంతో ఆనందంగా వుంది—" అన్నాడు సుగుణ్.

లీల గర్వంగా నవ్వి—"నా విలువ నాకు తెలుసు. నాకు సినిమా ఆఫర్సు కూడా వచ్చాయి. అయితే గాను గద్దు జీవితం నాకు ఇష్టంలేదు. స్వేచ్ఛగా, స్వతంత్రంగా నచ్చినవాడితో జీవితం గడపగలిగితే అంతకంటే అదృష్ట మేముంటుంది—అడదానికి! నాకు డబ్బాశలేదు. సుఖ ప్రదమైన జీవితం...." అని ఆగి సుగుణ్ వంక చూసింది.

సుగుణ్ ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకుని ముద్దు

పెట్టుకోబోయాడు. ఆమె మృదువుగా విడిపించుకుని—"రేపు డబ్బు తీసుకునిరా. అది బ్యాంకులో నా అకౌంట్లో జమ చేసుకున్నాక—నేను నీతో కలిసి మీ యింటికి వచ్చేస్తాను. ఆ పైన నేను పూర్తిగా నీ దాన్ని!" అన్నది.

## 2

పార్కు దాటి రాబోతూండగా సుగుణ్ భుజంమీద ఎవరిదో చెయ్యి పడింది. సుగుణ్ వెనక్కు తిరిగి తనకు కనబడిన అపరిచితుడివంక ఆశ్చర్యంగా చూశాడు.

"ఎనిమిది వేల రూపాయలతో ఓ అందాలరాశిని నాలుగు నెలలపాటు బుక్ చేసుకున్నానని చాలా సంతోషిస్తున్నావు కదూ!" అన్నాడా అపరిచితుడు.

సుగుణ్ తడబడ్డాడు. యెవరితడు? తన విషయం ఇతడికెలా తెలిసింది? ఇప్పుడితడు తనతో ఏం చెప్పబోతున్నాడు?

"అవును...." అన్నాడు సుగుణ్ ముక్తసరిగా.

"పద—నీతో చాలా మాట్లాడాలి—" అన్నాడా అపరిచితుడు.

సుగుణ్ కి లీల విషయమే విచిత్రంగా వున్నది.

సుగుణ్ కి ఓ ఫ్యాన్సీ దుకాణం వున్నది. దానిమీద బాగా సంపాదించుకుంటున్నాడు. మనిషి యెర్రగా బుర్రగా బాగుంటాడు. లీల అతడి దుకాణంలోనికి వచ్చింది, తిన్నగా సుగుణ్ వద్దకే వెళ్ళింది.

"నీతో మాట్లాడాలి—పార్కుకి వస్తావా?" అనడిగింది.

లీలను చూసీ చూడగానే అతడి కళ్ళకు మైకం కమ్మింది. వెంటనే ఆమెను అనుసరించి వెళ్లాడు. ఆమె

వివాహం గురించి మాట్లాడింది. అన్నీ అతడికి నచ్చాయి.

కానీ—ఆమె ఎవరు? తన వద్దకే ఎందుకు వచ్చిందీ— అన్న ఆలోచన అతడికి కలగలేదు.

ఇప్పుడు....

సుగుణ్ అతడిని అనుసరించాడు. అప్పటికి లీల వెళ్ళిపోయి అయిదు నిముషాలవుతుంది. ఆమె వెళ్ళగానే ఆమె కూర్చున్న స్థలాన్నే తాకుతూ కొద్ది క్షణాలు గడిపి అతడు పార్కులోంచి బయటకు వచ్చాడు. అతదెవరో లీల గురించి మాట్లాడుతున్నాడు. అతడు తనకు ఏం చెబుతాడు?

ఇద్దరూ మళ్ళీ పార్కులో కూర్చున్నారు.

అదేచోట....ఇందాకా లీల కూర్చున్న స్థానంలో అతడు కూర్చున్నాడు. తన స్థానం మారలేదు.

"ఎవరు నువ్వు?" అన్నాడు సుగుణ్.

"నీ పేరు సుగుణ్ అని నాకు తెలుసు. నా పేరు చలం అనుకో. ఇందాకా నువ్వూ, లీలా మాట్లాడుకున్నవన్నీ నేను విన్నాను—"

"ఎందుకు విన్నావు?" చిరుకోపంగా అన్నాడు సుగుణ్.

"లీల గురించి నీకంటే నాకు ఎక్కువ తెలుసు—" అన్నాడు చలం.

"నాకు లీల గతంతో నిమిత్తం లేదు-" అన్నాడు సుగుణ్.

"ఒకవేళ లీల గతం నీకు భవిష్యత్తులేకుండా చేస్తే?"

"అంటే?" అన్నాడు సుగుణ్ ఆశ్చర్యంగా,

"లీల కామినీ పిశాచి అన్న విషయం నీకు తెలుసా?"

"కామినీ పిశాచి....అంటే?" సుగుణ్ తెల్లబోతూ

అడిగాడు.

చలం మాట్లాడకుండా సుగుణ్ ముఖంలోకే చూస్తూ కూర్చున్నాడు.

"లీల మనిషి కాదా?" ఆలోచిస్తూ అడిగాడు సుగుణ్.

"ఆ సంగతి నాకు తెలియదు. కానీ ఆమె ఏ మగాణ్ణి కోరుకుంటే అతడు-మృత్యువును ఆహ్వానించినట్లే! ఆమె కోరిక తీరేలోగానే అతడి ఆయువు చెల్లిపోతుంది. అందుకే ఆమె కామినీ పిశాచి అన్నాను-" అన్నాడు చలం.

సుగుణ్ లీలను గుర్తుచేసుకున్నాడు. ఆ రూపంలో పిశాచ లక్షణాలెక్కడా కనబడలేదు. పైగా అతడికి ఆమెపై మరింత మోహం కలిగింది.

"కాదు-" అన్నాడు సుగుణ్—"నువ్వు ఆమెను కోరుతూంటే-ఆమె నీకు లభించకపోతే-ఈ విధంగా ఆమెపై దుష్ప్రచారం ప్రారంభించావని నా నమ్మకం. ఇది చాలా పెద్ద తప్పు. ఇలాంటి తప్పు ఇంకెవ్వరూ క్షమించరు...."

"నువ్వు క్షమించవద్దు. ఎల్లుండిదాకా బ్రతికివుంటే" అని లేచాడు చలం.

# 3

సుగుణ్, లీల ఇద్దరూ బ్యాంకునుంచి బయటకు వచ్చారు.

"చాలా థాంక్స్-అన్న మాట ప్రకారం నాలుగు నెలలకు ముందుగానే డబ్బు ఇచ్చేశావు. నీవంటివాడితో జీవితాంతం ఉండగలనని నమ్మకం-" అన్నది లీలం.

"అదే నా కోరిక-" అన్నాడు సుగుణ్.

"ఈ క్షణంనుంచీ నేను నీదాన్ని-" అన్నది లీల.

"ఆ ఆలోచ నే నన్ను పరవశింపజేస్తోంది-" అన్నాడు సుగుణ్.

"నీ యింటికి వెడదామా!"

"వద్దు—" అన్నాడు సుగుణ్— "నీవు పట్టింపు లేకపోయినా నాకు కొన్ని పట్టింపులున్నాయి. నువ్వు సరిగ్గా సాయంత్రం ఆరింటికి మా యింటికిరా. అప్పుడు కొన్ని తతంగాలున్నాయి—"

"నీ యిష్టం—" అని వెళ్ళిపోయింది లీల.

సుగుణ్ తిన్నగా తన స్నేహితుడు రాంగోపాల్ దగ్గరకు వెళ్ళాడు. అతడిది పుస్తకాల షాపు.

"నీతో మాట్లాడాలి!" అన్నాడు సుగుణ్.

"పద-" అన్నాడు రాంగోపాల్.

పుస్తకాల షాపులో-కాస్త వెనగ్గా ఓ చిన్న గది వున్నది. అది రాంగోపాల్ ప్రయివేట్ గది. ఇద్దరూ అందులోకి వెళ్ళి కూర్చున్నారు.

"నీవు చెప్పకుండా నేనో పని చేశాను-" అన్నాడు సుగుణ్.

"చెప్పు-"

సుగుణ్ అతడికి లీల గురించి చెప్పాడు.

"ఎక్సలెంట్ ఆఫర్-వెరీ చీప్!" అన్నాడు రాంగోపాల్.

"అప్పుడే అంతా పూర్తికాలేదు-" అంటూ సుగుణ్ చలం హెచ్చరిక గురించికూడా స్నేహితుడికి చెప్పాడు.

రాంగోపాల్ సాలోచనగా-"ఆశ్చర్యంగా వుందే?" అన్నాడు.

"ఆశ్చర్యపడితే చాలా-భయం కూడా పడాలా

అన్నది నా సమస్య ..."

"ఇప్పుడు నువ్వామెకు డబ్బు కూడా ఇచ్చి వచ్చావు. అవునా?"

"అవును ..."

"ఒకవేళ డబ్బుతో ఆమె పారిపోతే....?"

సుగుణ్ నవ్వి-"బ్యాంకులోంచి బయటకు వచ్చేక రెండు గంటలవరకూ ఆమెను ఎంగేజ్ చేశాను. అంటే ఈ రోజుకు డబ్బు తీసుకుని పారిపోలేదు కదా-ఈ రోజు ఆమె నా యింటికి రాకపోతే రేపు బ్యాంకు దగ్గర కాసి నా ఏర్పాట్లు నేను చూసుకుంటాను. ఇవన్నీ ముందు జాగ్రత్తకోసం తప్పితే-ఆమెపైన నాకు పూర్తి నమ్మక ముంది. ఆమెను చూడగానే అమాయకురాలు అని పిస్తుంది—" అన్నాడు.

"అందమైన ఆడవాళ్ళంతా అమాయకంగానే అగు పిస్తారు. అది సరే నువ్వు ఆమె రాకపోతే ఏర్పాట్ల సంగతి చూసుకున్నావు....ఒకవేళ ఆమె వస్తే...."

"వస్తే సమస్యేలేదు...."

"ఈ వేళ వచ్చి-రేపు డబ్బు తీసుకుని పారిపోతే?"

సుగుణ్ మాట్లాడలేదు.

"అంటే ఒక రాత్రికి ఎనిమిదివేలు...."

"ఆమె అలా చేస్తుందని నేననుకోవడంలేదు. నేనామెను ప్రేమించాను. ఆమె కూడా నన్ను ప్రేమించి నట్లే కనబడుతోంది. ఈ రోజు అందుకే పెద్ద తతంగం చేయదల్చుకున్నాను. నిన్నూ - మరో నలుగురైదుగురు తెలిసిన వాళ్ళనూ పిలిచి ఆమెను నా భార్యగా పరి చయం చేయదల్చుకున్నాను. ఒక ఫోటోగ్రాఫర్ని కూడా ఏర్పాటు చేస్తాను. అతడు ఫోటోలు తీస్తాడు. ఆపైన

పురోహితుడు. మేమిద్దరమూ దండలు మార్చుకునేటప్పుడు ఆయన వెళ్ళి మంత్రాలు చదువుతాడు...."

"ఇదంతా ఎందుకు?" అన్నాడు సుగుణ్.

"నాతో కలిసి వుండడం ఆమెకు బాధ్యగా మారాలి. అలాగే ఆమెలో పిశాచి లక్షణాలేమైనా వుంటే పురోహితుడి మంత్రాలతో అవీ బయటపడతాయి...."

రాంగోపాల్ నవ్వి-"నువ్వు చాలా అమాయకుడివి" అన్నాడు.

"ఏం?" అన్నాడు సుగుణ్.

"మగవాడు తన్ను మోసం చేస్తాడేమోనని భయపడి ఆడది అన్ని జాగ్రత్తలూ తీసుకుంటుంది. నువ్వు ఆడదానికి భయపడుతున్నావు. నువ్వు చెప్పేవన్నీ వింటూంటే ఆ అమ్మాయి నీకు తగదనిపిస్తోంది. నీకు మంచి అమ్మాయిని నేను చూస్తాను. అనవసరంగా తొందర పడకు. ఈమె గురించి పదిమందికీ తెలియనివ్వకు. గుట్టు చప్పుడు కాకుండా నీ ఎనిమిదివేల నిలువా రాబట్టుకో. ఆ తర్వాత నువ్వే ఆమెను వదిలేసేయ్.."

"నువ్వు ఇలాంటి సలహా ఇస్తావని నేననుకోలేదు...." అన్నాడు సుగుణ్ నీరసంగా.

"నా మాట విను. అనుభవంమీద చెబుతున్నాను. ఆమెను భార్యగా చేసుకోవాలన్న ప్రలోభానికి లోను కాకు. ఇప్పుడు నేనిచ్చిన సలహాను ఓ వారం రోజుల తర్వాత నువ్వే మెచ్చుకుంటావు. ఆడది అందేవరకూ— ఆమె జీవితాంతం కావాలనిపిస్తుంది. ఒకసారి అందిన ఆడది-మగాడి ఆకర్షణను కోల్పోతుంది. కొత్త రుచులు కోరడం మగబుద్ధి...." అన్నాడు రాంగోపాల్.

"నాకు అలా అనిపించడంలేదు. కానీ నీ సలహా మాత్రం పాటిస్తాను...." అన్నాడు సుగుణ్.

# 4

చలం పార్కులోని ఆ జంటనే గమనిస్తున్నాడు. అతడా జంటకు చాలా దగ్గర్లో వున్నాడు. కానీ తను ఆ జంట కళ్ళబడకుండా అతడు జాగ్రత్త తీసుకున్నాడు. వాళ్ళు మాట్లాడుకునే మాటలన్నీ అతడికి వినబడుతున్నాయి.

కాసేపటికి ఆమె లేచి వెళ్ళిపోయింది.

అతడు మాత్రం అక్కడే కూర్చుని వున్నాడు. చలం అతడిని సమీపించి—"కంగ్రాట్యులేషన్స్!" అన్నాడు.

అతడు ఆశ్చర్యంగా చలాన్ని చూసి—"మీరెవరో నాకు తెలియదు-" అన్నాడు.

"అందుకే కంగ్రాట్యులేషన్స్ చెప్పాను" అన్నాడు చలం.

"నాకేమీ అర్థంకాలేదు" అన్నాడతను.

"నేనెవరో మీకు తెలియదు. అయినా మీకు నా పరిచయం లభించింది. అందుకే అభినందిస్తున్నాను-" అన్నాడు చలం.

"మీ పరిచయం అంత గొప్పదా?" అన్నాడతను.

"ఈ పరిచయంవల్ల పోవలసిన మీ ప్రాణాలు నిలబెట్టబడాయనుకోండి. అప్పుడు నా పరిచయం గొప్పదవుతుందా, కాదా?"

"మిస్టర్ - మీ డొంకతిరుగుడు మాటలు కట్టిపెట్టి అసలు విషయం చెప్పండి. నాకేమీ అర్థంకావడం లేదు—"

చలం దీనంగా ముఖంపెట్టి - "అయితే తిన్నగానే

చెబుతాను. మీ ప్రాణాలిప్పుడు ప్రమాదంలో వున్నాయి. వాటిని కాపాడుకోవడం మీ చేతుల్లోనే వున్నది—" అన్నాడు.

"నా ప్రాణాలు ప్రమాదంలో వున్నాయా, ఎలా?"

"ఇంతవరకూ మీతో మాట్లాడి వెళ్ళిన ఆ అందాల రాశి గురించి నాకు పూర్తిగా తెలుసు. ఆమె కామినీ పిశాచి...."

అతడు తెల్లబోయి - "కామినీ పిశాచి .... అంటే?" అన్నాడు.

"కామినీ పిశాచితో సంపర్కం లభిస్తే - మనిషి క్రమంగా క్షీణించిపోయి - ఆఖరుకు చచ్చిపోతాడు. ఈమెను ప్రియురాలిగా స్వీకరిస్తే — మీరు క్షీణిస్తారో లేదో చెప్పలేను కానీ—చావడం తథ్యం—" అన్నాడు చలం.

అతడు జాలిగా చలంవంక చూసి-"మిస్టర్-మీరు ఆమెను ప్రేమిస్తున్నారా? లేనిపక్షంలో ఆమెపై పగ పట్టి వుండాలి!" అన్నాడు.

"ఆ రెండు విషయాలూ మీకు అనవసరం. మీ కళ్ళలో నాపై జాలి కూడా కనపడుతోంది. అదీ అనవసరమే! ఇటీవలే ఒకతను నా సలహాను పెడచెవిని పెట్టి నిండు జీవితాన్ని కోల్పోయాడు—" అన్నాడు చలం.

"ఎవరతను?"

"అతడి పేరు చెబుతాను. అడ్రసు కూడా ఇవ్వగలను!"

"చెప్పండి!"

"అతడి పేరు సుగుణ్ ...."

# 5

"నా పేరు ప్రకాష్!" అన్నాడతను.

"కూర్చోండి—" అన్నాడాయన.

"సుగుణ్ మీ అబ్బాయే కదూ!"

ఆయన ముఖం గంభీరంగా మారిపోయింది—"ఇప్పుడు మీకు వాడి ప్రసక్తి ఎందుకు?"

"మీ అబ్బాయి అర్ధాంతరంగా హత్య చేయబడ్డాడని విన్నాను. అందుకు కారణాలు తెలుసుకుందామని వచ్చాను...."

"మా అబ్బాయి హత్యచేయబడడమా — అలాగని ఎవరు చెప్పారు మీకు?" అన్నాడాయన ఆశ్చర్యంగా.

"చెప్పలేదు. ఊహించాను—"

"మీ ఊహ పొరపాటు. మా అబ్బాయి ఆత్మహత్య చేసుకున్నాడు—" అన్నాడాయన.

ప్రకాష్ సాలోచనగా — "నేను విన్నదేమిటంటే మీ అబ్బాయిని ఒక కామినీ పిశాచి ఆవహించిందని—" అన్నాడు.

"అలాంటివేమీ మాకు తెలియవు." అన్నాడాయన.

"దయుంచి ఏం జరిగిందో మీరు నాకు చెప్పగలరా?"

"గతాన్ని కెలకకండి. నేను తట్టుకోలేను...."

"ప్లీజ్ — మీరు నిజం చెప్పకపోతే నేనూ మీ అబ్బాయికిలాగే చనిపోయే అవకాశం వున్నది—" అన్నాడు ప్రకాష్.

ఆయన ప్రకాష్ పరిస్థితి విన్నాక జాలిపడి కొన్ని వివరాలు చెప్పాడు. ప్రకాష్ శ్రద్ధగా విన్నాడు.

ఆయనకు నలుగురు కొడుకులు. సుగుణ్ మూడవవాడు. అతడికి చదువు తిన్నగా రాలేదు. అల్లరిచిల్లరిగా తిరుగు

తున్నాడని తండ్రి రోజూ తన్నేవాడు. టెన్తు క్లాసు పరీక్ష తప్పాడని తండ్రి చావగొడితే ఇంట్లోంచి పారి పోయాడు సుగుణ్. అతడి కోసం పేపర్లో ప్రకటన వేయించినా ఫలితం లేకపోయింది.

ఓ ఏడాది తర్వాత సుగుణ్ ఆ ఊళ్లోనే ఫ్యాన్సీ షాపు తెరిచాడు. ప్రారంభోత్సవానికి ఇంటిల్లపాదినీ పిలిచాడు. ఆ తర్వాత ఇంటికి మాత్రం రాలేదు. తల్లి నిత్యం ప్రతిమాలుతూ వుండేది. నలుగురు కొడుకుల్లోకీ సుగుణ్ పరిసితే మెరుగ్గా వున్నదనిపించుకుని ఆర్నెల్ల క్రితం ఇంటికి వచ్చాడు సుగుణ్. అయితే ఇంట్లో ఎల్ల కాలం వుండననీ—త్వరలోనే పెళ్ళిచేసుకుని బయటకు వెళ్ళిపోతాననీ సుగుణ్ తల్లికి చెప్పాడు. పెళ్ళి విష యంలో తలిదండ్రులమాట విననని కూడా అతడు స్పష్టం చేశాడు.

సుగుణ్‌కు వేరే ఇల్లు వుంది. అది చిన్న డాబా యిల్లు. సుగుణ్ స్వార్జితంగా కొనుక్కున్న ఇల్లు అది. సుగుణ్ అప్పుడప్పుడు రాత్రిళ్ళు అక్కడ గడుపుతూండే వాడు. అతడికాట్టే మాచి పేరు లేదు. తలిదండ్రులకు అతడు ధనసాయం చేస్తున్నాడు. ఇంట్లో మంచిగా వుంటున్నాడు. అందుకని అతడి గురించి ఇంట్లో ఎవ్వరూ ఏమీ అనేవారు కాదు. అందులోనూ అతడి మన స్తత్వం గురించి అందరికీ బాగా తెలుసు.

చనిపోయే రోజున సుగుణ్ బ్యాంకునుంచి ఎనిమిది వేలు తీశాడు. ఆ డబ్బు లీల అనే యువతికివ్వాలని అతడు ముందు రోజు డైరీలో రాసుకున్నాడు. ఆ రోజు అతడు ఆ డబ్బును లీలకు ఇచ్చాడనీ, సాయంత్రం తన యింట్లో లీలను భార్యగా ప్రవేశపెట్టదలిచాడనీ సుగుణ్

స్నేహితుడు రాంగోపాల్ చెప్పాడు.

సుగుణ్ సాయంత్రం నాలుగింటికి ఇంటికి వచ్చాడు. వివాహం గురించి ఇంట్లో ఏమీ చెప్పలేదు. నాలుగున్నర ప్రాంతాల ఓ పెద్ద కేక పెట్టాడు. డాక్టర్ని పిలిచారు. డాక్టరు వచ్చేలోగా అతడి ప్రాణం పోయింది. డాక్టరు పోలీసుల్ని పిలవమన్నాడు. సుగుణ్ కి విషప్రయోగం జరిగిందన్నాడు. పోలీసుల్ని పిలిచారు. వాళ్ళు బాగా విచారించారు. సుగుణ్ తలిదండ్రులకోసం ఏమీ వుంచలేదు. ఫ్యాన్సీ దుకాణం సుగుణ్ పేరు నే వున్నది. పది రోజులకు ముందు అతడు దానిని మరొక పేరుకు మార్చాడు.

పోలీసులు సుగుణ్ తలిదండ్రులను అనుమానించలేదు. అతడు వారికి స్వయానా కొడుకు. ఆపైన అతడి మరణం వల్ల వారికే ప్రయోజనమూ లేదు. వారు గోవిందరావును అనుమానించారు. ఫ్యాన్సీ దుకాణం గోవిందరావు పేరుకు మారిన తర్వాత పదిరోజుల్లో నే సుగుణ్ మరణించాడు.

అయితే పోలీసుల అనుమానం సరైనదికాదు. గోవిందరావు లక్షలకు అధిపతి. ఓ చిన్న ఫ్యాన్సీ దుకాణం కోసం హత్య చేయాల్సిన అవసరం అతడికిలేదు. ఆపైన సుగుణ్ ఫ్యాన్సీ దుకాణాన్ని గోవిందరావు పేరుకు మార్చడానికి కారణమున్నది. అతడు దానిని గోవిందరావుకు కుదువబెట్టాడు.

గోవిందరావును అడిగితే-సుగుణ్ తలమునిగే అప్పుల్లో వున్నాడని - తనకు యాభై వేలు బాకీపడి_దుకాణాన్ని కుదువబెట్టాడనీ — అతణ్ని నిరాశా నిస్పృహాలు ఆవరించాయనీ ఆత్మహత్య చేసుకోవాలనుందని అంటూండే వాడనీ చెప్పాడు.

గోవిందరావు చెప్పిన నిరాశా నిస్పృహలు సుగుణ్ ముఖంలో — తలిదండ్రులెన్నడూ చూడలేదు. అయితే అతడు చాలా గుట్టయిన మనిషి. తనవారివద్ద తన ఓటమిని అంగీకరించే మనస్తత్వం కాదు అతడిది.

పోలీసులు ఆత్మహత్యగా నిరూపించారు. అందరూ అది సబబు అని అనుకున్నారు. కేసు తేలిపోయింది.

"మరి—లీల విషయం ఏమిటి?" అన్నాడు ప్రకాష్.

"సుగుణ్ డైరీలో ఒక విశేషం వున్నది. వాడు లీల అనే అమ్మాయిని భార్యగా స్వీకరించదలిచాడు. ఆ అమ్మాయి కామినీ పిశాచి అని ఒకతను వాడిని హెచ్చరించాడు. ఆ డైరీని మేము పోలీసులకు చూపించలేదు. ఆ హెచ్చరిక ప్రకారమే సుగుణ్ మరణించాడు—" అన్నాడు సుగుణ్ తండ్రి.

## 6

"చెప్పండి!" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"లీల అనే అమ్మాయి నన్ను కోరింది. తనకు మగవాడి అండ కావాలనీ — తను అసలైన భార్యలా అణగిమణగి ఉంటాననీ— నేను అసలైన భర్తలా తనకోసమే జీవించనవసరంలేదనీ చెప్పింది. ఆమె నాకు నచ్చింది. నాలుగు నెలలపాటు నాతో ఉండడానికి ఆమె ఎనిమిదివేలు అడిగింది. ఇచ్చేద్దామనే నిర్ణయించుకున్నాను" అన్నాడు ప్రకాష్.

"ఇది పూర్తిగా మీ వ్యక్తిగత విషయం" అన్నాడు వెంకన్న.

"అసలు విషయం చెప్పనివ్వండి—" అన్నాడు ప్రకాష్.

"ఉపోద్ఘాతం తగ్గించి త్వరగా చెప్పండి-" అన్నాడు వెంకన్న.

"ఆమె నన్ను కలుసుకుని వెళ్ళిన తర్వాత ఒకతను వచ్చి నన్ను హెచ్చరించాడు. ఆమె కామినీ పిశాచి అనీ ఆమె సంపర్కం నాకు చావుకు తెచ్చిపెడుతుందనీ అని—సుగుణ కేసు ఉదాహరణగా ఇచ్చాడు...." అంటూ జరిగింది పూర్తిగా వివరించాడు.

"అంతా నోట్ చేసుకున్నారా?" అన్నాడు వెంకన్న తన అసిస్టెంట్సువంక చూసి.

సీతమ్మ, రాజమ్మ తలలూపారు.

"ఒకసారి చదవండి—" అన్నాడు వెంకన్న.

సీతమ్మ, రాజమ్మ ఏక కంఠంలో నోట్సు చదివారు.

"ఇద్దరూ ఒక్కలాగే రాసుకున్నారే!" అన్నాడు ప్రకాష్ ఆశ్చర్యంగా.

"నా అసిస్టెంట్సు టేపురికార్డును మించినవాళ్ళు. వాళ్ళిద్దరూ ఒక్కలాగే రాశారని ఆశ్చర్యపోక—మీరు చెప్పిందంతా వాళ్ళు తిన్నగా నోట్ చేసుకున్నారో లేదో చెప్పండి—" అన్నాడు వెంకన్న.

ప్రకాష్—"నేను చెప్పింది వాళ్ళ నోటంట వింటూంటే—ఒకే విషయాన్ని కొందరు నాలా అసహ్యంగానూ, కొందరు మీ అసిస్టెంట్సుకిలా అందంగానూ కూడా చెప్పవచ్చునన్న కొత్త విషయాన్ని తెలుసుకున్నాను—" అన్నాడు.

వెంకన్న తన విసుగును బయటకు ప్రదర్శించలేక మనసులోనే విసుక్కున్నాడు. అతడి అసిస్టెంట్సు వయసులో వున్న అందమైన ఆడపిల్లలు. కొందరు క్లయింట్సు కేవలం వాళ్ళకోసమే వస్తారని అతడికి

తెలుసు. నిజంగా ఆపదలో వున్న వాళ్ళు పరిసరాలను గుర్తించలేరు. ప్రకాష్ ప్రవర్తననుబట్టి అతడు నిజంగా ఆపదలో లేడని వెంకన్నకు అనిపించింది.

"సుగుణ్ మరణం గురించి నాకు తెలుసు. యెక్కడెక్కడి నేరాలకు సంబంధించిన వార్తలూ నాకు వస్తాయి. అతడిని కామినీ పిశాచి గురించి ఎవరో హెచ్చరించారన్న విషయం మాత్రం మీవల్లనే నాకు తెలిసింది. ఇంతకూ మీరు వచ్చిన పని చెప్పండి. నాకు చేతనైన సాయం చేస్తాను..." అన్నాడు వెంకన్న.

"నేను లీలను వివాహం చేసుకుందామనుకుంటున్నాను. ఆమె షరతులు నాకు నచ్చాయి. మా వివాహం నా ప్రాణాలకు ప్రమాదం కలగకుండా మీరు నన్ను కాపాడాలి—" అన్నాడు ప్రకాష్.

వెంకన్న కాస్త చిరాగ్గా—"నేను విషం తాగాలనుకుంటున్నాను. నాకు చావు రాకుండా కాపాడండి— అని నా దగ్గరకు వస్తే నేనేం చెప్పాలి?" అన్నాడు.

"లీలను వివాహం చేసుకోవడమూ—విషం తాగాలనుకోవడమూ ఒకటేనని మీ అభిప్రాయమా?"

"నా అభిప్రాయం అది కాదు. భార్యభర్తను చంపాలనుకుంటే అందుకు ఎన్నో అవకాశాలు. మీరిద్దరూ విడిగా వుంటే తప్ప, ఆమెనుంచి మిమ్మల్ని కాపాడడం మాకు సాధ్యపడదు...."

"నా అనుమానం నన్ను హెచ్చరించిన చలం అనే వ్యక్తిమీద వున్నది - మీరతడిని కనిపెట్టి వివరాలు సేకరించాలి. అందుకు అడ్వాన్సుగా వెయ్యి రూపాయలు ఇస్తాను...." అన్నాడు ప్రకాష్.

"అడ్వాన్స్ వద్దు. వివరాలు సేకరించాక నేనే మీ

నుంచి అయిదువేల రూపాయలు ఫీజు వసూలు చేస్తాను"
అన్నాడు వెంకన్న.

ప్రకాష్ వెళ్ళిపోయాడు.

"బాస్ - అడ్వాన్సు ఎందుకు వద్దన్నారు?" అంది సీతమ్మ.

"ఇలాంటి కేసులు నేను తీసుకోను. ప్రకాష్ అలా వెళ్ళగానే ఇలా మన బాధ్యత తీరిపోయింది-" అన్నాడు వెంకన్న.

"పాపం-అతడు నిజంగానే ఆపదలో వున్నాడేమో!" అన్నది రాజమ్మ.

"ఎవరి కర్మకు ఎవరు కర్తలు?" అన్నాడు వెంకన్న.

## 7

అది చిన్న డాబా ఇల్లు.

డిటెక్టివ్ వెంకన్న కారు ఆ ఇంటిముందు ఆగింది. అందులోంచి వెంకన్న దిగి ఆ యింటి తలుపు తట్టాడు.

సుమారు పదహారేళ్ళ కుర్రాడు ఆ ఇంటి తలుపు తీశాడు.

"మిస్ లీల - ఈ యింట్లో వుంటున్నదా?" అన్నాడు వెంకన్న.

"లోపలకు రండి-" అన్నాడా కుర్రాడు.

వెంకన్న లోపలకు వెళ్లాడు.

పెద్ద హాలు. ఆ హాలుకు అనుకుని వున్న ఓ గదిలో లీల అద్దెకుంటున్నది. ఆ సమయంలో లీల గదిలోనే వున్నది.

వెంకన్న తలుపు తట్టాడు. లీల తలుపుతీసి అతడివంక ప్రశ్నార్థకంగా చూసింది.

"నా పేరు వెంకన్న. నేను డిటెక్టివును...."

"నమస్కారం-" అన్నది లీల. ఆమె కనులనుంచి ప్రశ్నార్థకం మాత్రం తొలగిపోలేదు.

వెంకన్న లీలను పరీక్షగా చూశాడు. చెప్పలేనంత అందం ఆమెది. ఆమె కనులలో లీలగా మెరిసే ఆహ్వానం ఏ పురుషుడికైనా మతి పోగొడుతుంది. ఈమె కామినీ పిశాచి అంటే నమ్మవచ్చునని అనుకున్నాడు వెంకన్న.

లీల అతడికి కుర్చీ చూపించింది. తనూ కూర్చుంది.

"నీవు మళ్ళీ ఎవరినైనా ప్రేమిస్తున్నావా?" అన్నాడు వెంకన్న.

లీల అతడి ప్రశ్న అర్థంకానట్లు చూసింది.

"నువ్వు సుగుణ్ని ప్రేమించావు. అతడు మరణించాడు. ప్రకాష్‌ని ప్రేమించావు. అతడూ మరణించాడు. మళ్ళీ ఇప్పుడు ఎవరినైనా ప్రేమిస్తున్నావేమో తెలుసుకుందామని వచ్చాను..."

లీల ఆశ్చర్యంగా - "మీకివన్నీ యెలా తెలుసు?" అంది.

"నేను డిటెక్టివునని ముందే చెప్పాను-" అన్నాడు వెంకన్న.

"మీరు డిటెక్టివు అయితే మాత్రం - అందరికి సంబంధించిన విషయాలూ తెలియాలని లేదుగదా—" అన్నది లీల.

"నిజమే! కానీ - నన్ను ప్రకాష్ అడిగాడు - తన ప్రాణాలు రక్షించమని!"

లీల ఆశ్చర్యంగా - "తను చనిపోతానని ప్రకాష్‌కు ముందే తెలుసా?" అన్నది.

"ప్రకాష్‌కే కాదు. సుగుణ్‌కి కూడా తెలుసు. నీ మైకంలోపడి వాళ్ళిద్దరూ ప్రాణాలకు కూడా లెక్క

చేయలేదు-"

"మధ్య నే నేం చేశాను-" అన్నది లీల.

చలం కామినీ పిశాచి గురించి హెచ్చరించిన విషయం లీలకు చెప్పాడు వెంకన్న.

లీల తెల్లబోయి - "ఎవరతను? నా గురించి అలా ఎందుకు చెప్పాడు?" అన్నది.

"అత దెందుకు చెప్పాడో నీకు తెలియాలి. కానీ అతడు చెప్పింది నిజంగా జరిగింది-" అన్నాడు వెంకన్న.

"మీరిప్పుడు నా దగ్గరకు యెందుకు వచ్చారు?" అన్నది లీల.

"ప్రకాష్ నన్ను తన ప్రాణాలు రక్షించమని అడిగాడు. నేనది సీరియస్‌గా తీసుకోలేదు. అతడి ప్రాణాలు పోయాయి. నిజం తెలుసుకోవడం నా బాధ్యత. పోలీసులు ప్రకాష్‌ది ఆత్మహత్య అని తీర్మానించారు. కానీ నేనది నమ్మడంలేదు. ప్రకాష్ నీతో వైవాహిక జీవితం గురించి కన్న కలలు అతడి కళ్ళలో చూశాను నేను-" అన్నాడు వెంకన్న.

లీల దిగులుగా - "అంతా నా దురదృష్టం-" అన్నది.

"ఒకరి దురదృష్టం - ఇంకొకరికి అదృష్టం అవుతుంది. నీకు ఇద్దరి ప్రేమికులనుంచి రెండెనిమిదులు - పదహారు వేలు వచ్చాయి-" అన్నాడు వెంకన్న.

"అంటే పదహారువేలకోసం నేనీ హత్యలు చేశానంటారా?"

"నేననలేదు. తెలుసుకోవాలి-"

"నాకేమీ తెలియదు...."

"ఆ నమ్మకం నాకు కలగాలంటే నేనడిగిన కొన్ని ప్రశ్నలకు జవాబు చెప్పాలి. ముందు చలం యెవరో

చెప్పు!" అన్నాడు వెంకన్న.

"నేనతణ్ణి చూడలేదు. అతడెవరో నాకు తెలియదు."

"చలం అన్న పేరుగల వ్యక్తి నీకు తెలియదా?"

తల అడ్డంగా ఊపింది లీల.

"పోనీ__నీ ప్రియులను హత్య చేయడానికి తగిన కారణాలుగల వ్యక్తి ఎవరైనా వున్నాడా?" అన్నాడు వెంకన్న.

లీల ఏదో చెప్పబోయి ఆగిపోయింది.

"అది నాకు చాలా పనికివచ్చే సమాచారం అవుతుంది. నీకు తెలిసింది చెప్పడం నీకే మంచిదవుతుంది-" అన్నాడు వెంకన్న.

"నాకేమీ తెలియదు-" అన్నది లీల.

"నీకు తెలుసు-" అన్నాడు వెంకన్న.

"తెలియదు-" అన్నది లీల.

"నీకు తెలిసింది దాచిపెట్టడంవల్ల - బహుశా ఒకరోజున నీవు చేయని హత్యలకు హంతకురాలిగా కోర్టులో నిలబడవచ్చు-" అన్నాడు వెంకన్న.

"నిజంగా నాకేమీ తెలియదు-" అన్నది లీల.

"ఎవరి కర్మకు ఎవరు కర్తలు?" అంటూ వెంకన్న అక్కణ్ణుంచి బయటపడ్డాడు.

## 8

డిటెక్టివ్ వెంకన్న ఇలా వెళ్ళగానే అలా ఓ అమ్మాయి ఆ యింట్లో ప్రవేశించి - లీల గదికి వెళ్ళింది.

ఆమె వెళ్ళేసరికి గదిలో లీల ఏడుస్తోంది.

"లీలా!" అన్నదా యువతి.

లీల తలెత్తి ఆ యువతివంక చూసి కళ్ళు తుడుచుకుంది. ఆమె కళ్ళు ఎర్రగా వున్నాయి.

"ఏడుస్తున్నావా?" అన్నదా యువతి.

లీలకు మళ్ళీ ఏడుపు వచ్చింది. ఆ యువతి లీలను సమీపించి తనే ఆమె కళ్ళు తుడిచి - "నీకో శుభవార్త తీసుకుని వచ్చాను_" అన్నది.

"ఏమిటది?" అన్నది లీల.

"ఇప్పుడు నీ గదిలోనికి డిటెక్టివ్ వెంకన్న వచ్చి వెళ్ళాడు కదా - ఆయనకు నీ గురించిన వివరాలేమైనా చెప్పావా?" అన్నదా యువతి.

"లేదు_"

"వెరీగుడ్-" అన్నదా యువతి-"ఎట్టి పరిస్థితిలోనూ నీ గతం ఇక్కడ బయటపడకూడదు. అసలా డిటెక్టివ్ ఎందుకొచ్చాడు? ఏం చెప్పాడు?"

లీల జరిగింది చెప్పింది.

"ఆ ప్రకాష్ అనుమానస్థుడు. భయస్థుడు. అలాంటి వాణ్ని ఎన్నుకుని నేనో పెద్ద పొరపాటు చేశాను. అనవసరంగా నీ విషయం డిటెక్టివు వరకూ వెళ్ళింది. ఈసారి అలాంటి పొరపాటు జరుగదు-" అన్నదా యువతి.

"మళ్ళీ — ఈసారి అంటున్నావా?" ఆశ్చర్యంగా అడిగింది లీల.

"ఈసారి అనకుండా ఎలా? నీకు సరైన జీవిత భాగస్వామిని వెతికి పెట్టడం నా బాధ్యత...." అన్నదా యువతి.

"కానీ అతను....ఊరుకుంటాడా?"

"అతడి గురించి మన అంచనా తప్పయింది. అనుకున్నది సాధించడంకోసం అతడేమైనా చేస్తాడనుకుంటాను. అందుకే ఈసారి అతడికంటె బలమైన వ్యక్తిని

ఎన్నుకున్నాను. అతడికెవ్వరూ ఏమీ చేయలేరు...."
అన్నదా యువతి.

"నిజంగా?" అన్నది లీల. ఆమె కళ్ళు మెరిశాయి.

"నేను నీకు అబద్ధం చెబుతానా?"

"చెప్పవు...." అన్నది లీల అమాయకంగా.

"అతడికి బలం వుంది. ధనం వుంది. అనుకున్నది సాధించగల పట్టుదల వుంది. ప్రమాదాలకు లెక్కచేయని తెగింపు వుంది. తనకు ప్రమాదం వున్నదనిపిస్తే అతడు డిటెక్టివ్‌ల సాయం మాత్రం కోరడు__" అన్నదా యువతి.

"నీ సాయంతో నేనా జీవిత భాగస్వామిని ఎన్నుకో గలనని ఆశిస్తున్నాను. నీ పరిచయం నా అదృష్టం___"
అన్నది లీల.

"వివేకా గార్డెన్స్‌లో బ్లాక్ కోజెన్ దగ్గర - అతడు నీకోసం ఎదురు చూస్తూంటాడు. అతడు తెల్ల పాంటు - ఎర్ర చొక్కా వేసుకుని ఉంటాడు. నీకంటే తెల్లగా వుంటాడు. సరిగ్గా సాయంత్రం అయిదింటికి వెళ్ళి అతన్ని కలుసుకో-" అన్నదా యువతి.

"అతడి పేరు-?" అన్నది లీల.

"జనార్దనం-" అన్నదా యువతి.

## 9

"మీ పేరు జనార్దనం కదూ-" అన్నాడతను.

"అవును...." అన్నాడతను.

"ఇప్పుడే వెళ్ళిన ఆ యువతి పేరు లీల కదూ?"
అన్నాడతను.

"అవును...." అన్నాడతను.

"మీరామెను ప్రేమిస్తున్నారు కదూ?"

"పెళ్ళిచేసుకోవాలని కూడా అనుకుంటున్నాను. మీ కెందుకు?" చిరాగ్గా అన్నాడతను.

అతను నవ్వి - "నా పేరు చలం-" అన్నాడు.

"మీ పేరు నేనడగలేదు!" అన్నాడు జనార్దనం.

"అడక్కపోయినా చెబుతాను నేను-" అన్నాడు చలం.

"ఇదిగో మిస్టర్ చలం! నాకు టైము చాలా విలువైనది. నేనది వృధా చేయలేను-" అన్నాడు జనార్దనం.

"టైముకంటే విలువైనది ప్రాణం. ఆ విషయం మీరు ఒప్పుకుంటారనుకుంటాను-" అన్నాడు చలం.

"అంటే?"

"మీ ప్రాణాలు ప్రమాదంలో వున్నాయి-" అన్నాడు చలం.

"మీరేం చెప్పదల్చుకున్నదీ త్వరగా చెప్పండి-" అన్నాడ జనార్దనం.

"మీ పేరు మాకు తెలుసు. మీ ప్రియురాలి పేరు మాకు తెలుసు. మీకు తెలిసినవన్నీ నాకూ తెలుసు. అయితే మీ గురించి మీకు తెలియనివి కొన్ని వున్నాయి. అవి కూడా నాకు తెలుసు-" అన్నాడు చలం.

"ఏమిటవి?" అన్నాడు జనార్దనం.

"మీరు శీలను పెళ్ళి చేసుకుంటే మీ ప్రాణాలు పోతాయి-"

"బెదిరిస్తున్నావా?"

"ఇది బెదిరింపు కాదు. నిజం చెబుతున్నాను...."

"ప్రాణాలు పోతాయని ఎవరికీ ముందుగా తెలియదు. ఇది నిజంగా బెదిరింపే-" అన్నాడు జనార్దనం.

"అయితే మీకు సుగుణ్, ప్రకాష్‌ల గురించి

తెలియదా?"

"వాళ్ళెవరు?"

"లీల గురించి నేను హెచ్చరిస్తే చెవిని పెట్టలేదు-"

"ఇప్పుడు వాళ్ళెక్కడున్నారు?"

"ఎక్కడున్నారో చెప్పలేను. కానీ ఈ భూమ్మీద మాత్రం లేరు...."

జనార్దనం చలం భుజంమీద చేయివేసి - "అయితే మీరు నా శ్రేయోభిలాషి అన్నమాట-" అన్నాడు.

"ఇప్పటికి మీరు నిజం గ్రహించారు-" అన్నాడు చలం.

"మీ మాటలు విని లీలతో వివాహం మానేయమంటారు-"

"అవును...."

"నాతో రండి-" అన్నాడతను. చలం అతడి ననుసరించాడు.

ఇద్దరూ వివేకా గార్డెన్స్ నుంచి బయటకు వచ్చారు.

"కారెక్కండి—మీతో చాలా మాట్లాడాలి—" అన్నాడు జనార్దనం.

ఇద్దరూ కారెక్కారు.

"ఇప్పుడు చెప్పండి-నా ప్రాణాలెందుకు పోతాయి?" అన్నాడు జనార్దనం కారు స్టార్టుచేస్తూ.

"ఆ లీల కామినీ పిశాచి.."

"ఆమె నాకు మనిషిలాగే కనిపించింది-" అన్నాడు జనార్దనం.

"పెళ్ళయ్యేదాకా అలా కనిపిస్తుంది. పెళ్ళి అయినాకనే ఆమెలోని పిశాచం బయటకు వస్తుంది—" అన్నాడు చలం,

"మీకలా తెలుసు?"

"ఆమె కారణంగా ఎందరో చనిపోయారు—"

"మీకలా తెలుసూ—అనడిగాను—" అన్నాడు జనార్దనం.

చలం మాట్లాడలేదు.

"మీకు తెలిసిన విషయాలు మీరు చెప్పడం లేదనుకోండి. ఎలా బైట పెట్టించాలో నాకు తెలుసు—" అన్నాడు జనార్దనం.

చలం మాట్లాడలేదు.

జనార్దనం ఉన్నట్లుండి సడన్ బ్రేక్ వేశాడు. ఒక్క కుదుపులో కారు ఆగింది.

"ఏమయింది?" అన్నాడు చలం.

"మనం రావలసినచోటు వచ్చేసింది...." అన్నాడు జనార్దనం.

చలం అటు చూశాడు. ఎదురుగా పెద్ద హోటల్ వుంది.

"మనకీ హోటల్లో పనేమిటి?" అన్నాడు చలం.

"మీరు అటు చూస్తున్నారు. ఇటు చూడండి—" అన్నాడు జనార్దనం.

చలం అటు చూసి ఉలిక్కిపడ్డాడు. అక్కడ పోలీస్ స్టేషన్ వున్నది.

"మీకు తెలిసిన విషయాలు మీరు చెప్పడంలేదు. బైట పెట్టించడంకోసం ఇక్కడకు తీసుకుని వచ్చాను-" అన్నాడు జనార్దనం.

"మీ ఉద్దేశ్యం ఏమిటి?"

"నా ఉద్దేశ్యం—మీ ఉద్దేశ్యం తెలుసుకోవడమే" అన్నాడు జనార్దనం-"దయుంచి పారిపోయే ప్రయత్నం

చేయకండి. అది మీకు క్షేమం కాదు—"

చలం పారిపోయే ప్రయత్నం చేయలేదు. కార్లోంచి బయటకు వచ్చేక ఇద్దరూ పోలీస్ స్టేషన్లో ప్రవేశించారు.

"డియర్ మిష్టర్ ఇన్స్పెక్టర్! నేను పెళ్ళిచేసుకుంటే ప్రమాదమని ఇతడు నన్ను హెచ్చరిస్తున్నాడు. చావగలనని బెదిరిస్తున్నాడు. రేపే నా వివాహం. నా వివాహం అయ్యేవరకూ దయుంచి ఇతణ్ని లాకప్లో వుంచండి—" అన్నాడు జనార్దనం.

"మీరు వెళ్ళండి సార్—ఇతడి సంగతి నేను చూసుకుంటాను—" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఇటీవల మరణించిన సుగుణ్, ప్రకాష్ అనేవాళ్ళు ఇతడి కారణంగా పోయారని నా అనుమానం. మీరు ఇతన్నించి ఆ వివరాలన్నీ రాబట్టాలి—" అని వెళ్ళిపోయాడు జనార్దనం.

చలం ఇన్స్పెక్టర్ వంక తిరిగి — "మీరు నన్ను లాకప్లో ఉంచి లాభంలేదు. అతడి వివాహాన్నాపండి. లేకుంటే అతడి ప్రాణాలు పోతాయి—" అన్నాడు.

"నీనుంచి నేను ఇంకా చాలా విశేషాలు రాబట్టాలనుకుంటున్నాను...." అన్నాడు ఇన్స్పెక్టర్. అతడి చూపులు క్రూరంగా వున్నాయి.

# 10

"హలో-మీరు కూడా ఇక్కడ....ఏమిటి విశేషం?" అన్నాడు ఇన్స్పెక్టర్ శేఖర్.

"ఈ కేసులో నాకూ ఆసక్తి వుంది—" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"మిమ్మల్ని ఎవరైనా పిలిచారా?"

"లేదు. ఇతడు చనిపోతాడేమోనన్న అనుమానం

నాక్కలిగింది. ఎలా చనిపోతాడో తెలుసుకోవాలని ఒక మనిషిని నియమించాను. అతడు అహర్నిశలూ ఇతణ్ని అనుసరించి వుంటున్నాడు. చనిపోగానే నాకు వార్త అందింది—"

ఇన్‌స్పెక్టర్ శేఖర్ డిటెక్టివ్ వెంకన్న వంక ఆశ్చర్యంగా చూస్తూ—"ఇతడు చనిపోతాడన్న అనుమానం మీకెందుకు కలిగింది?" అన్నాడు.

"అది దేవ రహస్యం. చెప్పకూడదు—"

"నేనడిగిన కారణం వేరు. జనార్దనం చనిపోతాడని తెలిసిన వ్యక్తి మరొకడున్నాడు. అతడు మా స్టేషన్లో లాకప్‌లో వున్నాడు—" అన్నాడు శేఖర్.

"అయితే మనం కలిసి మాట్లాడుకోవాలి. ముందిక్కడ మీ తంతులు పూర్తి కానివ్వండి-" అన్నాడు వెంకన్న.

కేసు అన్నివిధాలా సుగుణ్, ప్రకాష్‌ల కేసుల్ని పోలి వుంది.

జనార్దనానికి చావు హఠాత్తుగా సంభవించింది.

డాక్టర్ విషప్రయోగం అన్నాడు. అతడికి ఆత్మహత్య చేసుకునేందుకు కారణాలున్నాయి. అవి బయట పడ్డాయి. ఎవరూ ఆతడిని హత్యచేసే అవకాశంలేదు.

వెంకన్న ఎవర్నీ ఏమీ ప్రశ్నించలేదు. అతడు అక్కడ జరిగే తతంగమంతా శ్రద్ధగా గమనించాడు. ఆఖరున శేఖర్‌తో కలిసి పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాడు.

"మీకు తెలిసింది మీరు చెప్పాలి. నాకు తెలిసింది నేను చెబుతాను—" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శేఖర్.

"అలాగే—" అన్నాడు వెంకన్న — "ఒకమ్మాయి వుంది. ఆమె జనార్దనాన్ని ప్రేమకు ఎన్నుకుంది. జనార్దనం ఆమెను పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. ఆమెను

పెళ్ళిచేసుకోవాలనుకుంటే చస్తావని ఒకడు జనార్దనాన్ని హెచ్చరించాడు. జనార్దనం ఆ హెచ్చరికను లెక్క చేయలేదు. చచ్చిపోయాడు. జనార్దనాన్ని హెచ్చరించిన మనిషి ఎవరో నేను చూడలేదు. నేను నియమించిన వ్యక్తి ఆ విషయం నిర్లక్ష్యం చేశాడు...."

"ఆ మనిషి నా వద్ద వున్నాడు—" అన్నాడు శేఖర్—"ఆశ్చర్యమేమిటంటే—అతడు కూడా అన్నీ మీరు చెప్పినట్లే చెబుతున్నాడు—"

"అతన్ని ఒక్కసారి పి ● వ ం డి—" అన్నాడు వెంకన్న.

చలం అక్కడికి రప్పించబడేలోగా — జనార్దనం తనవద్దకు చలాన్ని ఏ విధంగా తీసుకువచ్చిందీ వెంకన్నకు చెప్పాడు శేఖర్.

"మనిషి మొండివాడులాగున్నాడు. అలాంటివాడు చనిపోవడం నాకు ఆశ్చర్యంగా వున్నది—" అన్నాడు వెంకన్న.

"నా అనుమానం ఆ అమ్మాయి నిజంగా కామినీ పిశాచేమో అని!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శేఖర్.

అప్పటికి సార్జంట్ చలాన్ని అక్కడకు తీసుకుని వచ్చాడు.

చలం అక్కడకు వస్తూనే — "జనార్దనం ఎలా వున్నాడు సార్!" అనడిగాడు ఇన్‌స్పెక్టర్ని.

"ఎలా వుంటాడనుకుంటున్నావ్?" అన్నాడు శేఖర్.

"న్యాయానికి ఈపాటికి చచ్చిపోయి వుండాలి—"

"నువ్వు లాకప్‌లో వున్నావు కదా—యెలా చచ్చిపోతాడు?"

చలం నవ్వి—"చంపేది నేనైతే కదా?" అన్నాడు.

"అయితే చంపడానికి ఎవర్ని నియోగిస్తున్నావ్!"

"నేను నియోగించడమేమిటి? చంపవలసిన అవసరం నాకేమిటి? చంపే ఉద్దేశ్యమే నాకుంటే హెచ్చరించే పనికి ఎందుకు పూనుకుంటాను? నా దురదృష్టంకొద్దీ ఎవరూ నా హెచ్చరికను పాటించడంలేదు-" అన్నాడు చలం.

"ఇప్పుడు జనార్దనం చచ్చిపోయాడంటే నీకు సంతోషం కలుగుతుందా, దిగులు పడతావా?" అనడిగాడు శేఖర్.

"సుగుణ్, ప్రకాష్‌ల విషయంలో అయితే దిగులు పడ్డాను. కానీ ఇప్పుడు నాకు చాలా సంతోషంగా వుంటుంది—" అన్నాడు చలం.

శేఖర్ అతడివంక కోపంగా చూస్తూ—"సాటిమనిషి చచ్చిపోతే—ఎంత శత్రువైనా సరే కంటతడిపెడతారే-అలాంటిది .... నువ్వు ...." అని మాటలు రాక ఆగిపోయాడు.

"సార్ — ఎవరికైనా స్వంత ప్రాణం తర్వాతే ఎదుటివాడి ప్రాణం. నేను నిస్వార్థపరుణ్ని కాబట్టే లీల గురించి సుగుణ్‌ని, ప్రకాష్‌ని హెచ్చరించాను. ఇప్పుడు జనార్దనాన్ని హెచ్చరించాను. కానీ ఫలితం ఏమిటి? నా ప్రాణాలకు ప్రమాదం ఏర్పడింది. నాకు తెలిసిన విషయం చెప్పి నిండు ప్రాణాన్ని కాపాడాలనుకున్నందుకు అంతా నన్నే హంతకుడిగా అనుమానించే పరిస్థితి ఏర్పడింది.

మీరే చెప్పండి సార్....ఒక ఆడదానికోసం—అందులోనూ పరాయి మగాళ్ళను ప్రేమిస్తున్న ఆడదాని కోసం ఎవరైనా హత్యలు చేస్తాడా....మీరే ఆలో

చించండి సార్! అందుకే ఇప్పుడు జనార్దనం నేను లాకప్ లో వుండగా చచ్చిపోతే — అది నాకు ఎంతో మేలు చేస్తుంది. నామీద ఎవరికే అనుమానాలున్నా పోతాయి. అప్పటికీ మీ అనుమానం పోకపోతే— నన్నిక్కడే కొన్నాళ్ళుంచేయండి. లీల ఎవర్ని ప్రేమిస్తే వాళ్లు చస్తారు. అది మీరు కళ్ళారా చూస్తారు...." అన్నాడు చలం ఇన్ స్పెక్టర్ వంక ఉత్సాహంగా చూస్తూ.

"ఎలా చస్తారంటావ్?"

"బహుశా ఆమె స్పర్శలో యేదో మాయ వున్నది. ఆమె గురించి అదే పనిగా ఆలోచిస్తే బుర్ర పాడవుతుందని నా అమమానం. ఆత్మహత్య చేసుకోవాలన్న బుద్ధి పుట్టవచ్చు—"

శేఖర్ ఆలోచిస్తూ—"నిన్ను లాకప్ లో వుంచాను కానీ నీ కేసు రిజిష్టర్ చేయలేదు. సులభంగా తేలిపోయిన కేసును క్లిష్టతరం చేయడం నా కిష్టంలేదు. అందుకే నీ మాటలు నమ్మి నిన్ను వదిలిపెడుతున్నాను. అయితే ఇంకోసారి—నీ విషయంలో ఇంకేమైనా అనుమానాలు కలిగితే మాత్రం మొత్తం అంతా తిరగతోడతాను—" అన్నాడు.

"థాంక్యూ సార్—ఇంతకీ జనార్దనం నిజంగా చచ్చిపోయాడా?"

"ఆఁ ఆత్మహత్య చేసుకున్నాడు—" అన్నాడు శేఖర్.

చలం ఆనందంతో కేక పెట్టాడు.

"మిష్టర్ చలం!" అన్నాడు వెంకన్న.

అప్పటిదాకా డిటెక్టివ్ వెంకన్న ఉనికి పట్టించుకోని చలం — "మీరే కదూ సార్—నన్ను పిలిచారు...." అన్నాడు.

"అవును. నువ్విప్పుడు నాతో రావలసి వుంది—" అన్నాడు వెంకన్న.

"తమరెవరు సార్?" అన్నాడు చలం.

"ఆయన పేరు వెంకన్న. ప్రసిద్ధి పొందిన ప్రయివేట్ డిటెక్టివ్. ఆయన కారణంగానే నిన్ను వదిలిపెడుతున్నాను. నువ్వు ఆయనతో వెళ్ళు—" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నవ్వుతూ.

# 11

"మిస్టర్ చలం! నేను నీకు మిత్రుణ్ని కాను. నీవు నిర్దోషివని నేను నమ్మడంలేదు. నా క్లయంట్ ప్రకాష్ నీ కారణంగా చనిపోయాడు. అతడిది ఆత్మహత్య అని పోలీసులు అన్నప్పటికీ నేనది నమ్మలేదు. మర్యాదగా నీకు తెలిసిన నిజాలు నువ్వు నాకు చెప్పకపోతే—ఆపైన నేను నిన్ను వేటాడతాను. నా వేట చాలా ఘోరంగా వుంటుంది—" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"మీరు నానుంచి ఏం తెలుసుకోవాలనుకుంటున్నారు?"

వెంకన్న నవ్వి—"ఇన్‌స్పెక్టర్ శేఖర్ నీ విషయంలో ఉదాసీనభావం వహిస్తే అందుకు కారణం నేను అర్థం చేసుకోగలను. నేనలా వదిలిపెట్టను నిన్ను. నీకు లీల గురించి ఎప్పట్నించి తెలుసు? ఎలా తెలుసు? ముందీ ప్రశ్నలకు జవాబు చెప్పాలి—" అన్నాడు వెంకన్న.

"లీలను నేను తొలిచూపులో ప్రేమించాను. ఆమె పరిచయం చేసుకున్నాను. మా పరిచయం ప్రేమగా

మారేలోగానే ఒకరోజున ఆమె బస్సుకింద పడిపోబో తూంటే ప్రమాదం నుంచి కాపాడాను. అప్పుడామె— "చలం—నీ ఋణం ఎలా తీర్చుకోను?" అనడిగింది. మనం పెళ్ళి చేసుకుందాం—అన్నాను. ఆమె ఒప్పుకో లేదు. నా ప్రాణదాతవు — నీ ప్రాణాలెలా తీయనూ అంది...."

చలం చెప్పుకుపోతూండగా — "బాస్!" అని అరి చింది సీతమ్మ.

"ఏమిటి?" అన్నాడు వెంకన్న.

"ఇతడు చెప్పేవన్నీ అబద్ధాలు!" అన్నది సీతమ్మ.

"ఎలా తెలుసు నీకు?" కోపంగా అన్నాడు చలం.

"మిష్టర్ — కోప్పడకు....నీవు కూర్చున్న కుర్చీలో కొన్ని ప్రత్యేకమైన ఏర్పాట్లున్నాయి. లై డిటెక్టర్.... అనగా అబద్ధాలు కనిపెట్టే యంత్రం గురించి నీవు విన్నావా?" అన్నాడు వెంకన్న.

"అంటే?"

"అబద్ధం చెప్పేటప్పుడు మనిషి మెదడులో కొన్ని భావాలు చెలరేగుతున్నాయి. ఆ భావాలకు అనుగుణంగా నరాలు కంపిస్తాయి. నరాల కంపనాన్ని బట్టి మనిషి నిజం చెబుతున్నాడో, అబద్ధం చెబుతున్నాడో తెలుసు కోవచ్చు. నువ్వు చెప్పేవి అబద్ధాలని సీతమ్మ అంటున్నది. ఆమె చేతిలో లై డిటెక్టర్ ఉన్నది. అది నీ కుర్చీకి కనెక్టు చేయబడి వున్నది—" అన్నాడు వెంకన్న.

చలం తెల్లముఖం వేశాడు.

"మిష్టర్ — ఇప్పుడు నిజం చెప్పు—" అన్నాడు వెంకన్న.

"నిజం చెబితే నా ప్రాణం పోతుంది—" అన్నాడు

చలం.

"నీ ప్రాణాలకు నా ప్రాణం అడ్డువేస్తాను—" అన్నాడు వెంకన్న.

"అది మీవల్ల కాదు—" అన్నాడు చలం.

"నావల్ల కానిపనిలేదు—" అన్నాడు వెంకన్న.

"అయితే ప్రకాష్ ప్రాణాలు యెందుకు రక్షించలేకపోయారు?"

"చాలా మంచి ప్రశ్న వేశావు—" అని నవ్వాడు వెంకన్న—"ప్రకాష్ ప్రాణాలు రక్షించాల్సిన అవసరం ఉంటుందని నేననుకోలేదు. అందుకే అలక్ష్యం చేశాను. ఇప్పుడు ప్రకాష్‌ని చంపిన హంతకుడెవరో తెలుసుకోవాలని పట్టుబట్టాను. తెలుసుకుంటాను. నేను తెలుసుకున్న వివరాలన్నీ పోలీసులకు అందజేస్తాను. నువ్వు ఎవరికైనా భయపడుతూ ఉండిన పక్షంలో ఆ వ్యక్తి బ్రతుకు నేనెలాగూ బయటపెట్టగలను...."

"మీరు తెలుసుకున్న విషయాలను రహస్యంగా వుంచగలరా?"

"నేరస్థుల మనసులో మార్పు తీసుకునిరావడమే తప్ప శిక్ష నా ధ్యేయం కాదు. నువ్వు నిజం నాకు చెబితే బహుశా నేను నిన్ను రక్షించగలను...."

చలం ఆలోచిస్తూ-"మీరు నిజమే చెబుతున్నారా?" అన్నాడు.

"నా దగ్గరున్న రహస్యాలన్నీ పోలీసులకు అప్పజెప్పే మాటైతే ఈ ఊళ్ళో సగంమంది జైల్లో వుండేవారు—" అన్నాడు వెంకన్న.

"సరే — చెబుతాను. కానీ మీరు నా ప్రాణాలు రక్షించాలి—" అంటూ ప్రారంభించాడు చలం.

చలం సామాన్యుడు. అతడికి లీల చిన్నప్పట్నించీ తెలుసు. ఇద్దరికీ రెండు సంవత్సరాలక్రితమే పెళ్ళయింది. అతడికి లీల అంటే ప్రాణం. లీలకు పుస్తకాల పిచ్చి. ఆ పుస్తకాల ప్రభావమో ఏమోకానీ తను కానిస జీవితం అనుభవిస్తున్నానన్న అభిప్రాయం ఆమెకు కలిగింది. ఆమెకు విలాస జీవితాలపైన మోజు ఎక్కువయింది. అప్పుడు చలం లీలకోసం ఎక్కువ డబ్బు సంపాదించాలనుకుని ఈ ఊరు వచ్చాడు.

ఈ ఊళ్ళో అతడి చిన్ననాటి స్నేహితుడొకడు చాలా పేరుపొందిన వ్యాపారస్థుడయ్యాడు. చలం అతణ్ని కలుసుకుని తన గోడు చెప్పుకున్నాడు. అతడు అవినీతికరమైన పనులు చాలా చేస్తున్నాడు. తనకు వాటిల్లో సాయంచేస్తే చలం త్వరలోనే ధనవంతుడు కావచ్చునని అతడన్నాడు. సామాన్యుడైన చలం అందుకు భయపడ్డాడు. తనకు కావలసిందల్లా నలుగురూ నడిచే బాటలో డబ్బు సంపాదించడం — అని స్పష్టంచేసి తన ఊరు వెళ్ళిపోయాడు.

అప్పుడు లీల ఆతన్ని వదిలి పెట్టాలనుకున్నట్లు చెప్పింది. ఆమె పుట్టింటికి పోయింది. పుట్టింట్లో అంతా ఆమెను తిడితే ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించింది. ఈలోగా ధనికుడైన ఆ స్నేహితుడు చలం ఊరికి వచ్చాడు. చలాన్ని కలుసుకున్నాడు. అతడి పరిస్థితి విన్నాడు.

“నీ భార్య అమాయకురాలు. ఆమె ఇల్లు వదిలి వెళ్ళిపోయేలా వుంది. అలాచేస్తే — చివరికి ఏ వ్యభిచారుల కొంపలోనో తేలుతుంది-” అన్నాడు స్నేహితుడు.

“ఏం చేయను?” అన్నాడు చలం.

“నేనో యువతిని పంపుతాను. ఆమె ప్రోత్సా

వాంతో నీ భార్య మా ఊరు వస్తుంది. ఆ యువతి ఆ మొగ మగవాళ్ళను వెతికి పెడుతుంది—"

"అంటే ఆమె స్వేచ్ఛాభావాలను నువ్వా ఆమోదిస్తావా?" అన్నాడు చలం విపరీతంగా ఆవేశపడుతూ.

"అదేమీ కాదు. ఆమె కామినీ పిశాచి అని నువ్వు ప్రచారం చేయి — నీ మాటలు నిజమయ్యేలా నేను చూస్తాను—" అన్నాడు స్నేహితుడు.

స్నేహితుడు చలానికి తన పథకం యావత్తూ చెప్పాడు. అది వింటూ చలం హడలిపోయి-"నాకోసం నువ్వు మనుషుల్ని చంపేస్తావా?" అన్నాడు.

"మనుషుల్ని చంపుతూండడం నాకు తప్పదు. ఇప్పుడు నా లిస్టులో కొందరు మనుషులున్నారు. వాళ్ళెలాగూ చావబోతున్నారు. వాళ్ళిధంగా చచ్చిపోతే నాకూ ప్రయోజనమే—... జనం ఇప్పటికీ మూఢవిశ్వాసాలను గాఢంగా నమ్మాలనుకుంటారు. నీ భార్యకు కామినీ పిశాచి అన్న పేరు వస్తే అది బాగా ప్రచారమవుతుంది. ఆపైన మగాళ్ళు ఆమె అంటే భయపడతారు. అప్పుడు వేరే గతిలేక ఆమె మళ్ళీ నీ పంచనే పడివుంటుంది. అంతే కాదు—నీ ప్రేమ ఎంత గొప్పదో కూడా ఆమెకు ఈ విధంగానే తెలుస్తుంది—" అన్నాడు స్నేహితుడు.

చలం స్వతహాగా భయస్థుడు. కానీ భార్యమీది మమకారంతో — తనామెకు దూరం కాకూడదన్న ఆకాంక్షతో ఇందుకు ఒప్పుకున్నాడు.

"ఇందులో నేను చేసిందేమీలేదు. మాటలు తప్ప! నేను అబద్ధం చెప్పడం లేదు...." అన్నాడు చలం.

వెంకన్న ముఖం గంభీరంగా అయిపోయింది—"మిష్టర్ చలం! నిజంగా నీ ప్రాణాలిప్పుడు ప్రమా

దంలో వున్నాయి—" అన్నాడు.

"ఎందుకని?"

"నీ స్నేహితుడు తెలివిగా మూడు హత్యలు చేసి అవి కామినీ పిశాచిమీదకు తోసేశాడు. చాలామంది ఆ విషయం నమ్మారు. రేపు పత్రికల్లో కామినీ పిశాచి వివరాలు రానున్నాయి. బహుశా నీ భార్య ఫోటో కూడా వస్తుంది. తర్వాత నీ విషయం తెలుస్తుంది. భర్తవు నీకేమీ కాదు. అప్పుడు అందరికీ అనుమానం కలుగుతుంది. అలా అనుమానం కలగడం నీ స్నేహితుడి కిష్టముండదు. కామినీ పిశాచి అన్న పేరు నీ భార్యకు చిరస్థాయి కావడంకోసం అతడు నిన్ను కూడా ..."

చలం వెర్రి మొహం వేశాడు. అతడి కళ్ళలో భయం స్పష్టంగా కనబడింది. అతడు ఆలోచిస్తున్నాడని ముఖం చూడగానే అర్థమవుతుంది.

"మీరు చెప్పేది నిజమే కావచ్చు. కానీ లీల బ్రతుకు ఏమవుతుంది?" అన్నాడతను దిగులుగా.

"లీల జీవితాంతం నీ స్నేహితుడికి ఉపయోగపడుతూ వుంటుంది. తెలిసి తెలిసి ఏ మగవాడూ ఆమెకు ఆశ్రయ మివ్వడు. నీ స్నేహితుడే ఆమెకు ఆశ్రయమిచ్చి అన్ని విధాలా ఆమెను ఉపయోగించుకుంటాడు .... స్వేచ్ఛా భావాలున్న నీ భార్యకు అతడి వలలో పడడం చాలా సులభం. ఆ తర్వాత ఆమె గతి అథోగతే!" అన్నాడు వెంకన్న.

"అలా జరగడానికి వీల్లేదు—" అన్నాడు చలం.

"నీ కథ సుఖాంతం అవుతుంది. నీ స్నేహితుడి పేరు చెప్పు—" అన్నాడు వెంకన్న. ఆత్రుతగా చలం ముఖం వంక చూస్తూ.

చలం జాప్యం చేయలేదు—"శేషగిరి!" అన్నాడు.

"సరే నువ్వు వెళ్ళు. ఒక్క రెండు రోజులు లీలను కలుసుకోకు. ఆమె వంక చూడకు...." అన్నాడు వెంకన్న.

చలం వెళ్ళిపోయాక వెంకన్న సీతమ్మవంక అభిమాన పూర్వకంగా చూసి — "లై డిటెక్టర్ గురించి సమయానికి మంచి అబద్ధం చెప్పి—చలంచేత నిజం చెప్పించావు. అతడు అబద్ధం చెబుతున్నాడని ఎలా గ్రహించావు?" అన్నాడు.

"మగవాడి కళ్ళు చూసి ఆడది అన్నీ గ్రహించగలదు...." అన్నది సీతమ్మ నవ్వుతూ.

"అయితే రోజూ నా ఎదుట కూర్చుని నా కళ్ళలోకి చూస్తూనే ఉంటావు. నా గురించి ఏమేం గ్రహించావు?" అన్నాడు వెంకన్న.

సీతమ్మ ఏదో చెప్పబోయేలోగా బల్లమీద ఫోన్ మ్రోగింది. వెంకన్న భయంగా ఫోన్ వంక చూశాడు. అది వంటింట్లోంచి వచ్చిందని అతడికి తెలుసు. భార్య పద్మావతీదేవి మాట్లాడడం కోసం అతడు వేరే ఫోన్ కనెక్షన్ ఇచ్చాడు.

వెంకన్న ఫోన్ తీసి—"దేవీ!" అన్నాడు.

"అంతా వింటున్నాను. ఆడవాళ్ళతో కనుల బాసల గురించి మీరు మాట్లాడవద్దు—"

అవతల క్లిక్‌మంది.

రాజమ్మ కిసుక్కుమంది.

వెంకన్న అదోలా అసిస్టెంట్సువంక చూశాడు. తనకే ఫోన్ కాల్ వచ్చినా అసిస్టెంట్సు వినడానికి సదుపాయముంది. తనకు భార్యనుంచి ఫోన్ కాల్ వచ్చినపుడు

వాళ్ళను వినవద్దని అతడు శాసించాడు. కానీ వాళ్ళా శాసనాన్ని లెక్క చేయరు. ఇప్పుడూ లెక్క చేయలేదు.

## 12

శేషగిరి — ఓ పదిమందితో కలిసి ఏవో చర్చలు చేస్తున్నాడు. అంతా పెద్దమనుషులే! ఆ ఊరి ప్రముఖులే!

సమావేశం మధ్యలో శేషగిరి ఇంటి పనివాడు లోపలకు వచ్చాడు_"బాబూ—మీ కోసం ఓ అమ్మాయి వచ్చింది. ఇక్కడే మిమ్మల్ని కలుసుకుంటుందిట...."

"సరే—రమ్మనమను...." అన్నాడు శేషగిరి.

లీల లోపలకు అడుగుపెట్టింది. తన చేతిలోని ఫోటో వంకా అక్కడున్న పెద్దమనుషులందరివంకా పరీక్షగా చూసి తిన్నగా శేషగిరిని సమీపించింది.

"ఎవర్నువ్వు?" అన్నాడు శేషగిరి. కానీ అతడా మెను గుర్తుపట్టాడు.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వు నన్ను పెళ్ళి చేసుకో—" అన్నది లీల.

శేషగిరితో పాటు—అక్కడున్న పెద్దమనుషులందరూ తెల్లబోయారు. ఒక్క క్షణం తర్వాత శేషగిరి తేరుకుని-"నాకు వివాహమయిందని తెలుసా?" అన్నాడు.

"తెలుసు. నాకు నీ భార్యతో సమాన స్థాయి అవసరం లేదు. నెలకింతని జీతం ఇస్తే చాలు. భార్యకంటే నమ్మకంగా పడివుంటాను...."

"సమాజంలో నా హోదా ఏమిటో నీకు తెలుసా? భార్యగా నేను బజారు స్త్రీని స్వీకరించనని తెలుసా?"

"నేను బజారు స్త్రీని కాను. కానీ ఇప్పుడు నీవంటి వాడి ఆశ్రయం లభించకపోతే నా బ్రతుకు బజారు పాలయ్యేలా వుంది—" అన్నది లీల.

"నిన్నిక్కడకు ఎవరు పంపారు?" అన్నాడు శేషగిరి.

"నీ పిలుపు అందుకునే వచ్చాను...." అన్నది లీల.

"నేను పిలిచానా? అబద్ధం...." అన్నాడు శేషగిరి.

లీల వివరించింది. రోజూ తనను కలుసుకునే యువతికి బదులు ఓ కొత్త యువతి ఆమెవద్దకు వచ్చింది. ఆమెకు ఆరోగ్యం సరిగాలేక తనను పంపించినదంది. ఆమె శేషగిరి పేరు చెప్పింది. పదిమంది మగవాళ్ళ మధ్య వుండగా అతణ్ని ఓ అందమైన ఆడది ప్రేమిస్తున్నానని అంటే కాదనలేడని అంది. ఎందుకంటే ఏ మగవాడికైనా అది గర్వకారణమట. శేషగిరి చిన్న వయసులోనే పుర ప్రముఖుడయ్యాడు. అతడు సమర్థుడు. అతడి అండ లీల వంటి ఆడదానికి అవసరం.

ఉన్నట్లుండి శేషగిరి — "నువ్వు ...నువ్వు....కామినీ పిశాచివి కదూ?" అన్నాడు అప్పుడే ఆమెను గుర్తించి నట్లు.

కామినీ పిశాచి అన్న పేరు వింటూ అంతా ఉలిక్కి పడ్డారు.

అప్పుడు శేషగిరి బల్లమీద వున్న పేపరు అందరికీ చూపించాడు. అందులో ఆమె ఫోటో వున్నది. వివరా లున్నవి. అంతా అవి చదివారు.

"ఎక్కడ చూశానా అని ఇందాకట్నుంచి కొట్టుకు చస్తున్నాను. ఇప్పటికి ముగ్గుర్ని పొట్టన పెట్టుకున్నావు. ఇప్పుడు నీ కన్ను నామీద పడిందా?" అన్నాడు శేషగిరి.

## 13

"మిస్టర్ చలం! నా మాటవిని త్వరగా ఇక్కణ్నించి లీలను తీసుకుని పారిపో—" అన్నాడు వెంకన్న.

"సార్ .... శేషగిరి ఎలా మరణించాడు?" అన్నాడు

చలం కంగారుగా.

"ఆ వివరాలేమీ నన్నడగవద్దు. తను తీసుకున్న గోతిలో తానే పడడమంటారే—శేషగిరి విషయంలో అదే జరిగింది—" అన్నాడు వెంకన్న.

"మీ మేలు మరువలేను సార్!" అన్నాడు చలం.

"నా మేలు సంగతి తరువాత....నువ్వు వీలైనంత త్వరగా ఇక్కణ్నించి లీలను తప్పించాలి. ప్రయాణంలో కూడా ఆమె ముఖం బయటపడనివ్వకు. నీ అదృష్టం ఏమిటంటే—లీలకు కామినీ పిశాచిగా ప్రచారం లభించింది తప్పితే—ఆమె ఎక్కడిది—గత చరిత్ర ఏమిటి—అన్న వివరాలు బయటకు రాలేదు. ముమ్ముందు అవీ బయటకు రావచ్చు. అదీ నీకూ, నీ భార్యకూ కూడా చాలా ప్రమాదం. తక్షణం వెళ్ళు!" అన్నాడు వెంకన్న.

• • •

"లీలా!" అన్నాడు చలం.

లీల తలెత్తి చూసింది. ఆమె కళ్ళు ఉబ్బి వున్నాయి.

"ఏడుస్తున్నావా?" అన్నాడు చలం.

"నీ గురించి నాకు తెలుసు. నువ్వు హత్యలు చేయలేవు. నేను నిజంగా కామినీ పిశాచిని. ఈ ఊరిలో ఎందరికో సింహ స్వప్నం అయిన శేషగిరి కూడా నా ప్రేమకు లోనుకాగానే చచ్చిపోయాడు...." అన్నది లీల.

"లీలా! నేను సామాన్యుడినే కావచ్చు. కానీ నా ప్రేమ సామాన్యమైనది కాదు. నువ్వు నన్ను కాదంటే-నువ్వు కోరుకున్న వారెవ్వరూ బ్రతకకూడదని నేను కోరుకున్నాను. నా ప్రేమబలంవల్ల కాబోలు—అలాగే జరిగింది. అదే ప్రేమ బలంతో నిన్ను పిలుస్తున్నాను.

మనం మళ్ళీ మన ఊరు వెళ్ళిపోదాం—రానన్నకు...." అన్నాడు చలం.

"నేను రాను .... నేను వస్తే నువ్వు కూడా చని పోతావు...." అంది లీల.

"నేను నిన్ను ప్రేమించాను. మనం కలిసి రెండేళ్ళు జీవించాం. అయినా నేను చచ్చిపోలేదు. ఇక్కడ నీవు ప్రేమించాననుకున్న ప్రతివాడూ చనిపోయాడు. ఎందు కంటే ఇది తప్పు. తప్పును దేవుడు క్షమించడు. నువ్వు వరుసగా తప్పులు చేయాలనుకుంటే నీతోపాటు తప్పులు చేయాలనుకున్న ప్రతి ఒక్కరినీ దేవుడు శిక్షించాడు. నీకూ శిక్షలు పడాల్సిందే—కానీ నా ప్రేమ బలంతో నిన్ను నేను రక్షించుకున్నాను...."

"కానీ ఇప్పుడు నేను నిజంగా కామినీ పిశాచిని...." అంది లీల.

"నాకా భయంలేదు...." అంటూ చేతులు చాపాడు చలం.

లీల అతడి ముందుకు వచ్చి అతడిలో కరిగిపోయింది.

* * *

"బాస్—మిమ్మల్ని చూస్తూంటే నాకు చాలా భయంగా వుంది—" అన్నది రాజమ్మ.

"ఎందుకని?" అన్నాడు వెంకన్న.

"మీరొక నిండు ప్రాణాన్ని తీసేశారు...." అన్నది రాజమ్మ.

"శేషగిరిలాంటి నీచుడు బ్రతికి ఉండడానికి వీల్లేదు. వాడి చావు దేశానికి శుభదాయకం—" అన్నాడు వెంకన్న.

"ఎందుకని?"

"వాడి గురించి ఎన్నో వివరాలు నాకు తెలుసు. వాడి జీవితాన్ని అంతం చేస్తే తప్ప—వాడి అగడాలకు అంతం లేదని నాకు తెలుసు. ఎన్నాళ్ళనుంచో ఆ అవకాశం కోసం ఎదురుచూస్తున్నాను. కానీ...." వెంకన్న ముఖం దిగులుగా అయిపోయింది.

"దిగులు పడకండి బాస్! వాడు సృష్టించిన కామినీ పిశాచితోనే వాడిని అంతం చేశారు. అయితే వాడికి విషప్రయోగం ఎలా చేశారు బాస్!" అన్నది రాజమ్మ.

"నాకా అవకాశం రాలేదు. లీల కలుసుకున్నాక ఆ మర్నాడు వాడి చావుకు ముహూర్తం పెట్టాలనుకున్నాను. కానీ ఈలోగానే వాడు చనిపోయాడు—" అన్నాడు వెంకన్న.

"అంటే?"

"ఆ రోజు సమావేశంలో ఉన్న పెద్ద మనుషుల్లో ఎవరో అవకాశం తీసుకుని తమ పగ తీర్చుకున్నారు శేషగిరిమీద! లీల ఈ విధంగా చాలామందికి ఉపయోగపడే అవకాశమున్నదని స్ఫురించగానే నేనామెను అర్జంటుగా ఊర్కించి పంపించేశాను...." అన్నాడు వెంకన్న దిగులుగా.

—:ఐ పో యి ం ది:—

# మృత్యు తరంగాలు!

## అజీజ్

"హలో, శ్రీలత స్పీకింగ్!"

"నేను విశాలక్షినోయ్! ఈ రోజు నా బర్త్ డే పార్టీ ఉందనీ, సాయంత్రం ఏడు గంటలకు మా ఇంటికి వేంచేయాలనీ అమ్మాయిగారికి గుర్తుంది కదా?" అవతలివైపు స్నేహితురాలి కంఠం విని, మొహం చిట్లించింది శ్రీలత.

"అబ్బ, ఎన్నిసార్లు గుర్తుచేస్తావే తల్లీ! కనీసం ఇప్పటికి డజను సార్లైనా చెప్పుంటావు. మతిమరుపు నాక్కాదు. నీకే ఉన్నట్టుంది. ఒక్కోసారి స్నేహితురాళ్ళ పుట్టిన రోజుల్ని నేనే వారికి గుర్తుచేసిన సందర్భాలున్నాయి తెల్సా? అందునా నీవంటి ప్రాణ సఖి బర్త్‌డే పార్టీకి నువ్వు పిల్చినా, పిలవకున్నా పిలవని పేరంటంలా రివ్వున ఎగిరి వాలనూ?"

"కదిపితే కందిరీగలా వాగడం ఆపవు కదా! ఇప్పుడు నీకు ఫోన్ చేసింది బర్త్‌డే జ్ఞాపకం చెయ్యడానిక్కాదమ్మాయ్! ఆ పార్టీలో ఏర్పాటు చేయబోతున్న ఒక

అద్భుత ప్రదర్శన గురించి చెప్పడానికి!"

"ఏమిటా ప్రదర్శనా? కొంపదీసి నీ కథకళి ప్రదర్శన కాదు కదా? నాకు తెలీకుండా ఎప్పట్నించీ ప్రాక్టీస్ చేస్తున్నావే?"

"హాత్తోస్మి! అందులో నాకు ఓనమాలు కూడా తెలియందే! నీ ఊహాగానాలు కట్టిపెట్టి, చెప్పేది విను. అస్సాం టీ ఎస్టేట్స్‌లో పెర్సనల్ ఆఫీసర్‌గా పని చేస్తున్న మా అన్నయ్య, దూరపు బంధువులే, ఈ రోజే మద్రాసు వచ్చాడు. అక్కడ బాగా అల్లర్లు జరుగుతున్నాయి కదా, అందుకని.

ఆయనకు హిప్నాటిజంలో మంచి ప్రవేశం ఉందిట. ఈ రోజు పార్టీలో తన ప్రదర్శనా ప్రావీణ్యంతో అందర్నీ చకితుల్ని చెయ్యాలనుకుంటున్నాడట. అర్థమైందా? ఎన్ని అవాంతరాలు ఎదురైనా సరే, పార్టీకి రావడం మర్చిపోవద్దని అందరికీ తెల్పడానికే ఇలా ఫోన్ చేస్తున్నాను."

"అదా సంగతి. సరే, వస్తా బెంగెట్టుకోక!"

అవతల నవ్వు, క్లిక్‌మన్న చప్పుడు.

రిసీవర్ దించి, రిస్టువాచీ చూసుకుంది శ్రీలత. మధ్యాహ్నం మూడున్నర. బజారుకెళ్ళి ఏదైనా మంచి ప్రెజెంటేషన్ కొనాలి. వచ్చి తయారయ్యేసరికి టైమైపోతుంది. అనుకుంటూ, డ్రెస్సింగ్ టేబిల్ మీద వేనిటీ బాగ్ అందుకుని బైటికి నడిచింది.

మేడ మెట్లు దిగి, హాల్లో అడుగుపెడుతుండగా, వదిన ఎదురై, "ఎక్కడికమ్మా లతా?" అంది.

"సాయంత్రం విశాలాక్షి బర్త్‌డే పార్టీ ఉంది వదినా! షాపింగ్ కెళ్తున్నాను. డ్రైవర్ వున్నాడా

బైట?”

“లేదు. ఇప్పుడే మీ అన్నయ్యను తీసికెళ్ళాడు కార్లో. నీ ఫియట్ రిపేరై వచ్చేసిందిగా, తీసికెళ్ళు.”

“హమ్మయ్య! ఇంకేం, వస్తానొదినా!” అంటూ హుషారుగా బైటికి నడిచింది లత. పోర్టికోలో ఆగివున్న తన ఫియట్ కారును చూడగానే ఆమె కళ్ళు మెరిశాయి. డ్రైవింగ్ సీట్లో కూర్చుని, స్టార్టుచేసి, ముందుకు పోనిచ్చింది.

## 2

రంగు రంగుల దీపతోరణాలతో దేదీప్యమానంగా వెలిగిపోతోంది విశాలాక్షి ఇంటి ప్రాంగణం! కంపౌండ్లో అప్పటికే రకరకాల కార్లు వచ్చి, బారులుదీరి ఆగివున్నాయి. తన కారును మెయిన్ గేటుగుండా లోనికి పోనిచ్చి, ఓ పక్క పార్కుచేసి, పేకెట్ అందుకుని దిగింది శ్రీలత.

ఏడుకింకా రెండు నిమిషాలున్నాయి. వడివడిగా నడుస్తూ సింహద్వారాన్ని సమీపించింది. అక్కడ నిల్చుని, వస్తున్న అతిథులపై పన్నీరు చిలుకుతూ స్వాగతం పలుకుతున్నారు విశాలాక్షి తలిదండ్రులు. వారికి నమస్కరించి హాల్లో అడుగు పెట్టింది లత.

అప్పటికే అతిథులతో కిటకిటలాడుతోంది హాలు. అందులో కొందరు ఆమెకు బాగా పరిచయస్థులే. మరి కొందరు ముఖ పరిచయస్థులైతే, కొందరు అపరిచితులూ వున్నారు. ఓ యువకుణ్ణి వారికి పరిచయంచేస్తూ తిరుగుతున్న విశాలాక్షి దృష్టి శ్రీలతమీద పడగానే అతని చెయ్యి పట్టుకుని ఆమె దగ్గరికి లాక్కొచ్చి—

“నే చెప్పలా? ఈయనే మా అన్నయ్య రఘువీర్!

ఈమె నా స్నేహితురాలు శ్రీలత!" అంటూ పరస్పరం పరిచయం చేసింది.

చేతులు జోడించి నమస్కరించాడతను. సన్నగా పొడుగ్గా వున్నాడు. నొక్కుల జుత్తు నల్లపాంట్లో తెల్ల చొక్కా టక్ చేశాడు. కాళ్ళకి బూట్సు.

తొమ్మిదిన్నరకల్లా బర్తుడే తతంగం ముగిసింది.

ఆ తరవాత రఘువీర్ అతిథుల్ని ఉద్దేశించి తాను వారి మనోరంజనంకోసం ప్రదర్శించబోతున్న హిప్నాటిజం గురించీ, దాని ప్రాశస్త్యం గురించీ, ఈ నాడు వైద్య రంగంలోనూ అది సంతరించుకుంటున్న ప్రాముఖ్యం గురించీ, వివరించి, తన ప్రదర్శనకోసం ఆ అతిథుల్లో శ్రీలతను ఎన్నుకోదలచినట్టు ప్రకటించగానే అందరూ చప్పట్లు చరిచారు బిగ్గరగా.

మరొకరైతే అలా తమ పేరు ప్రకటింపబడేసరికి భయంతోనో, మొహమాటంతోనో వెనుకంజ వేసేవారే! కానీ, సదా చలాకీగా నవ్వుతూ, నవ్విస్తూ ఉండే శ్రీలత ఏ మాత్రం అభ్యంతరం తెల్పకుండా నవ్వుతూ ముందుకు వచ్చింది.

రఘువీర్ ఓ కుర్చీ తెప్పించి, హాలుమధ్య వేయించాడు. అతిథులంతా ఆసక్తిగా ఆ కుర్చీని చుట్టుముట్టారు. శ్రీలతని ఆ కుర్చీలో కూర్చోమన్నట్టు సైగ చేశాడతను.

ఆమె కూర్చుంది.

"ఇప్పుడు కాస్త నా వైపు పరీక్షగా చూడండి!"

తలెత్తి అతని మొహంలోకి చూసింది శ్రీలత. అంతే! రఘువీర్ ఆమె కళ్ళల్లో కళ్ళు పెట్టి సూటిగా చూశాడు.

అంతవరకూ చిరు దరహాసం చిలికిస్తున్న శ్రీలత పెదవులు అకస్మాత్తుగా బిగుసుకుపోయాయి. వెన్న ముకలో మంచుగడ్డ కరిగిపోతున్నట్టు తోచింది. అతని కళ్ళల్లో అనూహ్యమైన మెరుపు కానవస్తోంది

"మిస్ లతా! మీ కనురెప్పలు బరువెక్కుతున్నాయి. మస్తిష్కాన్ని నిద్ర మత్తు ఆవహిస్తోంది.... మీరు పడు కుంటున్నారు.... నిద్రపోతున్నారు...." అనసాగాడతను నిర్విరామంగా.

తనకు తెలీకుండానే కళ్ళు మూసుకుంది శ్రీలత. ఐనా, తను మేల్కొనే ఉన్నాననీ, నిద్రకు చాలా దూరంలో ఉన్నాననీ ఆమెకు తెలుస్తూనే వుంది. అతని మాటలు కూడా స్పష్టంగా వినిపిస్తూనే ఉన్నాయి.

"మీ కళ్ళు బరువెక్కుతున్నాయి.... శరీరం దూది పింజలా తేలికవుతోంది.... నిద్ర ముంచుకువస్తోంది మీకు. నిద్రలోకి జారిపోతున్నారు.... గాఢ నిద్రలోకి...."

"లేదు! నేను నిద్రపోడంలేదు. మేల్కొనేవున్నాను. మీ మాటలు వింటున్నాను. నా చుట్టూ నిల్చున్న అతిథుల ఉనికికూడా స్పష్టంగా తెలుస్తూనే వుంది నాకు" అంది శ్రీలత చాలా నెమ్మదిగా.

అలా అన్నదే కానీ, తన శరీరంలో తనకే తెలీకుండా ఏదో పరివర్తన ప్రస్ఫుటమౌతున్నట్టు ఆమె గ్రహించక పోలేదు. హిప్నాటిజం గురించి అదివరకే తను కొన్ని వ్యాసాలు చదివింది పత్రికల్లో. హిప్నటైజ్ చెయ్య బడుతున్న వ్యక్తి మానసికంగా హిప్నాటిస్ట్‌తో సహాక రించకుండా, దృఢచిత్తంతో ఉంటే అతను ఎట్టి పరిస్థితి లోనూ తన ప్రయత్నంలో సఫలం కాజాలడట!

అలాగే, తనూ మానసికంగా అతనితో సహాకరించక,

అతని ప్రయత్నాలన్నీ చిత్తుచేసి, నలుగురిలో నవ్వుల పాలు చెయ్యాలి. అనుకుంటూ మనసును అదుపులో పెట్టడానికి ప్రయత్నించసాగింది.

ఐనా, అతని మాటలు వింటూ క్రమంగా ఆమె మనసు అదుపు తప్పుతూ అర్థసుషుప్తావస్థలోకి దిగజారసాగింది. అతనంటున్నట్టు ఇప్పుడు నిజంగానే తన శరీరం దూదిపింజలా తేలికవుతున్నట్టు అనుభూతి కలగసాగింది. కళ్ళు తెరవడానికెంత ప్రయత్నించినా అవి తెరుచుకోడానికి నిరాకరిస్తున్నాయి. కనీసం లేచి నిల్చుందామన్నా శరీరం లేవనుగాక లేవనంటూ మొరాయిస్తోంది!

ఇప్పుడు తను పూర్తిగా అతని దయాదాక్షిణ్యాల మీద ఆధారపడున్నట్టు అర్థమైపోయిందామెకు. ఏమిటీ మాయ?

"ఇప్పుడు మీరు పుస్తకం చదువుతున్నారు....చాలా శ్రద్ధగా చదువుతున్నారు" అన్నాడతను ఆజ్ఞాపిస్తున్న ధోరణిలో.

ఆమె చేతులు అప్రయత్నంగా మొహం దగ్గరికి లేచాయి. పుస్తకం లేకన్నా చేతిలో పుస్తకం వున్నట్టే భ్రమిస్తూ, ఏమేమో పలవరించసాగింది.

"ఇప్పుడు టైప్ రైటర్ మీద ఉత్తరం టైప్ చేస్తున్నారు!"

ఆమెముందు టైప్ రైటర్ ఉనికేలేదు. ఐనా, టైప్ చేస్తునట్టు గాల్లో చేతివేళ్ళు తాటించసాగింది.

"ఇప్పుడు గ్లాసులో నీళ్ళు తాగుతున్నారు."

నిజంగానే నీళ్ళు తాగుతున్నట్టు పైకెత్తి నోటిమీదికి చెయ్యి తీసికెళ్ళింది లత. ఎంత కాదనుకున్నా అతని

ఆజ్ఞలు ధిక్కరించడానికి ఆమెకు శక్తి చాలడంలేదు. తన చేష్టలు చూపరులకు వింతగా తోస్తుండవచ్చనీ, వారు తనని తెలివితక్కువదానిగా భావిస్తుండవచ్చనీ ఆలోచిస్తూనే వుంది. ఆ ఆట అలా కొనసాగుతూనే వుంది!

"ఇప్పుడు మీరు నిద్రమత్తులోంచి మేల్కొంటారు... కళ్ళు తెరుస్తున్నారు జాగ్రదావస్థలోకి వస్తున్నారు.." అనసాగాడతను గంట తరవాత.

అంతవరకూ మెదడు నావహించిన మగత మబ్బులా విడిపోతున్నట్టూ, అవయవాలు మళ్ళీ తన అధీనంలోకి వస్తున్నట్టూ, స్ఫురించి, నెమ్మదిగా కళ్ళు తెరిచింది శ్రీలత. అంతే. అతిథులు చప్పట్లతో హాలు మారుమోగి పోయింది.

నవ్వుతూ లేచినిల్చుంది శ్రీలత. అతిథులు రఘువీర్ని చుట్టుముట్టి అభినందనలతోనూ, ప్రశ్నలతోనూ ముంచెత్తసాగారు.

అలా పదకొండు గంటలకు ముగిసింది పార్టీ!

అందరూ ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకుంటూ బైటికి నడవసాగారు. స్నేహితురాలివద్ద సెలవుతీసుకుని, తనూ బైటికి నడిచింది శ్రీలత. కాంపౌండ్లో ఆగివున్న కార్లు ఒకదాని వెనక ఒకటి స్టార్టవుతున్నాయి.

వాటిని తప్పుకుంటూ తన కారు ఆపివున్న చోటికి నడవసాగింది.

అంతలో — "లతగారూ!" అన్న పిలుపు విని, చటుక్కున వెనుదిరిగి చూసింది.

జగన్నాథం! నవ్వుతూ ఆమెని సమీపిస్తున్నాడు. ముఫ్ఫైఏడూ, ముఫ్ఫైఎనిమిదేళ్ళుంటాయతనికి. మామూలు

ఒడ్డూ పొడుగు. ఒళ్ళంతా కాటిక పూసినట్టు కారునలుపు. కందగడ్డలాంటి ముక్కు. మొహంమీద స్ఫోటకం మచ్చలు, ఓ పట్టాన దువ్వెనకు లొంగని బిరుసు జుత్తు. చీకట్లో ఎవరైనా చటుక్కున చూస్తే జడుసుకునే ఆకృతి అతనిది.

బూడిదరంగు ఫుల్ సూటు తొడిగి, మెడలో ఎరుపు రంగు టై కట్టుకున్నాడు. అతన్ని చూసినప్పుడల్లా భగవంతుడు ఎక్కడలేని కురూపాన్నంతా సమీకరించి, అతనికే సమర్పించాడా అనిపిస్తుంది శ్రీలతకు.

అందుకు భిన్నంగా అతని భార్యను చూస్తే మగవారి కళ్ళటుంచి, ఆడవారి కళ్ళే చెదిరిపోతాయి క్షణంపాటు! అంతటి అందగత్తె ఆమె.

అందుకే భార్యను ఎప్పుడూ తనవెంట యెక్కడికీ తీసికెళ్ళడు. ఆమె ముందు దిష్టిబొమ్మలా కనిపిస్తాడనో, లేదా పురుషుల కళ్ళు ఆమెని రెప్పవేయకుండా చూస్తుంటాయనో!

అటువంటి సౌందర్యవతి ఏరికోరి ఇలాంటి కురూపిని ఎలా కట్టుకుందా అని ఎవ్వరైనా ముక్కుమీద వేలేసుకోక మానరు. పేద పడుచులకు పెళ్ళిళ్ళు ముఖ్యంగానీ, వర అందచందాలతోనూ, వయసుతోనూ ఏమిటి పని?

జగన్నాథం ఐశ్వర్యవంతుడు. నగరంలో పేరుమోసిన ఆటోమొబైల్ స్పేర్ పార్ట్సు డీలర్. అతని ఐశ్వర్యం ముందు ఆమె ఆకలి తలవంచి వుంటుంది.

ఏది ఏమైనా ఆ భార్యాభర్తలిద్దరూ శ్రీలతకు సుపరిచితులే! జగన్నాథం అప్పుడప్పుడూ ఆమె అన్నయ్యతో బిజినెస్ వ్యవహారాలు చర్చించడానికి వారి ఇంటికి వస్తూ ఉంటాడు.

"ఎలా వుంది ప్రదర్శన? నచ్చిందా?" అడిగింది శ్రీలత అతను దగ్గరికి రాగానే.

"ఆ విషయమే మీతో మాట్లాడాలని ఆగాను. హిప్నటైజ్ చెయ్యబడుతున్నప్పుడు ఎలా ఫీలయ్యారు మీరు?" అడిగాడు జగన్నాథం కుతూహలంగా.

"చాలా అసహ్యకరమైన ఆటలా తోచింది."

"నో, నో! వాస్తవాన్ని దాస్తున్నారు మీరు. ప్రదర్శన జరుగుతున్నంతసేపూ మీరు దాన్ని ప్రతిఘటించడానికి విశ్వప్రయత్నం చేసి విఫలమయ్యారు. అంతేకాదు, మీ ప్రవర్తనవల్ల ప్రేక్షకులు మిమ్మల్ని తెలివితక్కువదానిగా భావిస్తున్నారేమోనని తెగ బాధపడిపోయారు. ఔనా?"

ఆశ్చర్యంతో ఆమె కళ్ళు విప్పారాయి. "ఈ విషయాలు ఎలా తెలిశాయి మీకు?"

అతను చిన్నగా నవ్వి — "ఆ సమయంలో నేను మీలో ఉత్పన్నమైన భావాలను చాలా స్పష్టంగా చదవగలిగాను. హిప్నాటిజం గురించి నాకు బాగా తెలుసు. ప్రతి మనిషిలోనూ కొన్ని మహత్తర శక్తులు అంతర్గతంగా నిక్షిప్తమై ఉంటాయి. కొన్ని ప్రత్యేక సమయాల్లోనే అవి కట్టలు తెంచుకుని బహిర్గతమౌతుంటాయి.

మనుషులు నిత్య జీవితంలో తరుచూ పరస్పరం ఒకరి ఆలోచనలు ఒకరు చదవడానికి ప్రయత్నిస్తుంటారు. ఐతే, హిప్నాటిజం జరుగుతున్న సమయంలో అలా చదివే అంతర్గత శక్తి ప్రేరేపింపబడి ద్విగుణీకృతమౌతుంది. బహుశా, మనిద్దరి ఆలోచనా తరంగాల ఫ్రీక్వెన్సీ ఒకటే అయివుండాలి.

అందుకే నేను మీ ఆలోచనల్ని చాలా స్పష్టంగా ఆకళింపు చేసుకోగలిగాను. దాన్నేమంటారో తెలుసా?"

"ఏమంటారు?"

"టెలిపతీ?"

"టెలిపతా?"

"ఔను! ప్రదర్శన సమయంలో మీరు, 'అతనితో సహకరించకూడదు. ప్రతిఘటించాలి. అతని ప్రయత్నాలను చిత్తు చేసి నలుగురిలో నవ్వులపాలు చెయ్యాలి .... నా చేతిలో ఎటువంటి పుస్తకమూ లేదు.... నేను ఏ ఉత్తరాన్నీ టైపు చెయ్యడం లేదు....నీళ్ళు తాగడం లేదు....' అనుకోసాగారు. ఔనా?" అడిగాడు.

తన ఆలోచనల్ని అంత స్పష్టంగా విశదీకరిస్తున్న అతనివైపు ఆశ్చర్యంగా చూసింది శ్రీలత. ఐనా, వెంటనే తమాయించుకుని, "బహుశా, మీరు మారుతున్న నా ముఖ కవళికల్ని బట్టి ఇవన్నీ అంచనా వేసుకుంటారు" అంది కొట్టిపారేస్తూ.

"నో, నో! ఆ సమయంలో మీ మొహంలో యెటువంటి భావాలూ లేవు. చాలా ప్రశాంతంగా, భావరహితంగా వుంది. కావలిస్తే ఎవరినైనా అడగండి. నాకే ఆశ్చర్యంగా ఉందిప్పుడు. మీ మనోభావాలనెలా చదవగలిగానా అని!"

అయోమయంలో శ్రీలత కనుబొమలు ముడిపడ్డాయి.

"భయపడకండి! ఇలాగే ఇకముందు కూడా మీ ఆలోచనల్ని ఎప్పుడుపడితే అప్పుడు ఎక్కడ చదువుతానో అని ఆందోళన పడుతున్నారు కదూ? అనవసరంగా ఒకరి వ్యక్తిగత విషయాలు తెలుసుకోడానికి ప్రయత్నించే కుసంస్కారిని కాను నేను."

"అది కాదు. ఇది ఎలా సంభవమా అని ఆలోచిస్తున్నానంతే!"

"సృష్టి వైచిత్ర్యాల్లో ఇదీ ఒక విచిత్రమే అనాలి! శాస్త్రజ్ఞులు కూడా ఎంతో కాలం ఈ విషయంమీద పరిశోధనలు జరిపి, ఇది సంభవమేనని నిర్ధారించి, దీనికి టెలిపతీ అని పేరుపెట్టారు!"

"సరే! ఈ క్షణంలో నేనేం ఆలోచిస్తున్నానో చెప్పండి చూద్దాం!"

జగన్నాథం క్షణంపాటు ఆమెని పరీక్షగా చూసి, "ఈ విధంగా మీ వ్యక్తిగత విషయాలూ, రహస్యాలూ మీవి కాకుండా పోతాయనీ, నావల్ల ముందు ముందు మీకు అనేక ఇబ్బందులు కలగవచ్చనీ ఆలోచిస్తున్నారు. ఔనా? ముందే చెప్పాను. నేనలాంటి మనిషిని కానని. ఇప్పుడు మీరు చెప్పండి. నేను మీ గురించి ఏం ఆలోచిస్తున్నాను?" అడిగాడు.

ఆశ్చర్యాన్ని అతికష్టంమీద అణగదొక్కుతూ, అతని కళ్ళల్లోకి చూసి, అతని మనోభావాలు చదవడానికి ప్రయత్నించింది శ్రీలత. మరుక్షణం ఆమె మొహం ఎరుపెక్కి కందగడ్డలా మారి, చటుక్కున చూపులు దించుకుంది. "మీరు....మీరు నన్ను ముద్దుపెట్టుకోవాలనుకుంటున్నారు!"

"సారీ, అలా ఆలోచించినందుకు. అందమైన అమ్మాయిని చూడగానే మగవారలాగే ఆలోచిస్తారండీ! వస్తాను. ఉదయం ఫ్లైట్ లో పనిమీద బొంబాయి వెళ్ళవలసి ఉంది నాకు. మీ అన్నయ్యను అడిగానని చెప్పండి" అంటూ ఇక ఆమెముందు నిల్చోలేక, తన కారువైపు నడిచాడు జగన్నాథం పట్టుబడ్డ దొంగలా.

తన కార్లో కూర్చుని, స్టార్టు చేసి, ముందుకు పోనిచ్చింది శ్రీలత. ఊహించని ఆ సంఘటనలో ఆమె మస్తిష్కం ఆలోచనారహితమైపోయింది చాలా సేపు. ఇంటికెళ్ళి పక్కమీద వాలిందేగానీ, ఆశ్చర్యాతిశయంతో ఓ పట్టాన నిద్రపట్టలేదామెకు.

## 3

"ఆంటీ .... ఆంటీ! నన్ను కాల్లో పార్కుకు తీసి కెళ్ళవూ?" ఆరేళ్ళ అన్నకొడుకు మురళి మారాం చేస్తోంటే కాదనలేకపోయింది శ్రీలత.

"అలాగే. తప్పకుండా తీసికెళ్తాను. బూట్లు తొడుక్కో మరి!" అంది వాడి బుగ్గలు చిదుముతూ.

"సాయంత్రం అవగానే ఇదో అలవాటైపోయింది వీడికి" అంటూ బూట్లు తెచ్చి తొడిగింది మురళి తల్లి.

శ్రీలత నవ్వి, వేళ్ళతో వాడి తల దువ్వి, "శభాష్! ఇక వెళదామా?" అంటూ ఎత్తుకోబోయింది.

"బాల్! నా బాల్!" అంటూ తుర్రుమని ఓ మూల పడున్న రంగురంగుల ఫుట్ బాల్ తీసుకొచ్చాడు. వాణ్ని ఫ్రంట్ సీట్లో పక్కన కూర్చోబెట్టుకుని, స్టీరింగ్ ముందు కూర్చుంది శ్రీలత. కారు స్టార్టు చేసి ముందుకుపోనిచ్చింది.

పావుగంటలో పానగల్ పార్కు చేరి, పార్కింగ్ ప్లేస్‌లో కారాపి దిగింది. ఇంకా పూర్తిగా చీకటిపడ లేదు. ఐనా, పార్కులో దేదీప్యమానంగా వెలుగు తున్నాయి ఫ్లోరోసెంట్ లైట్లు. బాలందుకుని కార్లోంచి బైటికి దూకాడు మురళి. పచ్చికబైలు మీద సాటి పిల్లలతో వాడు ఆడుకుంటోంటే చూసి ఆనందిస్తూ ఓ పక్క కూర్చుంది శ్రీలత.

గంట తరవాత లేచి, "ఇక వెళదామా?" అడిగింది.

అప్పటికే చీకటిపడింది బాగా. ఐనా, లైట్ల కాంతిలో పార్కు పట్టపగల్లా వెలిగిపోతోంది. మిగతా పిల్లల తలి దండ్రులు తమతమ పిల్లల్ని వెంటబెట్టుకుని వెళ్ళిపోతున్నారు.

"ఉఁహుఁ! ఇంకా ఆడుకుంటా!" అంటూ బంతిని కాళ్ళతో తంతూ ముందుకు సాగాడు మురళి. వాడి అభీష్టాన్ని కాదనడం ఇష్టంలేక, నెమ్మదిగా వాడి వెనకే నడవసాగింది లత.

అంతలో కుర్రాడు బంతిని ఈడ్చి తన్నాడు గట్టిగా. అది ఎగిరి దూరాన క్రోటన్స్ మొక్కల మధ్య పడింది.

"ఆంటీ, బాల్!" అన్నాడు మురళి అటు చూపుతూ.

"తెస్తానుండు" అంటూ గబగబ అటు నడిచింది లత.

వంగి, బాల్ అందుకుని తలెత్తింది. అంతే! శిలా ప్రతిమలా మళ్ళీ కదల్లేక పోయింది. క్రోటన్స్ కావలి వైపు కొద్ది దూరంలో యూకలిప్టస్ చెట్టు దగ్గర ఇద్దరు స్త్రీ పురుషులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు ఏకాంతంగా.

ఆ స్త్రీ చెయ్యి పురుషుడి ఒళ్ళో వుంది. అతని చెయ్యి ఆమె భుజంమీద! మాటల మధ్య నవ్వుతూ ఆమె బుగ్గ మీద చిటికెకూడా వేస్తున్నాడతను. అది పార్కు చివరి ప్రదేశం కావడంవల్ల అక్కడ అట్టే వెలుతురు లేదు. ఐతే, దూరాన వెలుగుతున్న ఓ ఫ్లోరో సెంట్ లైటు కాంతి కొద్దిగా ఆమెమీద పడుతోంది.

ఆ వెలుగులో ఆ స్త్రీని పోల్చుకున్న శ్రీలత దిగ్భ్రాంతితో నోరు తెరిచింది!

ఆమె ఎవరో కాదు.

జగన్నాథం భార్య! సులోచన!!

జుగుప్సతో చటుక్కున వెనుదిరిగింది లత. నిన్న రాత్రి తనతో టెలిపతీ గురించి మాట్లాడాక, ఈ రోజు ఉదయం ఫ్లైట్‌లో పనిమీద బొంబాయి వెళుతున్నానని చెప్పాడు జగన్నాథం!

భర్త ఊళ్ళోలేని సమయం చూసుకుని ఈవిడగారు పరపురుషుడితో....ఇదా సంగతి! పైకి అందంగా, అమాయకంగా కనిపించే ఈ స్త్రీలో ఇంతటి మాలిన్యమా!

ఆలోచిస్తూ కుర్రాడు మారాం చేస్తున్నా వినకుండా ఇక ఒక్క క్షణం కూడా అక్కడుండలేక, వాణ్ణెత్తుకుని పార్కింగ్ ప్లేస్ వైపు నడిచింది శ్రీలత.

## 4

ఆ సంఘటన జరిగిన రెండురోజుల తరవాత రాత్రి తొమ్మిది గంటలకు అన్నా, వదినలతో కలిసి భోంచేసి, మేడమీద తన గదిలో కెళ్ళి ఓ ఆంగ్లపత్రిక తిరగేస్తూ సోఫాలో కూర్చుంది. భోంచేశాక ఓ గంటసేపు అలా ఏదో ఒక పుస్తకం చదివి, పక్కమీద వాలడం అలవాటు శ్రీలతకు.

రెండు పేజీలు తిరగేసిందో లేదో, అంతవరకూ బాగానే వున్న మెదడులో ఏదో సంచలనం ప్రారంభమైనట్టు తోచి, వేళ్ళతో కణతలు అదుముకుంది. క్షణాలు గడుస్తున్నకొద్దీ ఆ సంచలనం సద్దుమణగడం అటుంచి, మరింత ఉధృతమై, ఈదురుగాలికి టెలిఫోన్ తీగలు పరస్పరం కొట్టుకుంటున్నట్టు శబ్దాలు ఉత్పన్నం కాసాగాయి.

పత్రికను ఒళ్ళో బోర్లించి, రెండు చేతులతో కణతలదుముకోసాగింది శ్రీలత. ఉన్నట్టుండి హఠాత్తుగా ఆమె మస్తిష్కపు తెరపై ఓ వింత దృశ్యం కాసేపు మసక

మసకగా కదులుతూ, క్రమంగా స్పష్టంకాసాగింది.

అది మీనంబాకం విమానాశ్రయం! ఆగి వున్న విమానంలోంచి, చేతిలో బ్రీఫ్ కేస్ పట్టుకుని మిగతా ప్రయాణీకులతో మెట్లుదిగుతున్నాడో వ్యక్తి. అంతర్నేత్రంతో అతన్ని శాస్త్ర పరీక్షగా చూసి, వెంటనే పోల్చుకుంది శ్రీలత.

అతను జగన్నాధం!

విమానం దిగి, వడివడిగా నడుస్తూ ఏర్ స్టేషన్ వెలపలి టాక్సీ స్టాండ్ చేరుకున్నాడు. చుట్టుముట్టిన టాక్సీ డ్రైవర్లని చీల్చుకుంటూ ఓ టాక్సీలో కూర్చున్నాడు. మరుక్షణం టాక్సీ కదిలి ముందుకుసాగింది.

కొన్ని రోడ్లు కట్ చేసి, నగరం మధ్య వున్న మేడ ముందాగింది. జగన్నాధం డ్రైవర్ కి డబ్బు చెల్లించి, కాంపౌండ్లోకి నడిచాడు. మూసివున్న తలుపు పక్క కాలింగ్ బెల్ బటన్ వత్తాడు. ఐదు నిమిషాలు దాటినా తలుపు తెరుచుకోలేదు.

చిరాకుతో మొహం చిట్లించి మళ్ళీ వత్తాడు. ఐనా, తెరుచుకోలేదు. తలుపు విసుగుతో దబదబ బాదాడు. ఈసారి లోపలినించి ఏవో మాటలు వినిపించాయి.

"నేను!" అన్నాడు కోపంగా.

తలుపు తెరుచుకుంది.

"మీరా!" సులోచన కంఠంలో వణుకు.

"ఏమిటలా గాభరాపడుతున్నావు? జరక్కూడనిదేదో జరిగిపోయినట్టు? రేపు రావలసింది ఈ రోజు వచ్చాను, అందుకేనా?"

"అ....అబ్బే....అది...కాదండీ...."

"ఏమిటా తడబాటు? నన్ను లోపలికి రానిస్తావా?

లేక పరాయివాడిలా బైటే నిల్చుని మాట్లాడమంటావా?"
చిరాకుతో ఆమెని పక్కకి నెట్టి, లోన అడుగు పెట్టాడు జగన్నాథం.

అంతే! సరిగ్గా అదే క్షణంలో వర్రు గుండీలు పెట్టు కుంటూ ఓ వ్యక్తి అదరాబాదరా లోపలినుంచి ఇవ తలికి వచ్చాడు. ఊహించని ఆ సంఘటనతో జగన్నాథం దేవ్వలుడిగి అతన్నే చూస్తుండిపోయాడు. ఆ వ్యక్తి బెదిరిన నక్కలా పరిగెత్తుతున్నట్టు నడుస్తూ కాంపౌండ్ గేటు దాటి, రోడ్డుమీద అదృశ్యమయ్యాడు.

"ఓహో! ఇదా నీ ఖంగారుకారణం!" అంటూ సులోచనవైపు తిరిగాడు జగన్నాథం.

"ఎన్నాళ్ళనించీ సాగుతోందీ వ్యవహారం?"

తలవంచుకుంది సులోచన!

మరుక్షణం ఛెళ్ళుమంది ఆమె చెంప!

అంతే! ఆ తరవాత శ్రీలత మస్తిష్కంలో మెదులు తున్న ఆ దృశ్యం మసకబారుతూ, క్రమంగా అదృశ్యమై పోయింది! జగన్నాథం చూస్తుండగా ఆ ఇంట్లోంచి బైటికి వచ్చిన వ్యక్తి ఎవ్వరో ఇప్పుడర్థమైందామెకు'

మొన్న పార్కులో సులోచన వెంట వున్న వ్యక్తి అతనే! ఇప్పుడామె రహస్యం భర్తముందు బట్టబయలై పోయిందా? రంగు చేతులతో పట్టుబడిందా? తన ఊహతో ఏమాత్రం ప్రమేయంలేకుండా సినిమా చూసి నట్టు ఆ దృశ్యాలన్నీ తన మదిలో ఎలా కదిలాయి? ఏమిటీ విచిత్రం?

తామిద్దరి ఆలోచనా తరంగాల ఫ్రీక్వెన్సీ ఒకటేనని చెప్పాడు జగన్నాథం! అచ్చం టెలివిజన్ సిస్టంని పోలినట్టుందే ఈ మహేంద్రజాలమంతా! యెక్కడో

టి. వి. స్టూడియోలో వీడియో కెమెరాతో షూట్ అయ్యే ప్రోగ్రాం దృశ్యాలు వాయు తరంగాల్లో వెద జల్లబడి, ఎంటెనాద్వారా గ్రహింపబడి టి.వి. తెరపై ప్రతిఫలిస్తూ ప్రేక్షకుల కంటికి కనబడతాయి.

అలాగే జగన్నాధం తన కళ్ళతో చూస్తున్న దృశ్యాలూ, చెవులతో వింటున్న శబ్దాలూ, వాయు తరంగాల్లో తేలి, సమాన ఫ్రీక్వెన్సీగల తనను చేరి, తన మెదడనే ఎంటెనానాద్వారా గ్రహింపబడి, మస్తిష్క మనే తెరపై ప్రతిఫలిస్తున్నాయా?

అలాగే, తను చూస్తున్న దృశ్యాలూ, వింటున్న శబ్దాలూ అతనూ గ్రహించగలడా? ఏమిటీమాయ? అదే నిజమైతే తన వ్యక్తిగత విషయాలన్నీ అరక్షణంలో అతనికి తెలిసిపోవూ? ఇదంతా నిజమేనా? లేక తన భ్రమా? ఈ విపత్తునించి ఎలా విముక్తి పొందాలి?

ఇటువంటి ఆలోచనలతో ఆ రాత్రంతా ఆమెకు నిదరపట్టలేదు పక్కమీద!

# 5

"అత్తా!"

"ఏం వదినా?"

"మీ అన్నయ్య ఫోన్ చేశారు. ఆఫీసునించి రాగానే తిన్నగా సినిమాకు వెళదామని!"

రిస్టువాచీ చూసుకుంది శ్రీలత. ఎనిమిదిగంటలు. "ఈ సమయంలో నా?"

"సెకండ్ షోకోసం టికెట్లు బుక్ చేయించారట. రేపు పనిమీద కలకత్తా వెళుతున్నారుగా, వారంరోజుల వరకూ రారట!"

"ఏ సినిమా?"

"శక్తి! దిలీప్ కుమార్, అమితాబ్ నటించిన హిందీ చిత్రం! అల్ఫా టాకీసులో!"

"సరే, తయారై వస్తాను" అంటూ మేడ మెట్లెక్కి తన గదిలోకెళ్ళింది శ్రీలత. జడ వేసుకుని, బట్టలు మార్చుకుంటే తయారైనట్టే. అనుకుంటూ డ్రెస్సింగ్ టేబిల్ ముందు కూర్చుని తల దువ్వుకోసాగింది.

సరిగ్గా ఆ దేసమయంలో ప్రారంభమయ్యాయి ఈదురు గాలులు ఆమె మనస్సిమ్ముంలో! అప్రయత్నంగా జారి పడిపోయింది చేతిలోంచి దువ్వెన! కాసేపు తల తిరిగి నట్టు తోచి అద్దంలో కనిపిస్తున్న తన ప్రతిబింబం క్రమ క్రమంగా అదృశ్యమౌతూ, దాని స్థానే ఓ అస్పష్ట దృశ్యం ప్రత్యక్షమౌతున్నట్టు స్ఫురించసాగిందామెకు.

కళ్ళు చిట్లిస్తూ ఆ దృశ్యాన్ని పరీక్షగా చూడటానికి ప్రయత్నించింది. మబ్బు తెరలు తొలుగుతున్నట్టు ఇప్పుడా దృశ్యం స్పష్టంగా, చాలా స్పష్టంగా కనిపించ సాగింది అద్దంలో!

అది ఓ కారు విండ్ స్క్రీన్ డ్రైవింగ్ సీట్లో కూర్చుని, కారు డ్రైవింగ్ చేస్తున్నవారికి విండ్ స్క్రీన్ లోంచి రోడ్డు కనిపించే విధంగా కనిపిస్తోందా దృశ్యం! కారు హెడ్ లైట్స్ వెలుగు రోడ్డుమీద పడుతోంది. రోడ్డు కిరుపక్కలా యేపుగా ఎదిగి వున్నాయి చెట్లు. కారు చాలా నెమ్మదిగా సాగుతోంది ముందుకు. రోడ్డు మీద జనసంచారం లేదు.

కారు అలా కొంత దూరం వెళ్ళాక, అర ఫర్లాంగు దూరంలో రోడ్డు కడంపక్కన ఏదో తెల్లగా కదులుతూ కనిపించసాగింది. కారు క్రమంగా దగ్గరవుతున్నకొద్దీ అదేమిటో అర్థమైంది శ్రీలతకు. అది తెల్ల దుస్తుల్లో

వున్న ఓ స్త్రీ ఆకారం!

ఆ స్త్రీ చేతిలో ఓ సూట్ కేస్ వుంది. నీలిరంగు సూట్ కేస్! ఎవరికోసమో, లేదా ఏ కారుకోసమో అక్కడ నిల్చుని ఎదురుచూస్తున్నట్టు కనిపిస్తోందామె. ఐతే, ఆ కారు కోసం మాత్రంకాదని స్పష్టంగా తెలిసి పోయింది శ్రీలతకు.

కారణం ఎప్పుడైతే ఆమె తల తిప్పి ఇటు చూసిందో, మరుక్షణం ఆమె కళ్ళు భయంతోనూ, ఆశ్చర్యంతోనూ విప్పారాయి. అంతలో కారుకూ, ఆమెకూ చాలా దగ్గరి దూరం మిగిలిపోయింది. ఇప్పుడు కారు నడుపుతున్న వ్యక్తి హెడ్ లైట్స్ కాంతిలో ఆమెను స్పష్టంగా చూడగలుగుతున్నాడు.

ఆ స్త్రీ ఎవరో కాదు.

సులోచన!

కారు దగ్గరవుతున్నకొద్దీ ఆమె మొహం తెల్లగా పాలిపోసాగింది. కళ్ళల్లో ఖంగారు కొట్టవచ్చినట్టు కని పిస్తోంది. అలాగే, కారు నడుపుతున్న వ్యక్తి ఆలోచనా తరంగాలు కూడా శ్రీలత మనోఫలకం మీద ప్రతి ఫలించసాగాయి. అసహ్యం, క్రోధం, ప్రతీకారం, క్రూరత్వంతో కూడిన ఆలోచనలు!

నీకేం తక్కువ చేశాను? ఏం లోటు చేశానని ఇంతటి ద్రోహానికి పాల్పడ్డావ్? నీ బండారం బద్దలయ్యాక మళ్ళీ ఎప్పుడూ అటువంటి తప్పుడు పనులు చెయ్యకుండా బుద్ధిగా వుంటావని ఆశించాను. క్షమించి ఊరుకున్నాను. అందుకు భిన్నంగా ఇప్పుడు వాడితో లేచిపోవడానికి తయారయ్యావా? అపురూపంగా నీకోసం చేయించిన నగలూ, నగదూ ఆ సూట్ కేస్ లో నింపుకుని దొంగ

చాటుగా ఇల్లు వదిలి వస్తావా? నేను కురూపిననీ, ఎల్లప్పుడూ వ్యాపార గొడవల్లో మునిగి తేలుతుంటాననే కదూ నీ బరితెగింపుకు కారణం?

కురూపిని కావడం నా నేరమా? రాత్రింబవళ్ళూ కష్టపడుతోంది నీకోసంకాక మరెవరికోసం? సరే, ప్రేమించేవారిని ప్రేమించడం, ద్వేషించేవారిని ద్వేషించడం మానవ నైజం! నువ్వు నన్ను ఏవగించుకుంటున్నప్పుడు నిన్ను నేనెందుకు ప్రేమించాలి?

నా కష్టార్జితంతో, నీకిష్టమైనవాడితో రహస్యంగా లేచిపోదామని నిర్ణయించుకున్నావు కదూ? అలాగే నేనూ ఒక నిర్ణయానికి వచ్చానిప్పుడు. ఇక వాడితో ఎక్కడికీ పోలేవు నువ్వు, పరలోకానికి తప్ప!

అంతే! మరుక్షణం కారు స్పీడ్ హెచ్చింది. శరవేగంతో ఆమెని, సమీపించసాగింది. ఆ హఠాత్పరిణామానికి ఆమె హడలిపోయింది. బాణంలా తన మీదికి దూసుకువస్తున్న కారును తప్పించుకోడానికి నాలుగడుగులు వెనక్కి వెయ్యబోయి, ఫుట్ పాత్ అడ్డుతగిలి తడబడింది.

ఆ తడబాటుతో ఆమె చేతిలో వున్న సూట్ కేస్ జారి కిందపడింది. మరుక్షణం ఆమె గావుకేక పెడుతూ వెనుదిరిగి రోడ్డుపక్క చెట్లవైపు పరుగులు తీసింది. ఆ చెట్ల నడుమ కంచెలా ఎదిగి వున్న ముళ్ళ పొదలు అడ్డు లేకుంటే, బహుశా తప్పించుకునేదేమో!

వాటిని చూడగానే, ఒక్కసారి ఆగి, కారువైపు తిరిగింది. ప్రాణభీతితో అతన్ని వేడుకుంటున్నట్టు రెండు చేతులూ ఎత్తి జోడించింది. ఐనా, కారు స్పీడ్ తగ్గ

లేదు. జరగబోయేదేమిటో ఆమెకు తెలిసిపోయినట్టు గొంతుపొర చిరిగేలా గావుకేక పెట్టింది.

అప్పటికే, జరగవలసింది జరిగిపోయింది. మరో భయంకరమైన కేక కారు శబ్దంలో కలిసిపోయింది. చక్రాలకింద ఏదో అడ్డు తగిలినట్టు ఆరంగుళాలు పైకెగిరి పడింది కారు. ఇక ఆ దృశ్యం చూడలేక చటుక్కున కళ్ళపై చేతులు కప్పుకుంది శ్రీలత.

పెదాలు వణికాయి అప్రయత్నంగా, "భగవంతుడా! ఏమిటిదంతా?"

అంత చలిలోనూ ఆమె నుదుటిపై అసంఖ్యాకమైన స్వేదబిందువులు పేరుకుంటున్నాయి నెమ్మదిగా!

అంతలో భుజంమీద ఏదో మెత్తగా తగిలి, తృళ్ళిపడి కళ్ళు తెరిచింది.

అద్దంలో అంతవరకూ కనిపించిన దృశ్యం మాయం! ఆ స్థానే వదిన రూపం కనిపించింది. "ఏం జరిగింది లతా! ఎందుకలా వున్నావ్?"

"ఏం లేదు వదినా తల నెప్పిగా వుంది. మీరు వెళ్ళి రండి సినిమాకు. టాబ్లెట్ వేసుకుని పడుకుంటాను."

"నిన్ను విడిచి మేమెలా వెళ్ళేది? మీ అన్నయ్య రానీ, యేమంటారో చూద్దాం! అలా పడుకో, విక్స్ రుద్దుతాను" అంది వదిన టేబిల్ సొరుగులాగుతూ.

## 6

రాత్రి బాగా పొద్దుపోయేవరకూ తీవ్ర మానసిక ఒత్తిడితో బాధపడి, నిద్రమాత్రలు మింగి పడుకున్న శ్రీలత, ఉదయం కళ్ళు తెరిచిచూస్తే టీపాయ్‌మీది టైంపీస్ పదిగంటలు చూపెడుతోంది.

నెమ్మదిగా లేచి కూర్చుంది. బాగా నిద్రపోవడంవల్ల

ఇప్పుడు కాస్త రిలాక్స్‌గా వుంది ఒళ్ళు.

“లేచావా లతా? ఒంట్లో ఎలా ఉందిప్పుడు? రెండు మూడుసార్లు వచ్చి చూశాను బెడ్ టీ ఇద్దామని” అంటూ గదిలోకి వచ్చింది వదిన.

“తలపోటు పూర్తిగా తగ్గిపోయింది వదినా! థాంక్స్. అన్నయ్య వెళ్ళాడా?”

“ఇందాకే వెళ్ళాడు ఏర్‌పోర్టు! మురళి ఓ పట్టాన వదల్లేదనుకో. నిన్ను జాగ్రత్తగా చూసుకోమని చెప్పి మరీ వెళ్ళాడు. తొమ్మిదిన్నరకు ఉందిట కలకత్తా ఫ్లైయిట్. కూర్చో టీ పట్టుకొస్తాను” అంటూ బైటికి నడిచింది వదిన.

పదహారేళ్ళ ప్రాయంలో తలిదండ్రుల్ని కోల్పోయిన తనకు వారి లోటు ఏమాత్రం తెలీనివ్వకుండా చూసు కుంటున్న అన్నావదినలంటే శ్రీలతకు పంచప్రాణాలు.

వదిన అందించిన టీ తాగి, కాలకృత్యాలు తీర్చుకుని, డైనింగ్ టేబిల్ ముందు కూర్చోగానే వేడివేడి ఇడ్లీల ప్లేటు ప్రత్యక్షమైంది. కొబ్బరి చెట్నీతో ఇడ్లీలారగించి, కాఫీ తాగగానే పేపర్ తెచ్చి ముందుంచాడు నౌఖరు.

పేపరు తిరిగేస్తున్న శ్రీలత కళ్ళు ఓ వార్త మీద నిలిచాయి.

‘రోడ్డు ప్రమాదంలో స్త్రీ దుర్మరణం!’

మద్రాసు, ఆగస్టు, 26:—గతరాత్రి ఎనిమిదిగంటలకు విజయరాఘవాచారి రోడ్డులో సుమారు ఇరవై ఎనిమిదేళ్ళ అందమైన స్త్రీని గుర్తు తెలియని వాహనం ఢీకొనగా ఆమె అక్కడికక్కడే ప్రాణాలు విడిచింది.

మనుష్య సంచారం అంతగా ఉండని ఆ రోడ్డులో రాత్రి విపరీతమైన చలివల్ల పూర్తిగా నిర్మానుష్యమై

ఉండాలని, అందుకే ఆ దుర్ఘటనను ఎవ్వరూ చూడలేక పోయారనీ పోలీసుల ద్వారా తెలిసింది.

వారి విచారణలో హతురాలి పేరు సులోచన అనీ, ఆమె భర్త శ్రీ జగన్నాథ్ నగరంలో పేరుమోసిన ఆటోమొబైల్ స్పేర్ పార్టు డీలరనీ తెలిసింది. ఆ దుర్ఘటన జరిగిన సమయంలో ఆయన పాండీబజార్లోని తన మెయిన్ బ్రాంచి ఆఫీసులో వున్నాడట. తన భార్య ఆ సమయంలో ఒంటరిగా కాలినడకన ఆ రోడ్డువైపు ఎందుకు వెళ్ళిందో తనకు తెలీదని పోలీసులతో చెప్పాడాయన.

ప్రత్యక్ష సాక్ష్యులు లేని కారణంగా శ్రీమతి సులోచన మరణానికి కారణమైన ఆ వాహనాన్ని కనుగొనడం పోలీసులకు పెద్ద సమస్యగా మారింది. ఐనా, వారు అధైర్యపడక తమ విచారణ కొనసాగిస్తున్నారు.

ఆ వార్త చదివాక దిగ్భ్రాంతితో చేష్టలుడిగి చాలా సేపు అలాగే కూర్చుండిపోయింది శ్రీలత. ఆ ఘటనాస్థలంలో ప్రత్యక్ష సాక్ష్యులెవ్వరూ లేకపోయినా, ఎంతో దూరంలో ఉండికూడా తాను ప్రత్యక్షంగా చూసిందా దృశ్యాన్ని.

పోలీసులూ, పత్రికలవారూ దాన్ని సాధారణ రోడ్డు ప్రమాదంగా భావిస్తున్నా, అది పదహారణాల పచ్చి హత్య అని తనకు తెలుసు. అంతేకాదు, ఆమెను హత్య చేసింది మరెవ్వరో కాదనీ, స్వయాన ఆమె భర్త జగన్నాథమేనని కూడా తనకు బాగా తెలుసు.

పోలీసులు దాన్ని రోడ్డు ప్రమాదంగా భావిస్తే, హంతకుడు చట్టం చేతుల్లో పడకుండా చాలా సులభంగా తప్పించుకోగలడు. అతని భార్య నీతిమాలినదే

కావచ్చు. నమ్మకద్రోహం కావచ్చు. అంతమాత్రాన ఆమె నిండు ప్రాణాలు బలి తీసుకునే హక్కు అతని కెవరిచ్చారు?

అటువంటి నీతిబాహ్యురాలిని వదిలించుకోడానికి విడాకుల రూపంలో చట్టపరంగా సులభతరమైన మార్గం ఉండగా అటువంటి దారుణానికి ఎందుకు పాల్పడాలి? వీల్లేదు! అతను చట్టంనించి తప్పించుకోడానికి వీల్లేదు.

అది హత్య అనీ, హంతకుడు అతనేననీ తెలిసికూడా తను నోరు మూసుకూర్చుంటే, జీవితాంతం తన అంతరాత్మ తనని క్షోభపెట్టక మానదు. వెళ్ళాలి. పోలీసుల దగ్గరికి వెళ్ళి అంతా చెప్పేయ్యాలి. కనీసం ఆ విధంగానైనా వారికి సరైన సూచన దొరుకుతుంది. జగన్నాథం వారి దృష్టిలో పడతాడు. అనుకుంటూ లేచి నిల్చుంది.

7

"ఇన్‌స్పెక్టర్ యుగంధరరెడ్డిగారు ఉన్నారా?"

"ఉన్నారు. అదుగో, అదే ఆయన ఆఫీసురూం!" చెప్పాడు ఓ సబ్‌ఇన్‌స్పెక్టర్ వేలితో ఓ గది చూపుతూ.

అది క్రైంబ్రాంచి హెడ్‌క్వార్టర్స్!

అతను చూపిన గదివైపు నడిచింది శ్రీలత. స్ప్రింగ్ డోర్స్ మూసి వున్నాయి. తలుపు పక్కన గోడకు బిగించి వుంది నేమ్ ప్లేట్.

'ఇన్‌స్పెక్టర్ యుగంధరరెడ్డి.'

"మే ఐ కమిన్ సర్?" అడిగింది తలుపు ముందాగి.

"ఎస్ ప్లీజ్!" వినిపించింది లోపలినించి.

స్ప్రింగ్ డోర్స్ తీసుకుంటూ లోన అడుగుపెట్టింది శ్రీలత.

ఇన్‌స్పెక్టర్ క్షణంపాటు ఆమెని పరీక్షగా చూసి.

"కూర్చోండి" అన్నాడు.

అతని ముందున్న కుర్చీలో చతికిలబడింది.

"చెప్పండి. ఏం పనిమీద వచ్చారు?"

కంఠం సవరించుకుని, మొదటినించీ చివరివరకూ అంతా పూసగుచ్చినట్టు చెప్పి, "తరుచూ పత్రికల్లో మీ పేరు చదువుతుంటాను. ఆ కేసు ఏ పోలీస్ స్టేషన్ పరిధిలోకి వస్తుందో, దాని గురించి ఎవరు విచారణ జరుపుతున్నారో నాకు తెలీదు. అందుకే మీ వద్దకు వచ్చాను" అంది శ్రీలత.

ఇన్‌స్పెక్టర్ పలకలేదు. ఆమె చెప్పింది విని, రెండు నిమిషాలు ఆమెని పరీక్షగా చూడసాగాడు. అతని కళ్ళల్లో తనపట్ల అనుమానం, సందేహం ద్యోతకమౌతున్నట్టు పసిగట్టింది శ్రీలత. కొంపదీసి అతను తన కథనం విని, తనకు మతిస్థిమితం లేదని అనుమానించడం లేదుకదా?

ఆలోచనగా తలూపాడు ఇన్‌స్పెక్టర్. "నా సర్వీసులో ఇంతవరకూ ఎక్కడా ఎప్పుడూ కనీ వినీ ఎరగని చిత్రమైన విషయమిది. నమ్మాలా వద్దా అన్న మీమాంసలో పడిపోతున్నాను. మీరు నన్ను కలుసుకోడం ఒకవిధంగా మంచిదే అయింది!"

"ఔను. ఈ విధంగా పోలీసుల పరిశోధనకు సరైన ఆధారం లభిస్తుందని ఆశించి వచ్చాను. రోడ్డుమీద నడిచే వారిని గుద్దేసి, ప్రమాద స్థలంలో ఆగకుండా పారిపోయే వాహనాల గురించి తరుచూ పత్రికల్లో చదువుతూనే ఉంటాం!

అటువంటి సంఘటనలు జరిగినప్పుడు సాధారణంగా ఆ వాహనాల హెడ్‌లైట్సో, బంపర్సో లేదా బాడీ ఇతరచోటా సొట్టలు పడటం జరుగుతూ ఉంటుంది.

ఒకసారి జగన్నాథం కారును పరీక్షిస్తే అసలు విషయం మీకర్థమౌతుందనుకుంటాను."

"సరే, పెర్సనల్‌గా ఈ విషయంలో నేను ఇంట్రెస్టు తీసుకుంటాను. ఐతే, కోర్టులో జగన్నాథం తన భార్యను చంపడానికిగల నిర్దుష్టమైన కారణం చూపవలసి ఉంటుంది. అందుకు ఆ రోజు సాయంత్రం పానగల్ పార్కులో అతని భార్యవెంట వున్న వ్యక్తి యెవరో కనుక్కోడం చాలా అవసరం!

భర్త కన్నుగప్పి సులోచన ఆ వ్యక్తితో సంపర్కం పెట్టుకున్నందుకే, ఆ సంగతి తెలిసిన జగన్నాథం ఆమెను చంపేశాడని కోర్టువారిని నమ్మించాలి. యెవరతను? ఎక్కడుంటాడు? అతన్ని మళ్ళీ మీరు చూస్తే గుర్తుపట్టగలరా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

పెదవి విరిచింది శ్రీలత. "సారీ! పానగల్ పార్కులో అతన్ని అంత పరీక్షగా చూడలేకపోయాను. కారణం వాళ్ళిద్దరూ పార్కు చివర మసకచీకట్లో కూర్చున్నారు. దూరాన వెలిగే ఫ్లోరోసెంట్ లైటు కాంతి కొద్దిగా సులోచనమీద పడుతోంది. ఆమెనే చూడగలిగాను పరీక్షగా.

ఆ మర్నాటి రాత్రి ఇంట్లో వుండగా నా మనస్సు తెరపై జగన్నాథం విమానం దిగి, టాక్సీలో ఇంటికి వెళ్ళడం, కాలింగ్ బెల్ వత్తడం, తలుపు తెరుచుకోడం, అతన్ని చూడగానే సులోచన బెదిరిపోవడం, అదే సమయంలో ఇంట్లోంచి ఆ వ్యక్తి బిత్తర చూపులు చూస్తూ బైటికివచ్చి చరచరా వెళ్ళిపోడం మొదలైన దృశ్యాలు కనిపించినప్పుడు కూడా అతన్ని నేను పరీక్షగా చూడలేకపోయాను. ఇప్పుడేం చేయ్యాలి?

అతన్ని ఎక్కడ వెదకాలి?"

"అదంతా నేను చూసుకుంటాను. మీ చిరునామా ఇచ్చి వెళ్ళండి, ఏమైనా తెలిస్తే ఫోన్ చేసి చెబుతాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నోట్‌బుక్ తెరుస్తూ.

తన చిరునామా చెప్పి, "దయచేసి ఎట్టి పరిస్థితి లోనూ నేను మిమ్మల్ని కలుసుకున్న సంగతి జగన్నాధానికి తెలియనివ్వకండి. అంతేకాదు, పత్రికల వారి కూడా! జగన్నాధాని కటుంచి, లోకానికంతా నా గురించి తెలిసిపోతుంది.

నిజానికి ఉదయం పత్రికలో సులోచన మరణవార్త చదవకుండా వుంటే అంతవరకూ నా కళ్ళల్లో కదిలిన ఆ విచిత్ర దృశ్యాలన్నీ కేవలం నా భ్రమగానే భావించే దాన్ని. ఐతే, నేను సులోచన చేతిలో చూసిన నీలి రంగు సూట్‌కేస్ గురించి పత్రికలో ఎలాంటి ప్రస్తావనా లేదు. బహుశా, ఆమె చనిపోగానే జగన్నాధం ఆ సూట్‌కేస్‌ని తన వెంట తీసికెళ్ళాడేమో!" అంది శ్రీలత.

"ఆ విషయం కూడా ఆరాతీస్తాను. ఇకమీరు వెళ్ళి రండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నోట్‌బుక్‌లో వివరాలు రాసుకుంటూ.

శ్రీలత లేచి, నమస్కారం పెట్టి, బైటికి వచ్చింది. ఇక పోలీసులు ఏం చేసినా, చెయ్యకున్నా తనకు నిమిత్తం లేదు. తన కర్తవ్యాన్ని తాను నిర్వర్తించింది. అను కుంటూ కారెక్కి, తిన్నగా ఇంటివైపు పోనిచ్చింది.

# 8

"శ్రీలత స్పీకింగ్!"

"నేను యుగంధర రెడ్డిని మాట్లాడుతున్నాను."

"చెప్పండి సార్! ఏమైనా తెలిసిందా?"

"తెలిసింది. హెడ్ క్వార్టర్స్‌కి వచ్చి నన్ను కలుసుకోండి చెబుతాను వివరాలు."

"ఇప్పుడే వస్తున్నా!" అంటూ రిసీవర్ క్రెడిల్ చేసి, రిస్టువాచీ చూసుకుంది శ్రీలత. సాయంత్రం ఐదుగంటలు. కారెక్కి హుటాహుటిన క్రైంబ్రాంచ్ హెడ్ క్వార్టర్స్ చేరుకుంది.

ఆమెని చూడగానే కూర్చోమన్నట్టు సైగచేశాడు ఇన్‌స్పెక్టర్. "ఆ కేసు పరిశోధిస్తున్న ఇన్‌స్పెక్టర్ వెంట నేను జగన్నాథం ఇంటికెళ్ళి, ఒకసారి అతని కారు చూడాలని కోరాను.

గారేజ్‌లోకి తీసికెళ్ళి చూపాడు. అది కారుకాదు. జోంగా జీప్! అతను కారు వాడడట! ఆ జీప్‌ను జాగ్రత్తగా పరిశీలించాం! దాని బంపర్, ఛేసిస్ ఫ్రేం చాలా బలిష్టమైనవి. అది మనిషిని ఢీకొన్నా, పెద్ద చెట్టును ఢీకొన్నా వీసమెత్తు సొట్ట పడదు!"

"మరి ఆ సూట్‌కేస్ సంగతి?" అడిగింది శ్రీలత నిరుత్సాహంగా.

"దాన్ని గురించికూడా అతన్ని ప్రశ్నించాం! తన భార్యవద్ద అటువంటి సూట్‌కేస్ ఏదీ లేదనీ, ఆమె తన బట్టలూ, సామానూ పెద్దసైజు లెదర్ కేసుల్లోనూ, గోద్రెజ్ బీరువాలోనూ పెట్టుకుంటుందని చెప్పాడు!"

"సులోచన చేతిలోంచి ఆ సూట్‌కేస్ కిందపడగానే జీప్ గుద్దేసింది ఆమెను. బహుశా, దానిమీద ఆమె రక్తపు మరకలు కూడా పడుండాలి. అందుకే అతను దాన్ని తనవెంట తీసికెళ్ళి, ఆధారం లేకుండా ఎక్కడైనా పాతేశాడేమో! లేదా, తన ఇంట్లోనే ఎక్కడో

దాచేశాదేమో! ఒకసారి ఆ ఇల్లు సోదా చేస్తే బావుండేది."

పెదవి విరిచాడు ఇన్‌స్పెక్టర్. "ఒకరి ఇల్లు సోదా చెయ్యడం అంత సులభంకాదు. కోర్టుద్వారా సెర్చి వారెంట్ పొందాలి. అంతేకాదు, ఆ ఇల్లు ఎందుకు సోదా చెయ్యదలచామో కారణాలతో సహా వివరించాలి కోర్టుకు!

మీరు చెప్పిన వివరాలు ఉదహరిస్తే మేజిస్ట్రేట్ మమ్మల్ని పిచ్చివాళ్ళకింద జమకట్టవచ్చు. ప్రపంచంలోని ఏ కోర్టూ మిమ్మల్ని ప్రత్యక్ష సాక్షిగా అంగీకరించదు. కారణం, ఆ సమయంలో మీరు ఆ ప్రదేశానికి ఎంతో దూరంలో ఉన్న మీ ఇంట్లో వున్నారు!"

"ఐతే, ఇక ఈ విషయంలో మీరేమీ చెయ్యలేనంటారా?"

"సారీ, అయామ్ వెరీ సారీ!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సానుభూతిగా.

"సరే, వస్తాను. సెలవు!" అంటూ లేచి బైటికి వచ్చేసింది శ్రీలత. కారెక్కి ఇల్లుచేరేసరికి వదిన ఎదురైంది. "ఎక్కడికెళ్ళావు లతా? ఈమధ్య నీకు మతిమరుపు వచ్చేసినట్టుంది. వెళ్ళేటప్పుడు వదినకు చెప్పడం కూడా మర్చిపోతున్నావు. రా, కాఫీ తాగుదువుగాని. సాయంత్రం టిఫిన్‌లో నీకిష్టమైన ఉల్లి పకోడీలు వేయించాను."

"సారీ వదినా! విశాలాక్షి వెంటనే రమ్మని ఫోన్ చేస్తే వెళ్ళాను" ఏమనాలో తోచక బొంకింది శ్రీలత.

"ఎందుకు పిలిచిందట?"

"అచ్చే, కొత్త బట్టలు కొనడానికి బజారుకెళ్తూ,

సెలక్షన్ కోసం నన్ను తోడు రమ్మంది. అంతే!" ఒక అబద్ధాన్ని సమర్థించుకోడానికి మరో అబద్ధాన్ని జోడించక తప్పదు మరి.

"సర్లే, పద, టిఫిన్ చేద్దువుగాని!"

తినాలని లేకున్నా, కదిన నొచ్చుకుంటుందని, నాలుగు పకోడీలు నమిలి, కాఫీ తాగి తనగదిలోకెళ్ళి, ఉస్సూరు మంటూ సోఫాలో చతికిలబడింది.

అంతే! తుఫానుగాలులు ప్రారంభమయ్యాయి తలలో!

ఎంత ఉధృతంగా ప్రారంభమయ్యాయో, అంత సద్దుమణగసాగాయి. మరుక్షణం ఆమె మస్తిష్క పు ట్రాన్స్మీటర్ ఓ సుపరిచిత కంఠాన్ని రిసీవ్ చేసుకో సాగింది.

'సందేహంలేదు....శ్రీలత పోలీసులకు చెప్పి వుంటుంది....ఆమెకు తప్ప....సులోచన....మరణ రహస్యం మరెవ్వరికీ....తెలిసే....అవకాశంలేదు....'

జగన్నాధం ఆలోచనా తరంగాలవి!

అంతవరకూ సజావుగా కొట్టుకుంటున్న ఆమె గుండెలో ఇప్పుడు దడ ప్రారంభమైంది! ఇన్ స్పెక్టర్ యుగంధర రెడ్డి అతనింటికెళ్ళి అతని జీపును పరిశీలించి, సూట్ కేస్ గురించి ప్రశ్నించగానే పోలీసులకు తనమీద అనుమానం కలిగించడానికి మూలకారణం ఎవరో సులభంగానే అర్థమై వుంటుందతనికి.

లేదా, మొదటినుంచీ అతను తన ఆలోచనల్ని చదువుతున్నాడేమో! ఇప్పుడేం చెయ్యాలి? తన భయం చివరికి నిజమే అయింది. జగన్నాధం ఏంచేస్తాడు? తన మీద ప్రతీకార చర్యకు పూనుకుంటాడా? ఒక నిందు

ప్రాణిని బలిగొనడానికి బరితెగించినవాడు. సాక్ష్యాన్ని నిర్మూలించడానికి మరో ప్రాణం తియ్యకుండా ఊరుకుంటాడా?

ఆ ఆలోచన రాగానే శ్రీలత వెన్నెముకలో సన్నగా వణుకు ప్రారంభమైంది. తన భయాందోళనలని ఎవరి ముందు చెప్పుకోవాలి? ఎవరు నమ్ముతారు? పోలీసులైతే ముందే నిరాకరించారు నమ్మడానికి. వదిన నమ్ముతుందా? ఏమో! నమ్మడానికి బదులు తనకు పిచ్చి పట్టిందని భయపడి, ఏ పిచ్చాసుపత్రికో తీసికెళ్తే?

సమయానికి అన్నయ్య కూడా లేడే ఊళ్ళో! ఏం చెయ్యాలిప్పుడు .... ఆc! కొన్నాళ్ళు ఈ ఊరొదిలి ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోతే? ఆ విధంగా జగన్నాథం ఆలోచనలు తనదరి చేరకుండా జాగ్రత్తపడితే, క్రమంగా అతను తనని మర్చిపోవచ్చు. పరిస్థితి మళ్ళీ మామూలు స్థితికి రావచ్చు!

ఆ ఆలోచన రాగానే మద్రాసుకు వందమైళ్ళ దూరంలో వున్న తిరవాన్మూర్ అనే ఊరు జ్ఞాపకం వచ్చింది శ్రీలతకు. అది తన మేనత్త ఊరు. అపార ఆస్తిపాసులకు వారసుడైన ఆమె ఒక్కగానొక్క కొడుక్కే తననిచ్చి పెళ్ళి చెయ్యాలని అన్నయ్య సంకల్పం!

పెద్దల మధ్య ఆ నిర్ణయం ఎప్పుడో జరిగిపోయింది కూడా! వచ్చే ఏడు తన ఎమ్.ఏ. పరీక్షలు పూర్తి కాగానే.... శ్రీలత బుగ్గలు ఎరుపెక్కాయి సిగ్గుతో. అక్కడ బావ అండ ఉండగా ఏ గండమూ తన దరి చేరదు. సురక్షితంగా వుండవచ్చు.

అనుకుంటూ ఓ నిర్ణయానికి వచ్చి, రాత్రి భోజనాల

సమయంలో వదినముందు ఆ ప్రస్తావన కదిపింది శ్రీలత.

"కాలేజీలు తెరవడానికింకా ఇరవై రోజులున్నాయికదా, ఒకసారి అత్తయ్య ఊరెళ్ళొస్తాను వదినా!"

"అదేమిటి? వుండి వుండి అత్తయ్య జ్ఞాపకం వచ్చిందేమిటి నీకు?"

"ప్రతి వుత్తరంలోనూ రమ్మని రాస్తుందికదా? అందుకు!"

"అత్తయ్య రాస్తుందా? లేక...."

"ఛో వదినా! నువ్వు మరీను."

"అదా సంగతి! అందుకే ఈ మధ్య అంత పరాకుగా వుంటున్నావు!"

"బావకోసం నేనేం దేవిరాడలేదు. అత్తయ్యను చూడాలని వెళ్తున్నానంతే!" అంది శ్రీలత చిరుకోపంతో.

"ఒకరోజు ఎలాగూ శాశ్వతంగా అక్కడికే వెళ్ళాలి కదా....సర్లే, నీ మనసు నొప్పించి నేనెందుకు పాపం చుట్టుకోవాలి? ఇంతకీ, ఎప్పుడు ప్రయాణం?"

"రేపే!"

"ఐతే అర్జంట్ కేసే నన్నమాట! మీ అన్నయ్య వచ్చాక అందరం కలిసే వెళదామనుకున్నాను. సమయానికి డ్రైవర్ కూడా లేడుకదా, జ్వరంవచ్చి ఇంట్లో పడుకున్నాడని ఇందాకే వాడి కొడుకు వచ్చి చెప్పాడు. ఎలా వెళతావ్ మరి?"

"నా కారు లేదూ? నాకు నడపడం రాదూ?"

"ఒంటరిగా వెళతావా?"

"విశాలాక్షిని తోడు రమ్మంటాను. ఎంత నెమ్మదిగా వెళ్ళినా నాలుగ్గంటల ప్రయాణమే కదా? ఉదయం

పదిగంటలకు శైలుదేరితే మధ్యాహ్నం రెండు గంటలకు చేరుకుంటా నక్కడికి!"

"సరే, నీ ఇష్టం వెళ్ళిరా!"

'హమ్మయ్య!' అనుకుంటూ భోజనాలయ్యాక తన గదిలోకెళ్ళి, స్నేహితురాలికి ఫోన్ చేసింది శ్రీలత.

"ఎవరూ?" వినిపించింది అవతలినించి ఆమె తల్లి కంఠం.

"నేనాంటీ, శ్రీలతని! విశాలాక్షి ఉందా ఇంట్లో?"

"ఆఁ! పిలుస్తానుండు."

రెండు నిమిషాల తరవాత విశాలాక్షి కంఠం వినిపించింది. "ఏమిటే లతా? రెండు రోజుల్నించీ కనిపించడం అటుంచి, కనీసం ఫోన్ కూడా చెయ్యలేదు?"

"వేరే పనుల్లో వుండిపోయానే! అది సరేగానీ, రేపు కార్లో మా అత్తయ్య వూరు తిరువాన్మూర్ వెళుతున్నాను. నిన్ను కూడా తీసికెళ్ళాలనుంది. ఏమంటావ్?"

"సారీ లతా! మా అన్నయ్య, అదే, హిప్నాటిస్టు! వారి ఫ్యామిలీ, మా ఫ్యామిలీ రేపు మహాబలిపురం వెళ్ళబోతున్నాం! విహారయాత్రకు. అయామ్ వెరీ సారీ, లేకుంటే నీవెంట తప్పకుండా వచ్చేదాన్నే!"

నిట్టూర్చింది శ్రీలత. "మళ్ళీ యెప్పుడు వస్తారు మద్రాసు?"

"నాలుగు రోజుల తరవాత! నువ్వెప్పుడొస్తావ్?"

"బహుశా, పదిహేనురోజులు పట్టవచ్చు."

"అత్తయ్యను అడిగానని చెప్పు. అలాగే మీ శ్రీవారిని కూడా!"

"చాల్లే! ఉంటా మరి!" అంటూ రిసీవర్ దించేసింది, ఇంకా ఆగితే స్నేహితురాలు ఆటపట్టించడం ఖాయమని.

ఇక తను ఒక్కర్తే వెళ్ళక తప్పదు. విశాలాక్షి రావడంలేదని వదినకు చెబితే తనని ఒంటరిగా వెళ్ళనివ్వదు. ఏదో ఒకటి బొంకక తప్పదు మరి!

## 9

"లక్ష్మయ్యా! ఆ సూట్ కేస్ తీసికెళ్ళి నా కార్లో పెట్టు!" అంది శ్రీలత రిస్టువాచీ చూసుకుంటూ. ఉదయం పదిగంటలు.

"బైలుదేరుతున్నావా?" అడిగింది అప్పుడే పైకి వస్తున్న వదిన.

"ఔను వదినా! మురళి ఎక్కడ?"

"కింద వున్నాడు. విశాలాక్షి ఇంకా రాలేదేం?"

"తన ఇంటికెళ్ళి నేనే రిసీవ్ చేసుకుంటాను. ఇక బైలుదేరనా?"

"సరే, అత్తయ్యకూ మామయ్యకూ నా నమస్కారాలు చెప్పు. అలాగే, మీ ఆయన్ని అడిగానని చెప్పడం మరవక!"

ఎరుపెక్కిన చెక్కిళ్ళతో చరచర మెట్లు దిగి హాల్లో కెళ్ళింది శ్రీలత. ఆమెని చూడగానే, "ఆంటీ, నేనూ వస్తా!" అంటూ చుట్టేశాడు మురళి.

"అలా వెళ్ళి ఇప్పుడే వస్తాగా! ఏం తెమ్మంటావ్ నీకోసం?"

"ఎగిరే ఎలికాప్టర్!"

"సరే, తప్పకుండా తెస్తాను. టాటా!"

"తాతా!"

"వస్తాను వదినా! అన్నయ్య వచ్చాక, ఇద్దరూ రండి. తిరిగి అందరం కలిసి వచ్చేద్దాం!"

తలూపింది వదిన. "కార్లో పెట్రోలు చూసుకు

న్నావా?"

"చూశాను. పోయించాలి. దార్లో టాంకు నింపు కుంటాలే!" అంటూ కారెక్కి ముందుకు పోనిచ్చింది శ్రీలత.

నగరం పొలిమేరలు దాటుతుండగా యెదురైన పెట్రోల్ బంక్ లో టాంకు నింపుకుని, తిరువాన్కూర్ వెళ్ళే మెయిన్ రోడ్డుపై పరిగెత్తించింది కారును.

పన్నెండు గంటల ప్రాంతంలో సుమారు యాభై మైళ్ళ ప్రయాణం పూర్తయ్యాక, దూరాన చిన్న పట్టణం కనిపించసాగింది. అది వడివేలూర్!

అక్కడికి చేరగానే కాస్త టిఫిన్ చేసి, కాఫీ తీసుకుని, కారు ఇంజన్ చల్లబడేవరకూ రెస్టు తీసుకోవాలి. అనుకుంటూ ఇరవై గజాల దూరంలో ఎదురైన రోడ్డు మలుపు తిప్పటానికి క్లచ్ వత్తి, గేర్ డౌన్ చేసింది. అంతే!

గురగుర శబ్దం చేస్తూ రెండుసార్లు కుదుపు ఇచ్చి, కారు ఇంజన్ ఆఫ్ అయింది. గతుక్కుమంది శ్రీలత! ఉన్న కొద్ది స్పీడ్ లో వెంటనే కారును రోడ్డుకడంవైపు తీసి కళ్ళ బ్రేక్ వత్తేసింది. గేర్ న్యూటల్ చెయ్యకుండా డోర్ తెరిచి దిగి, బాయ్ నెట్ ఎత్తి చూసింది. సన్నని ఆవిర్లు వస్తున్నాయి ఇంజన్ లోంచి.

పావుగంటపాటు అటూ యిటూ తొంగిచూసింది. డిఫెక్టు ఏమిటో ఓపట్టాన బుర్రకు తట్టలేదు. కారు నడపడం తప్ప దాని లోపాలు కనిపెట్టగలిగే పరిజ్ఞానం లేదు! ఇప్పుడేం చెయ్యాలి? కనీసం వడివేలూర్ చేరినా ఏదో ఒక సహాయం దొరికేది.

అనుకుంటూ చుట్టూ కలయజూసింది. దూరాన

ఓ లోడెడ్ లారీ వస్తూ కనిపించింది, దాన్నాపి, వారి సహాయం కోరాలి. రోడ్డుమధ్య నిల్చుని ఎదురుచూడ సాగింది. లారీ దగ్గరికి రాగానే చెయ్యెత్తి వూపింది.

"ఎన్నాచి?" అడిగాడు డ్రైవర్ బ్రేక్ వేస్తూ తమిళంలో.

చెప్పింది తన అవస!

కష్టంలోవున్న అందమైన అమ్మాయి సహాయంకోరితే, కాటికి కాళ్ళు చాపుకున్న ముసలాడిలోనూ ఉత్సాహం ఉరకలు వేస్తుంది మరి!

డ్రైవర్, క్లీనర్ ఇద్దరూ లారీలోంచి ఛెంగున దూకి, ఆమె కారుని సమీపించారు. పదినిమిషాలు ఆ పార్టూ, ఈ పార్టూ తడిమిచూశారు. డిఫెక్టేమిటో వారికీ అర్థం కానట్టుంది.

డ్రైవర్ పెదవి విరిచి, "డిఫెక్టుదాం ఇంజన్‌లోనే వుండాది! టాపిట్ కవర్ విప్పి చూస్తేగానీ, ఏమీ తెరియాదు. అదుగో, వడివేలూర్ దగ్గరలోనే వుందేది. అక్కడ చిన్న మోటార్ వర్క్‌షాప్ గూడా ఉండాది. తీసికెళ్ళి చూపండి" అన్నాడు.

"అక్కడివరకూ కారు ఎలా తీసికెళ్ళాలి?" అడిగింది శ్రీలత నిరుత్సాహంగా.

"మేమ్దా వుండాంగా" అంటూ క్లీనర్ వైపు తిరిగి, "అదేయ్ తంబీ! టోచన్ రోబ్ కొండువా!" అన్నాడు డ్రైవర్.

కుర్రాడు పరిగెత్తి, లారీలోంచి టోచన్ రోబ్ తీసుకొచ్చాడు. లారీ వెనక కొక్కానికి దాన్ని బిగించి రెండో చివరను కారు బంపర్ హుక్‌లో ఇరికించాడు.

"ఇప్పిదాం మీరు కార్లో ఉక్కారు. నేను లారీ తోల్తా!" అన్నాడు డ్రైవర్.

బ్రతుకుజీవుడా అనుకుంటూ కారు ఫ్రంట్ డోర్ తెరిచి, స్టీరింగ్ ముందు కూర్చుంది శ్రీలత. లారీ నెమ్మదిగా ముందుకుసాగింది కారును లాగుతూ. అరగంట తరవాత రెండు వాహనాలూ వడివేలూర్ చేరుకున్నాయి.

లారీ డ్రైవర్ ఆమె కారుని ఊరిమధ్య వర్క్‌షాప్ దగ్గరాపి, టోచన్ ఊడదీశాడు.

"రొంబ థాంక్స్ తంబీ! ఇంద!" అంటూ పర్సు లోంచి పదిరూపాయలనోటు తీసి అతని చేతిలో పెట్టింది శ్రీలత.

"కారు ట్రబులా మేడమ్?" అంటూ పరిగెత్తు కొచ్చారు వర్క్‌షాప్ మెకానిక్, హెల్పర్లు. తలూపి, "చూసి సరిచెయ్యండి. ఆలోగా ఊళ్ళోకెళ్ళొస్తాను" అంది శ్రీలత.

మెకానిక్ కారు బాయ్‌నెట్ ఎత్తి చూడసాగాడు.

ఊళ్ళోకి బైలుదేరింది శ్రీలత. అటు మరీ పెద్దదీకాని, ఇటు చిన్నదీకాని మధ్యరకం ఊరది. సెంటర్లో ఒకే ఒక పెద్ద హోటల్ కమ్ లాడ్జింగ్ వుంది. మధ్యాహ్నం ఒకటింబావు అవుతోంది సమయం!

లైట్ టిఫిన్ ఏమైనా తీసుకోవాలి అనుకుంటూ ఆ హోటల్లోకి నడిచింది శ్రీలత. టిఫిన్ చేసి, కాఫీతాగి బైటపడేసరికి రెండయింది. కారు పాడవకుంటే ఈపాటికి తిరువాన్కూర్ చేరేదే!

అనుకుంటూ వర్క్‌షాప్ వైపు నడిచింది. అక్కడి కెళ్ళి చూస్తే మెకానిక్ అతని హెల్పర్ కుర్రాళ్ళూ కారు ఇంజన్‌లోని రెండు మూడు పార్టులు వూడదీసి,

పనిముట్లతో తంటాలు పడుతూ కనిపించారు.

ఆమెని చూడగానే మెకానిక్ మొఖంమీద చమట తుడుచుకుని, "గేర్ బాక్స్ చెడిపోయింది. క్లచ్ ప్లేట్ కాలిపోయిందమ్మా! కూర్చోండి. కాసేపట్లో రెడీ అవుతుంది కారు" అన్నాడు.

డోర్ తెరిచి, ఫుస్సూరుమంటూ కార్లో కూర్చుంది శ్రీలత. సీటు వెనక తలవాల్చిందో లేదో కొద్దిగా కునుకు పట్టేసింది.

# 10

"అమ్మగారూ! అమ్మగారూ!" అన్న పిలుపు విని తృళ్ళిపడి కళ్ళు తెరిచింది.

హెల్పర్ కుర్రాడు.

"క్లచ్ ప్లేట్ మార్చి, గేర్ బాక్స్ దిగించాం! కాస్త దిగుతారా? ట్రయల్ చూసి ఓ.కే. చేస్తాను" అంటున్నాడు మెకానిక్.

కారు దిగి చేతిగడియారం చూసుకుంది. ఐదుంబావు! మై గాడ్!!

"ఇంతసేపెందేం?" అంది ఖంగారుగా.

"ఏం చెయ్యాలమ్మా! ఈ కుర్రాళ్ళతో ఛస్తున్నాను వేగలేక!" అన్నాడు మెకానిక్ స్టీరింగ్ ముందు కూర్చుంటూ.

ట్రయల్ చూసి, నట్ బోల్టులన్నీ మరోసారి చెక్ చేసి ఓ.కే. అనేసరికి సాయంత్రం ఆరుగంటలు దాటింది. ముందే చలికాలం! ఆరుగంటలకే చీకట్లు చుట్టేశాయి పరిసరాలని. ఏం చెయ్యాలి? ఇప్పుడు బైలుదేరితే, ఎనిమిదవుతుంది తిరువాన్మూర్ చేరడానికి. పగలైతే ఫరవాలేదు.

రాత్రిపూట ఒంటరిగా నిర్జనమైన రోడ్డుపై ప్రయాణమంటే చచ్చే భయం తనకు. మెరుపులా ఓ పరిష్కారం స్ఫురించిందామెకు. ఆ హోటల్ కెళ్ళి బావకు ట్రంకాల్ చేసి, వచ్చి తనని తీసికెళ్ళమని చెబితే? అదే బెస్టు ఐడియా!

అనుకుంటూ మెకానిక్ కు రిపేరింగ్ ఛార్జి ఇచ్చేసి, హోటల్ కు బైలుదేరింది. అప్పటికే ఊళ్లో వీధిదీపాలు వెలిగాయి. హోటల్ ఆవరణలో కారాపి, "తిరువాన్కూర్ ట్రంకాల్ చెయ్యాలి" అంది కౌంటర్ క్లర్కుతో.

"సారీ మేడమ్! ఉదయంనించీ ఆ లైన్ ఔటాఫ్ ఆర్డర్లో వుంది. బహుశా రిపేరింగ్ నడుస్తుందేమో!" అన్నాడతను.

నిలువునా నీరు గారిపోయింది ఆమె ఉత్సాహం! అటు మద్రాసూ వెళ్ళలేకా, ఇటు తిరువాన్కూరూ చేరలేకా అడకత్తెరలో పోకచెక్కలా అయింది తన స్థితి. ఇక ఆ రాత్రి ఆ హోటల్లో బసచెయ్యడం తప్ప మరో మార్గం కనిపించడంలేదు.

"ఏదైనా రూం వుందా ఖాళీగా?" అడిగింది.

"వుంది! పదిరూపాయలు రోజుకి" అంటూ రిజిష్టర్ ఆమె ముందుకు తోశాడతను.

తన వివరాలు రాసి, సంతకం పెట్టి, అడ్వాన్స్ ఇచ్చేసింది.

"నాలుగో నెంబర్ గది!" అంటూ నౌకర్ని కేకేసి, "కార్లోంచి అమ్మగారి సామానులు తెచ్చి గదిలో పెట్టు!" అన్నాడు క్లర్కు తాళంచెవి అందిస్తూ.

కారు డిక్కీలోంచి సూట్ కేస్ తెచ్చి, "రండమ్మా!"

అంటూ లోపలికి నడిచాడు కుర్రాడు. కింది భాగంలోనే ఓ చివర వుంది గది. తాళం తెరిచి లోన అడుగు పెట్టింది.

ఓ పక్క మంచం, పరుపూ, ఓ మూల స్టూలుమీద నీళ్ళకూజా వున్నాయి. పక్కనే చిన్న బాత్‌రూం, లావెట్రీ! తలుపు కభిముఖంగా గోడలో పెద్ద కిటికీ వుంది. దళసరి అద్దాల కిటికీ!

కుర్రాడు కూజాలో నీళ్ళునింపి వెళ్ళగానే తలుపు మూసి, పైగడియా కింద గడియా బిగించి, కిటికీ బోల్టులు కూడా పరీక్షించి, నిట్టూరుస్తూ మంచంమీద కూలబడింది.

ఒంటరితనంవల్ల ఆమె కళ్ళల్లో పదేపదే జగన్నాథం రూపమే కదలసాగింది. ఈ అవస్థలన్నీ అతని మూలానే దాపురించాయి తనకి. అతని గురించి తాను భయపడు తున్నట్టే, అతనూ తన గురించి భయపడుతున్నాడేమో!

ఇక ఆ హత్య విషయం నేను మర్చిపోతాను. దాని గురించి ఎవరికీ ఏమీ చెప్పను. నీ స్వంత విషయాల్లోకి ఇంకెప్పుడూ జోక్యంచేసుకోను. అని అతని మెదడుకి మెసేజ్ పంపితే? నమ్ముతాడా? తనని వదిలిపెడతాడా?

“వదిలిపెట్టను. ఎట్టి పరిస్థితిలోనూ వదిలిపెట్టను!”

అదిరిపడి లేచి నిల్చుంది లత! తన ఆలోచనలకి జవాబుగా అతని కంఠం మారుమోగింది మదిలో! అంటే అంటే.... చటుక్కున గదిలోని లైటార్పి, తడుముకుంటూ కిటికీని సమీపించింది.

సవ్వడికాకుండా కిటికీ బోల్టులుతీసి, నెమ్మదిగా ఓ రెక్క తెరిచి పక్కకి చూసింది. హోటల్ ముందు భాగాన కాంపౌండ్లో వెలుగుతున్న లైటు కాంతిలో, బైట పార్క్‌చేసి వున్న తన కారు స్పష్టంగా కనిపిస్తోందామెకు.

కారు దగ్గర నిల్చుని, దాన్ని పరీక్షగా చూస్తున్నాడో వ్యక్తి! అతన్ని పోల్చుకోగానే శ్రీలత గుండె ఝల్లుమంది! జగన్నాథం! తన ఆలోచనల్ని చదువుతూ, వెంబడిస్తూ చేరుకున్నాడా ఇక్కడికి? తను ఈ హోటల్లో ప్రవేశించిన మరుక్షణం, ఫోటో తీసినట్టు హోటల్ ప్రతిబింబం అతని మస్తిష్కంలో ప్రతిఫలించి వుంటుంది. వచ్చేశాడు సులభంగా.

ఇప్పుడు కారు తనదా, కాదా అని తెలుసుకోడానికి పరీక్షిస్తున్నాడు. అనవసరంగా కాలయాపన చేస్తూ అక్కడే నిల్చుంటే కాసేపట్లో తనకు మరణం తథ్యం! పారిపోవాలి తక్షణం అక్కణ్నించి పారిపోవాలి.

ఆ ఆలోచన రాగానే అంతరాత్మ హెచ్చరించిందామెను. పిచ్చిదానా! పథకాలు వెయ్యక. మరుక్షణం అతనికి తెలిసిపోతుంది. ఇక ఏమీ ఆలోచించకు. నీ మెదడును ఖాళీగా వుంచు. శరీరాన్ని దాన్ని మానాన వదిలెయ్యి.

# 11

కిటికీ రెక్క కొద్దిగా తెరిచి, మళ్ళీ తొంగిచూసింది. జగన్నాథం సాలోచనగా తలూపుతూ కారు దగ్గర్నించి హోటల్ సింహ ద్వారంవైపు వెళుతున్నాడు. కిటికీ పూర్తిగా తెరిచింది లత. అదృష్టవశాత్తూ దానికి మధ్యలో రెండు చువ్వలు లేవు.

నెమ్మదిగా అందులోంచి దూరి, బైటికి దిగగలిగింది. ఆలస్యం చెయ్యకుండా పక్కనే వున్న కంపౌండ్ పిట్టగోడ ఎక్కి, అవతలకి దూకి పరుగుతీసింది. చలికాలం కావడంవల్ల వీధిలో మనుషులటుంచి, కుక్కలు కూడా కానరావడంలేదు. పైన మబ్బుతునకలేని ఆకాశం! దానిపై

చలిని ద్విగుణీకృతంచేస్తూ నిండుగా వెలిగిపోతున్న పౌర్ణమి చంద్రబింబం!

మాటిమాటికీ వెనుదిరిగి చూస్తూ మెయిన్ రోడ్డువైపు పరుగుతీస్తోంది శ్రీలత. ఐదునిమిషాల తరవాత చేరుకుంది రోడ్డుమీదికి. సరిగ్గా అదేక్షణంలో మద్రాసువైపునించి ఏదో వాహనం వస్తున్నట్లు హెడ్ లైట్స్ కనిపించసాగాయి.

ప్రాణం లేచివచ్చి, వాహనం దగ్గరికి రాగానే చెయ్యి ఊపింది. సడన్ బ్రేక్ వేశాడు డ్రైవర్.

"అర్జంటుగా తిరువాన్కూర్ వెళ్ళాలి. తీసికెళ్తారా నన్ను?" అడిగింది ప్రాధేయపడుతూ.

రెండు నిమిషాలు సందేహంగా చూసి, తరవాత తలూపాడు డ్రైవర్. అతని పక్కసీట్లో కూర్చున్న క్లీనర్ని వెనక బాడీలో కూర్చోమని, "రండి. ఎక్కండి త్వరగా!" అన్నాడు.

క్లీనర్ వుర్రాడు వెనబాడీలో కెళ్ళిపోయాడు. శ్రీలత డ్రైవర్ పక్కసీట్లో కూర్చుంది. లారీలో ప్రయాణించడం తన జీవితంలో ఇదే ప్రథమం! ఆ ఆలోచన రాగానే మళ్ళీ ఆమెను హెచ్చరించింది మనసు.

నీ గోతిని నువ్వే తవ్వుకుంటున్నావు. నువ్వు లారీ ఎక్కి తిరువాన్కూర్ పారిపోతున్నావని అరక్షణంలో పసిగట్టగలడు జగన్నాథం! ఇవి ఆలోచనలు కావు. నీ పాలిటి మృత్యుతరంగాలు!!

అందుకే, ఎటువంటి ఆలోచనలూ పెట్టుకోకుండా నీ బుర్రను ఖాళీగా వుంచుకో. లారీలో ప్రయాణిస్తూ నువ్వు చూసే ప్రతి దృశ్యం అతని మనోఫలకంపై ప్రతిఫలిస్తుంది. ఆ విధంగా అతను నీ ప్రయాణ దిశను సుల

భంగా గ్రహించగలను.

అందుకే, ప్రయాణం అంతమయ్యేవరకూ నీ కళ్ళు మూసుకో. ఏమీ చూడకు. మరేమీ ఊహించకు! ఆ ఆలోచన రాగానే సీటు వెనక తల ఆనించి, కళ్ళు మూసుకుంది శ్రీలత. లారీ శరవేగంతో దూసుకుపోతోంది రోడ్డుమీద.

'ఎక్కడికెళ్ళిపోయావు లతా?' తృళ్ళిపడి కళ్లు తెరిచి చూటూ కలయచూసింది.

డ్రైవర్ లారీ నడపడంలో పూర్తిగా నిమగ్నమై వున్నాడు. ఐనా, అతనికి తన పేరెలా తెలుసు? మరి ఎవరు పిలిచారు తనని? ఎవరు సంబోధించారు? మరు క్షణం అర్థమైపోయిందామెకు ఆ సంబోధన ఎవరిదో! జగన్నాథం!

కళ్ళల్లో అతను స్పష్టంగా కనిపిస్తున్నాడిప్పుడు. ఆ హోటల్లోని తన గది కిటికీ బైట నిల్చుని ఆ కిటికీ రెక్కలు మూయకుండా వదిలేసి, పెద్ద తప్పుచేసింది తను. కిటికీ ఎక్కి నెమ్మదిగా అంధకారం నిండిన ఆ గదిలోకి దిగుతున్నాడు జగన్నాథం! జేబులోంచి పెన్సిల్ టార్చితీసి, వెలిగించి, గది నాలుగు మూలలూ వేసి పరీక్షగా చూస్తున్నాడు. దాని వెలుగు ఖాళీ మంచం మీదికి ప్రసరించి ఆగిపోయింది.

'మన ఆలోచనా తరంగాల సంబంధం కొనసాగుతూనే వుంది లతా! వాటి ఫ్రీక్వెన్సీనించి తప్పించుకోడం నీవల్లా, నావల్లా ఇద్దరివల్లా సంభవం కానిపని. నేనెక్కడున్నానో నీకు తెలుస్తూనే వుంది. అలాగే ఇప్పుడు నువెక్కడున్నావో నేనూ గ్రహించగలను.

నానించి తప్పించుకుని నువ్వెక్కడికీ పోలేవు.

అదంత సులభమైన పనికాదు. శరవేగంతో ప్రయాణిస్తున్న ఏదో వాహనంలో కూర్చుని, దాని హెడ్ లైట్స్ కాంతిలో నువ్వు చూస్తున్న రోడ్డును నేను చాలా స్పష్టంగా అవగాహన చేసుకోగలుగుతున్నాను.

పోలీసులకు నా గురించి చెప్పి నువ్వు పెద్ద పొరపాటు చేశావు లతా! నీ గోతిని చేజేతులా నువ్వే తవ్వుకున్నావు. నా స్వంత విషయాల్లో అనవసరంగా జోక్యం చేసుకున్నావు. నువ్వు నా స్నేహితుడి చెల్లెలివి. మొదటినించీ నీపట్ల నాకు అభిమానం వుంది.

నా భార్యను ఏ పరిస్థితిలో చంపవలసి వచ్చిందో నీకు బాగా తెలిసివుండీ, నామీద జాలిపడటానికి బదులు నన్ను ఉరికంబం యెక్కించడానికి ప్రయత్నించావు. తప్పంతా నీదే! ఆ తప్పుకు తగ్గ శిక్ష ఇప్పుడు అనుభవించక తప్పదు. సులోచన మధుసూదన్ తో అక్రమ సంబంధం పెట్టుకుని ఏ తప్పైతే చేసిందో దానికి తగ్గ శిక్ష అనుభవించింది!'

ఉలిక్కిపడింది శ్రీలత. ఆ రోజు పార్కులో సులోచన వెంట తాను చూసిన వ్యక్తి పేరు మధుసూధనా? అతని పేరూ, వివరాలూ తెలిస్తే జగన్నాథ్ నేరాన్ని ఋజువు చెయ్యడానికి తగిన ఆధారాలు లభిస్తాయని చెప్పాడు ఇన్ స్పెక్టర్ యుగంధర రెడ్డి.

అప్పుడతని పేరు తనకు తెలీదు. ఇప్పుడు తెలిసింది. కానీ, ఏం లాభం? అలా ఆలోచిస్తున్నందుకు తనని తాను తిట్టుకుంది శ్రీలత. ఇంతవరకూ తన కా వ్యక్తి పేరు తెలుసేమో అనుకుంటున్నాడు జగన్నాథం! ఈ విధంగా తను చేసిన పొరపాటేమిటో అతని కర్థమైపోతుంది. దాంతో, తనని ప్రాణాలతో వదలడం చాలా ప్రమాద

మని భావిస్తాడు! చంపితీరతాడు!

'ఔను. ఇప్పుడు నిన్ను తుదముట్టించక తప్పదు లతా! వాడి పేరు నీకు తెలిసిపోయింది. పోలీసులకు చెబుతావ్! ఆ విధంగా వారు కోర్టులో నామీద హత్యాభియోగం మోపడం చాలా సులభమౌతుంది.'

'లేదు. నేనెవ్వరికీ చెప్పను. బుద్ధొచ్చింది. ఇక మీ వ్యక్తిగత విషయాల్లో కలగజేసుకోనని ప్రమాణ పూర్వకంగా చెబుతున్నాను' అనుకుంది శ్రీలత.

'సారీ, ఆయామ్ వెరీ సారీ! నాకు మనుషులమీద ముఖ్యంగా ఆడవారిమీద నమ్మకం పూర్తిగా పోయింది లతా....'

సడన్ బ్రేక్‌తో లారీ ఆగిన చప్పుడు విని, తిరువాన్కూర్ వచ్చేసిందా? అనుకుంటూ చటుక్కున రోడ్డు మీదికి చూసింది శ్రీలత. హెడ్ లైట్స్ వెలుగులో రోడ్డుపక్క పాతివున్న వెడల్పాటి మైలురాయి చూసి ఆశ్చర్యపోయింది.

తిరువాన్కూర్—35 మైళ్ళు.

మరి లారీ ఎందుకాగింది? అనుకుంటూ డ్రైవర్ వైపు చూసింది. గారపళ్ళికిలిస్తూ వెకిలిగా నవ్వుతున్నాడు. ఆ నవ్వు కర్థం ఏమిటో ఆడవారికి బాగా తెలుసు. గుండె ఝల్లుమంది శ్రీలతకు.

"ఎందుకాపావు లారీ?" అడిగింది ధైర్యం చిక్క బట్టుకుని.

"ఇంకెందుకు? బైట విరగాస్తున్న పండు వెన్నెల. పక్కన అందమైన పిల్ల. పైగా చలికాలం! వెచ్చదనం కావాలంటున్న శరీరం! రా ఇలా!" అంటూ ఆమె చెయ్యందుకోబోయాడు డ్రైవర్.

## 12

అప్పటికే డోర్ పిడి తిప్పేసింది శ్రీలత. రెప్ప పాటులో డోర్ తీసి బైటికి దూకేసింది!

"ఎక్కడికి పోతావ్? ఈ చిట్టడవిలో ఎవడు నిన్ను కాపాడేది? బెట్టు చెయ్యక!" అంటూ తనూ కిందికి దూకాడు డ్రైవర్.

గావు కేకలు పెడుతూ పొదలమధ్యపడి పరుగుతీసింది శ్రీలత. ఆమె అరుపులు అరణ్యరోదనలే అయ్యాయి. ఎన్నడూ అలా పరిగెత్తి ఎరగదు. ఆ మిట్టపల్లాల్లో, రాళ్ళు రప్పల్లో పరిగెత్తడం ఆమెకు సాధ్యపడటంలేదు. చీర అడ్డు తగిలి బోర్లా పడిపోయింది నేలమీద!

"చెప్పలా, బెట్టు చెయ్యొద్దని!" అంటూ సమీపించాడు డ్రైవర్.

అంతే! ఒక్క ఉదుటున లేచి నిల్చుంది రొప్పుతూ. చిఱుతలా లంఘించి ఆమెని చుట్టేశాడు డ్రైవర్. చీర పచ్చెళ్ళుపట్టి లాగుతున్నాడు. ప్రాణంకన్నా మూల్యమైనది. పోతే తిరిగిరానిది. కాసేపట్లో కోల్పోతుంది తను.

చివరి క్షణంలో తెగింపు వచ్చేస్తుంది ఏ ప్రాణికైనా! శక్తినంతా కూడదీసుకుని ఒక్క తోపు తోసింది వాణ్ణి. వెనక్కి తూలాడు. మెరుపులా నేలమీంచి రాళ్ళందుకుంది. మళ్ళీ మీదపడబోతున్న వాడికి గురిపెట్టి విసిరింది గట్టిగా.

"ఢవ్!"మన్న శబ్దంతో వాడి తలను గుద్దుకుంది రాయి. "అ.... మ్మో!" అంటూ నుదురు పట్టుకున్నాడు.

"చంపేస్తాను. పచ్చి నెత్తురు తాగుతాను. పారిపో! వెంటనే పారిపో ఇక్కణ్నించి" పిచ్చిగా అరుస్తూ మరో

రాయి విసిరింది.

వెనుదిరిగి పరుగులంకించాడు డ్రైవర్. వెనకనించి రాళ్ళ వర్షం ఆపలేదు లత. రెండు నిమిషాల తరవాత, రోడ్డుమీద స్టార్టయి వేగంగా వెళ్ళిపోతున్న లారీ శబ్దం వినిపించింది. తన నిస్సహాయ స్థితికి దుఃఖం కట్టలు తెంచుకుంది ఆమెలో.

వెక్కి వెక్కి ఏడుస్తూ జారిపోయిన చీర కట్టుకుని, కూలబడిపోయిందక్కడే. ఏం చెయ్యాలిప్పుడు? ఈ నిర్జన ప్రదేశంలో ఎలా గడపాలి? మర్నాటి సూర్యోదయాన్ని చూడగలదా తను? చెట్లమధ్యా, పుట్టలమధ్యా పడుంటం ప్రమాదం!

మాంసాహార మృగాలు రాత్రిపూటే సంచరిస్తుంటాయి అడవిలో. కీటకాలని వేటాడుతూ విష సర్పాలూ విహరిస్తుంటాయి పెద్ద సంఖ్యలో. ఇక రోడ్డే ఈ అరణ్యంలో తనకు శరణ్యం!

అక్కడ నిల్చుంటే, ఏ వైపునించైనా ఏదో ఒక వాహనం రాకపోదు. ఇప్పటి చేదు అనుభవం దృష్ట్యా ఇక లారీల జోలికి పోవద్దు. సంస్కారం వున్న చిన్న వాహనాల వార్ని సహాయం అర్థించాలి. అనుకుంటూ నెమ్మదిగా లేచి, పస్సిపోయిన అడుగులతో రోడ్డువైపు నడిచింది.

రోడ్డుమీదికి చేరిన ఐదునిమిషాల తరవాత దూరాన మద్రాసు వైపునించి ఏదో వాహనం వస్తున్నట్టు హెడ్ లైట్స్ కనిపించసాగాయి. ఆశగా అటే చూడసాగింది.

దగ్గరవుతున్న కొద్దీ హెడ్ లైట్స్ యెడాన్నిబట్టి అది చిన్న వాహనమే అని అంచనా వేసుకుంది శ్రీలత. రోడ్డు చేరువలో నిల్చుని చెయ్యి ఊపసాగింది.

వాహనం స్పీడ్ స్లో అయింది. నెమ్మదిగా వచ్చి ఆమె పక్కన ఆగింది.

అది జోంగా జీప్!

## 13

డ్రైవింగ్ సీట్లో కూర్చున్న జగన్నాధంని చూడగానే భయంతో గావుకేకలు పెడుతూ వెనుదిరిగి మళ్ళీ అరణ్యం లోకి పరుగుతీసింది లత! అంతక్రితం జరిగిన సంఘటనవల్ల అతని సంగతే మర్చిపోయింది తను. లారీ దిగుతూ తాను చూసిన మైలురాయిద్వారా, తన ఉనికిని ఇట్టే పసిగట్టి వుంటాడు.

పిల్లి పంజాలోంచి తప్పించుకుని, ఇప్పుడు పులి నోట్లో ఇరుక్కుంది! భగవంతుడా, ఇక నువ్వే నాకు దిక్కు. దేవుణ్ని తలుచుకుంటూ శక్తినంతా కళ్ళల్లో కూడ దీసుకుని ముళ్ళకంపల్ని ఎత్తుపల్లాలనీ లెక్కచెయ్యకుండా పరిగెత్తుతూంది శ్రీలత. వెనక జీపు నెమ్మదిగా రోడ్డుదిగి అడవివైపు వస్తున్న చప్పుడు.

అది జోంగా జీప్! ఎటువంటి అవరోధాలనైనా అవలీలగా దాటుకుంటూ ముందుకు సాగడం దాని ప్రత్యేకత! అదృష్టవశాత్తూ పైన పిండారబోసినట్టు వెలుగుతున్న వెన్నెల వెలుగులేకుంటే చిమ్మ చీకట్లో తన పరిస్థితి మరీ నికృష్టంగా వుండేది. చెట్ల ఆకుల్ని చీల్చుకుంటూ నేలను తాకుతున్న ఆ వెలుగులో చూసు కుంటూ ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని పరిగెత్తుతోంది శ్రీలత.

అప్పటికే చాలా దూరం చేరుకో గలిగింది. ఇప్పుడు చెట్ల గుబురు తగ్గి విశాలమైన స్థలం వచ్చేసింది. అప్పుడు కనిపించిందామెకు దూరాన ఏదో మెరుస్తూ! ఏమిటది?

ఏదైనా ఊరుందా అక్కడ? లేక, ఎవరైనా వేటగాళ్ళు టార్చి వేస్తున్నారా? కాలి చెప్పులు తెగి తూలిపడబోతూ నిలదొక్కుకుంది.

వెనక జీపు దగ్గరవుతున్న శబ్దం! చెప్పుల్ని దూరంగా విదిలించి, ఆ వెలుగు కనిపిస్తున్నవైపు దౌడుతీసింది. రాళ్ళూ, రప్పలూ తాకి వేళ్ళు చిట్లిపోతున్నాయి. పాదాలు ముళ్ళ ధాటిని తట్టుకోలేకపోతున్నాయి. ఆవేమీ లెక్క చెయ్యడంలేదు. ప్రాణ ప్రీతి అలాంటిది మరి!

ఫర్లాంగు దూరం వెళ్ళాక అర్థమైందామెకు ఆ వెలుగేమిటో! నిండుగా నది ప్రవహిస్తోందక్కడ! నింగిలో కాంతులీనుతున్న చంద్రబింబం ఆ నది నీటిలో ప్రతిఫలించి మెరుస్తోంది తళతళ! నిలువునా నీరు గారిపోయింది ఆమె ఆశ!

మరుక్షణం ఆమె ఆశను మళ్ళీ చిగురింపజేస్తూ కొద్ది దూరాన నదిపైన కనిపించింది వంతెన! ఔను. అది వంతెనే. దానిమీంచి సాధ్యమైనంత త్వరగా నది అవలి ఒడ్డుకు చేరుకోవాలి అనుకుంటూ అటు పరిగెత్తింది శ్రీలత.

ఆ వంతెన్ని సమీపించిందో లేదో, వెనక హెడ్ లైట్స్ వెలుగు సూటిగా పడింది ఆమెమీద. వచ్చేసింది జీపు. ఆలస్యంచేస్తే తన మరణం తథ్యం! భయంవల్ల కాళ్ళు వణుకుతూ అడుగులు తడబడుతున్నాయి. ఇప్పుడు చెట్లూ పుట్టలూ అడ్డులేవు గనుక శరవేగంతో వస్తోంది జీపు.

కొన ఊపిరిని కూడదీసుకుంటూ వంతెన్ని సమీపించి, దానిమీద అడుగువేసిందల్లా వాయువేగంలో వస్తున్న జీపుధాటికి భయపడి వంతెన పక్కనే వున్న పొదల్లోకి

దొర్లి పోయింది శ్రీలత.

అలా చెయ్యకపోతే, ఆ నాడు సులోచనను పట్టిన గతే ఆమెకూ పట్టేదే! ఆమె పొదల్లోకి దొర్లిన మరుక్షణం జీపు అదే వేగంతో వంతెనమీదికి దూసుకుపోయింది. అంతే! ఫెళ్ళుమన్న పెద్ద చప్పుడు వినేసరికి, ఆశ్చర్యంతో నేలమీంచి లేచి చూసింది లత.

నది మధ్య నీటిలో మునుగుతోంది జీపు!

వంతెనపై ప్రయాణిస్తున్న జీపు నది మధ్య యెలా పడిందా, అనుకుంటూ దిగ్భ్రాంతితో చేష్టలుడిగి అలాగే చూస్తూండిపోయింది శ్రీలత. ఆమె కళ్ళముందే పూర్తిగా మునిగిపోయింది జీపు నదిలో!

ఇప్పుడక్కడ బుడబుడ బుడగలు బైటికి వస్తున్నాయి నీటిలో! ఆశ్చర్యాన్నీ, కుతూహలాన్నీ అణచుకోలేక, అడుగులో అడుగు వేసుకుంటూ వంతెనపై ముందుకు సాగింది లత.

పది గజాలు వెళ్ళాక అర్థమైపోయిందామెకు అసలు సంగతి! యెప్పుడో, బ్రిటిష్ కాలంలోనో కట్టిన అతి పురాతన వంతెన అయుండాలది. వరదల తాకిడికి దాని మధ్య భాగం యెప్పుడో కూలిపోయినట్టుంది. తాను దూరంనించి దాన్ని చూసి, సంపూర్ణమైన వంతెనే అనుకుంది. మరుక్షణం ఆ ఆలోచన జగన్నాథానికి చేరిపోయింది.

తన భ్రమను అతను వాస్తవంగా భావించాడు. అందుకే అంత వేగంతో తనని ఢీకొట్టి చంపాలని వచ్చాడు. చివరికి తనే జలసమాధి అయి చచ్చాడు. అది పరిపూర్ణమైన వంతెన కాదని తాను ఏ మాత్రం గ్రహించినా అతను జీపు ఆపేసేవాడే!

ఏ తరంగాలు ఇంతవరకూ తనపాలిటి మృత్యువీచిక లయ్యాయో, అవే యిప్పుడు సంజీవినీ సరాగాలుగా సహకరించాయి తనకు. ఆ పీడకలనించి విముక్తిని కలిగించాయి. అంతా లీల! దైవలీల!!

తేలిగ్గా నిట్టూరుస్తూ, కాళ్ళకు తగిలిన గాయాలను మరుస్తూ మెయిన్ రోడ్డువైపు నడవసాగింది శ్రీలత. అప్పుడే తూరుపు దిక్కున తెలతెలవారసాగింది, ఇక ఆమె జీవితానికి ఏ భయమూ లేదని అభయమిస్తూ!

—: అయిపోయింది :—

# ఈ నాటి సావిత్రి

## టెంపోరావ్

నాగేశ్వరరావు టిఫిన్ తిని హాల్లోంచి బయటకు నడిచాడు.

వెనకనే వెళ్ళింది సావిత్రి. డ్రయివరు తోలు పెట్టెను, బ్రీఫ్ కేసును కారు డిక్కీలో పెట్టి మూశాడు. ప్లాస్టిక్ బుట్టను ముందు పెట్టాడు.

వరండాలో నిలబడి నాగేశ్వరరావు తన భార్యవంక నవ్వుతూ చూశాడు.

"నేను తిరిగిరావడానికి నాలుగైదు రోజులు అవుతుంది. జాగ్రత్తగా వుండు" అన్నాడతను.

సావిత్రి నవ్వింది, తీయగా, అమాయకంగా.

"మరేమీ ఫరవాలేదు. ఏ బెంగా లేకుండా మీరు వెళ్ళిరండి" అందామె.

అతడు కారు వెనక సీటుమీద కూర్చుని తలుపు మూశాడు. డ్రయివర్ స్టీరింగ్ వీల్ వెనక సర్దుకుని కూర్చున్నాడు.

నాగేశ్వరరావు భార్యవంక చిరునవ్వుతో చూశాడు. కారు గేటువైపు మెల్లిగా కదిలింది. చెయ్యి ఊపుతూ ఆమె భర్తకు బైబై చెప్పింది.

కాస్సేపట్లో గేటు దాటి, కుడివైపుకు తిరిగి కారు అదృశ్యమైంది.

సావిత్రి నెమ్మదిగా హాల్లోకి వెళ్ళి సోఫాలో కూర్చుంది. టైమ్ చూసింది. తొమ్మిది దాటింది.

తన జీవితాన్ని గురించి ఆమె సింహావలోకనం చేసుకుంటోంది. తన పెళ్ళయి ఆరేళ్ళు దాటింది. తలిదండ్రులకు తను ఒక్కగానొక్క కూతురు. తండ్రి పోయాక అతడు విజయవంతంగా నడుపుతున్న నిటింగ్ ఫాక్టరీ తన భర్త చేతుల్లోకి వచ్చింది. తన తల్లి పెళ్ళిముందే పోయింది. పెద్ద మేడ, ఫాక్టరీ, తన తండ్రి ఆస్తంతా భర్త వశమైంది. తన సంసారం సుఖంగా సాగుతోంది. తనకు ఏ లోటూ లేకుండా జీవితం సాగిపోతోంది. అంతకంటె స్త్రీకి ఏం కావాలి?

టెలిఫోన్ మ్రోగింది. సావిత్రి లేచివెళ్ళి రసీవర్ని అందుకుని, "హలో!" అంది.

"హలో, నాగేశ్వరరావుగారు వున్నారా?" ఒక స్త్రీ కంఠం అడిగింది.

"ఆయన కారులో బెంగుళూరు వెళ్ళారు."

"వెళ్ళి ఎంతసేపయింది?"

"ఇప్పుడే వెళ్ళారు" అంది సావిత్రి.

"థాంక్స్" అని అటువైపు స్త్రీ రిసీవర్ని పెట్టేసింది.

సావిత్రి రిసీవర్ని పెట్టేసి మళ్ళా సోఫాలో కూర్చుంది.

ఆమె ఎవరు? తన భర్త ఆమెకు ఎందుకు కావాలి? ఆమె పేరు తను అడిగి కనుక్కోవలసింది. అదంతా అడగనందుకు ఆమె లోలోపల విచారించింది.

వంటామె రావడంతో సావిత్రి టెలిఫోన్ చేసిన యువతి గురించి మర్చిపోయింది.

"అమ్మా, లంచ్‌కి ఏం చేయమంటారు?" అడిగింది వంటామె.

ఆమె నవ్వుతూ వంటామెవైపు చూసింది.

"ఇవాళ నా ఫ్రెండ్స్ భోజనానికి వస్తారు. మొత్తం నలుగురు వుంటారు. మైసూర్ పాక్ చేయండి. రెండు కూరలు, సాంబార్, అప్పడాలు అన్నీ చేయాలి" అందామె.

"అలాగేనమ్మా" అని వంటామె వినయంగా లోపలకు వెళ్ళిపోయింది.

మళ్ళా టెలిఫోన్ మ్రోగింది.

"హలో" అందామె.

"నేనే, జయంతి" అందో కంఠం అటువైపునించి.

"ఎప్పుడొస్తున్నావు?"

"నలుగురం కలిసి వస్తాం. గిరిజ, రమా, మనోరమ యిక్కడికొస్తానన్నారు."

"గుడ్, మరీ ఆలస్యం చేయకండి. మనం యెంతో మాట్లాడుకోవాలి" అందామె.

"అక్కడికి రావాలని మాకూ ఎంతగానో వుందిలే! తొందరగా వస్తాం" అంది జయంతి.

## 2

రోడ్డుమ్మట కారు వేగంగా కదుల్తోంది.

"రాజూ, హోటల్ నటరాజ్ ముందు కారు ఆపు!"

అన్నాడు నాగేశ్వరరావు.

"అలాగే సార్" అన్నాడు డ్రయివరు.

జేబులోంచి వందరూపాయిల నోటు తీసి అతను డ్రయివర్ కిచ్చాడు.

"నీకు కూతురు పుట్టిందని చెప్పావుగా, ఆ డబ్బుతో ఆమెకేదేనా కొను. మరో విషయం. హోటల్ నటరాజ్ ముందు ఒక యువతి యీ కారులో ఎక్కి, నాతో బెంగుళూరు వస్తుంది. ఆమెను గురించి అమ్మగారితో ఏమీ చెప్పకు!" అన్నాడతను.

"ప్రాణం పోయినా చెప్పను, సార్" అన్నాడు డ్రయివర్.

హోటల్ నటరాజ్ ముందు రోడ్డు వారగా కారు ఆగింది. పేవ్ మెంటుమీద నిలబడి వున్న ఒక యువతి హేండ్ బాగ్, ఏర్ బాగ్ పట్టుకుని కారువైపు వచ్చింది. నాగేశ్వరరావు తలుపు తెరిచి ఆమెను తన పక్కనే కూర్చోమన్నాడు.

ఏర్ బాగ్ ను డ్రయివర్ ముందు సీటుమీద పెట్టాడు. నవ్వుతూ ఆమె వెనుక సీటుమీద కూర్చుంది. నాగేశ్వర రావు తలుపు మూశాడు.

డ్రయివర్ కారును పోనిచ్చాడు.

నాగేశ్వరరావు పక్క కూర్చున్న ఆమెవంక ఆత్రంగా చూశాడు. మెల్లిగా ఆమె చెయ్యి పట్టుకున్నాడు. సిగ్గు పడ్తూ ఆమె అతడివైపు చూసింది.

అతడి కళ్ళు ఆమెమీద కేంద్రీకృత మయినాయి. ఆమె చాలా అందంగా వుంది. పొడుగ్గా, పచ్చగావుంది. పెద్ద కళ్ళు జోతుల్లా వెలుగుతున్నాయి. ఎర్రటి పెదిమలు. తీర్చిదిద్దిన ముక్కు. పొడుగాటి జడ.

ఆమె వయస్సు 26 పైన వుండొచ్చు. ఆమె ధరించిన దుస్తులు అంత ఖరీదైనవి కావు. కాని ఏ దుస్తుల్లోనైనా ఆమె అందంగానే వుంటుంది.

"భామా, నీ కేసి చూస్తూ యిలా యెన్ని సంవత్స రాలైనా వుండిపోగలను!"

"థాంక్ గాడ్ యుగాలు అనలేదు!" అందామె.

కారు స్పీడుగా దూసుకుపోతోంది. ట్రంక్ రోడ్డుకి యిటూ అటూ చింతచెట్లు వున్నాయి.

"నిన్ను నాతో బెంగుళూరు ఎందుకు రమ్మన్నానో తెలుసా?"

"తెలియదు."

"అక్కడ చక్కటి హోటల్లో మనం వుండొచ్చు. కావలసినంత ప్రయివసీ."

"మనకు ప్రయివసీ ఎందుకు?" అందామె ఓరగా అతడివైపు చూస్తూ.

అతడామె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"భామా, నువ్వు బి.ఎ. పాసయ్యావు. కాని నీ మెదడు యింకా పెరగలేదు."

గంట ప్రయాణంచేసి ఒక చెట్టుకింద కారు ఆగింది. డ్రయివర్ దూరంగా వెళ్ళిపోయాడు. ప్లాస్టిక్ బుట్ట వున్న కేరియర్ని పైకితీసి అతడు తెర్చాడు. ఇడ్లీలను రెండు ప్లేటల్లో పెట్టి, చట్నీవేసి ఆమెకో ప్లేటు యిచ్చాడు. మరో ప్లేటు తను తీసుకున్నాడు.

"లెటస్ యీట్! నీలాటి అందమైన యువతి పక్క నున్నప్పుడు నాకు చాలా ఆకలిగా వుంటుంది" అన్నా డతను.

"ఇడ్లీ చాలా బాగుంది. మీ భార్య చాలా బాగా

చేసారు" అందామె.

"ఈ యిడ్లీలో ఏదేనా రుచివుంటే అందుకు క్రెడిట్ మా వంటామె కివ్వాలి, నా భార్యకు కాదు. మా వంటామె పదార్థాలన్నీ చాలా బాగా చేస్తుంది" అన్నాడతను.

దూరంలో చింతచెట్టుకింద నిలబడిన డ్రయివర్ వైపు ఆమె చూసింది.

"పాపం, డ్రయివర్ని మనం మర్చిపోయాం."

"ఆ మాట అన్నందుకు అతడు చాలా సంతోషిస్తాడు" అని అతడు హారన్ నొక్కాడు.

డ్రయివర్ పరిగెత్తుకొచ్చాడు. అరిటాకులో ఇడ్లీ వేసిచ్చి, నాగేశ్వరరావు అతడివైపు నవ్వుతూ చూశాడు.

"మొహమాట పడకు! కావలసినన్ని ఇడ్లీ లున్నాయి. తర్వాత హాట్ కాఫీ!"

"అలాగే సార్" అని డ్రయివర్ దూరంగా కదిలాడు.

తర్వాత యిద్దరూ హాట్ కాఫీ తాగారు. అతడు గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ ఆమె వైపు చూశాడు.

"భామా, ఐ లవ్ యు!"

ఆమె వ్యంగ్యంగా నవ్వింది.

"ఎందుకలా నవ్వుతున్నావు?" అడిగాడతను.

"మీకు భార్య వుంది. ఫలించదని తెలిసినా మీరు నన్ను ప్రేమిస్తున్నారు. నేనలా ప్రేమించలేను" అందామె.

అతడామె చెయ్యి పట్టుకున్నాడు. మెల్లిగా నిమిరాడు.

"భామా నిన్ను నేను పెళ్ళాడతాను. మన ప్రేమకు

నా భార్య అడ్డురాదు, రానివ్వను" అన్నాడతను వుద్రే కంతో.

"భార్య వుండగా మళ్ళీ పెళ్ళా?"

"భామా, నా భార్యకు విడాకులు యిచ్చేస్తాను. అటుపైన నిన్ను పెళ్ళాడ్తాను."

"అదంతా జరిగాక చూద్దాం" అందామె.

"నా గురించి నీకింకా బాగా తెలియదు. నేను చెయ్యదల్చినది చేస్తాను."

"మంచిది" అందామె క్లుప్తంగా.

## 3

హోటల్ గదిలోని సోఫాలో కూర్చుని అతడు విస్కీ సేవిస్తున్నాడు. ఆమె మంచంమీద పడుకుని ఆలోచిస్తోంది.

లారీ ఆఫీసులో గుమస్తాగా పనిచేసి ఆమె తండ్రి రిటైరయ్యాడు. సమీపంలో వున్న సేట్ జీ బట్టల షాపులో గుమస్తాగా చేరాడు. నలుగురు కుమార్తెలకు అతను పెళ్ళిళ్ళు చేశాడు. కాని సత్యభామ పెళ్ళిచేయ డానికి అతడి దగ్గర డబ్బులేదు. ఆమె కాలేజీలో చేరి బి.ఎ. పాసయింది.

తండ్రికొచ్చే జీతం యింటికి చాలదని గ్రహించి ఆమె నాగేశ్వరరావు నిటింగ్ ఫాక్టరీలో అసిస్టెంట్ గా చేరింది.

మొదటిసారి ఆమెను చూసినప్పుడు ఆమె అందం అతడిని విశేషంగా ఆకర్షించింది. అది ఆమె గ్రహిం చింది. పేదరికంలో పెరిగిన ఆమెకు అతడొక పెన్నిధిలా అగుపించాడు. అతడికి పెళ్ళయిందని ఆమెకు తెలుసు కాని అతడిని తన చేతిలో వుంచుకుంటే ఏదో విధంగా

లాభిస్తుందని భావించి ఆమె అతడిని హద్దుల్లో ప్రోత్స హించేది.

గ్లాసులోని విస్కీని నాగేశ్వరరావు పూర్తిగా తాగేసి ఆమెవైపు చూశాడు. పరుపుమీద ఆమె బంగారం బొమ్మలా పడుకుని వుంది.

ఆ రోజల్లా వాళ్ళిద్దరూ కారులో అనేకచోట్లకు తిరిగారు. అతడామెకు రెండు మైసూర్ సిల్కు చీరలు కొన్నాడు. ఖరీదైన నగలు కొనిచ్చాడు.

సోఫాలోంచి లేచి అతడు ఆమె మంచంవైపు వెళ్ళాడు. పక్కనే కూర్చుని ఆమె పాదంమీద చెయ్యి వేశాడు. చిన్నపాదం! బంగారం ముద్దలా వుంది.

కళ్ళు తెర్చి ఆమె అతడివంక చూసింది. తీయగా నవ్వింది.

"భామా పదవుతోంది. డిన్నర్ గదికి తెప్పించనా?" ప్రశ్నించాడతను.

"నాకు ఆకలిగాలేదు. రోజల్లా తింటూనే వున్నాం."

"కొంచెం తిను" అన్నాడతను.

కనికిపాట్లు పడూ ఆమె ఆవులించింది.

"నిద్ర వస్తోంది. తొందరగా తెమ్మనండి. పడుకో వాలి!" అందామె.

అతడు ఫోన్లో మాట్లాడి, డిన్నర్ గదికి పంప మన్నాడు. నవ్వుతూ వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. గ్లాసులో విస్కీపోసి సోడా కలిపాడు. డిన్నర్ముందు మరో పెగ్ సేవించాలి!

కొంచెం విస్కీ తాగి అతడు ఆమెవైపు చూశాడు.

"భామా, యిలా వచ్చి కూర్చో! డిన్నర్ వస్తోంది" అన్నాడతను.

ఆమె లేచింది. వయ్యారంగా నడిచి సోఫాలో అతడి పక్కనే కూర్చుంది.

ఎడంవైపుకు వంగి అతడామె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"విస్కీ వాసన!" అందామె.

గ్లాసును టీపాయిమీద వుంచి అతడామెను బలంగా కౌగలించుకున్నాడు. మళ్ళా ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

అమాంతంగా ఆమె సోఫాలోంచి లేచింది.

"మీ దగ్గర కూర్చోడానికి భయంగా వుంది" అందామె నవ్వుతూ.

అతడామెవైపు ఆత్రంగా చూశాడు.

"భామా, ఐ లవ్ యూ" అన్నాడతను.

ఎవరో తలుపు తట్టారు. ఆమె వెళ్ళి తలుపు తెర్చింది. హోటల్ బాయ్ పెద్ద ట్రేతో లోపలకు వచ్చాడు. ట్రేని టీపాయ్‌మీద వుంచి వాళ్ళవైపు చూశాడు.

"రేపు పొద్దుట ప్లేట్లు పట్టుకెళ్ళొచ్చు. రాత్రి రావద్దు" అన్నాడు నాగేశ్వరరావు.

"అలాగే, సార్" అని బాయ్ వెళ్ళిపోయాడు.

సత్యభామ తలుపుమూసి లాక్ చేసింది. ఉషారుగా నడిచి అతడి కెదురుగా వున్న సోఫాలో కూర్చుంది.

"లెటస్ స్టార్ట్ యీటింగ్" అందామె.

"నువ్వు తిను. నేను డ్రింక్ అయ్యాక తింటాను" అన్నాడతను.

ఇద్దరు డిన్నర్ ముగించారు. ఆమె పరుపుమీద పడుకుంది. జీరోవాట్ బల్బ్ గదిలో డిమ్‌గా వెలుగుతోంది.

అతడు మెల్లిగా ఆమె పక్కన పడుకున్నాడు.

నిమిషాలు గడుస్తున్నాయి. ఆమెమీద అతను చెయ్యి వేశాడు.

"భామా, యిటు తిరుగు!"

ఆమె అతడివైపు తిరిగింది. ఆమె గడ్డాన్ని వేళ్ళతో నిమిరాడతను.

ఆమె తీయగా నవ్వింది. ఎర్రటి ఆమె పెదిమలను అతడు ముద్దెట్టుకున్నాడు.

"ప్లీస్, చాలు, నన్ను పడుకోనివ్వండి!" అందామె.

అతడు పరిహాసంగా నవ్వాడు.

"భామా, నిద్రపోడానికి యింత దూరం రావాలా?"

"మరేం చేయడానికి రావాలి?" అడిగిందామె.

"భామా, నన్ను నమ్ము. నీకు నేను ద్రోహం చెయ్యను. దైవర్సుకు అప్లయిచేసి, అది వచ్చాక నిన్ను నేను పెళ్ళాడ్తాను. ఏదీ తెలియని వయసులో నా పెళ్ళి జరిగి పోయింది. నిన్ను చూశాక ప్రేమ నా హృదయంలో జ్యోతిలా వెలగడం మొదలెట్టింది. నువ్వు లేకుండా నేను బతకలేను."

"నేను ఎక్కడికీ పోను. నా యింట్లోనే వుంటాను. మీ ఫాక్టరీలో పనిచేస్తూనే వుంటాను" అందామె అతడి మెడను నిమురుతూ.

"భామా, నీ జీవితాంతం ఏమవుతుందో అని నువ్వు భయపడవలసిన అవుసరంలేదు. నీకు ఏ ఆపదా రాకుండా నేను చూస్తాను."

అతడు ఆమెమీద వాలాడు. ఆమెను బలంగా ముద్దెట్టుకున్నాడు. అమాంతంగా ఆమె లేచి కూర్చుంది.

"చూడండి, మీ ప్రేమను చూసి నేను చాలా ఆనందిస్తున్నాను. కాని పెళ్ళిముందు కోర్కెలను తీర్చుకోడం

నాకు నచ్చదు. నన్ను బలాత్కరించడానికి ప్రయత్నించక కండి. అలా మీరు చేస్తే ఈ గదిలోంచి నేను బయటకు పోతాను" అందామె.

అతడామె చెయ్యిని ఆప్యాయంగా పట్టుకున్నాడు.

"భామా, ప్రేమించిన యువతిని బలాత్కరించడమా? అలా అనకు. నేను భరించలేను."

"నా తలిదండ్రులు వృద్ధులయిపోయారు. నేనంటే వాళ్ళకెంతో ప్రేమ. నాకేదేనా అయితే వాళ్ళిద్దరూ ఏ నూతిలోనో పడి చస్తారు. అందువలన మనం జాగ్రత్త పడ్డం మంచిది. మీకోసం నేను ఎంతకాలమైనా వేచి వుండగలను. మీరు అన్నట్లు డైవర్సు వచ్చాక మనం పెళ్ళిచేసుకుందాం. అంతవరకూ మీ కోర్కెలను అదుపులో వుంచుకోండి" అందామె.

"భామా, నువ్వు చెప్పినట్లే చేద్దాం. తొందరపడి నందుకు నన్ను క్షమించు" అన్నాడు నాగేశ్వరరావు.

## 4

సావిత్రి పడగ్గదిలోకి వెళ్ళి బీరువా తెర్చి చూసింది. యాభై రూపాయిల నోట్లు వున్నాయి. తనకు ఐదు రూపాయిలు కావాలి!

పడగ్గదిలో భర్త లేడు. బాత్‌రూమ్‌లో అతను వుండి వుండాలి. కోటు లోపల జేబులో వున్న పర్సును ఆమె తీసింది.

పర్సును చూస్తూ ఆమె క్షణకాలం అలాగే వుండి పోయింది. పర్సులో పెట్టిన ఒక యువతి ఫోటో నవ్వుతూ ఆమెవైపు చూస్తోంది. ఫోటోకింద "విత్ లవ్, సత్య భామ" అని రాసివుంది. ఎవరీ సత్యభామ? ఆమె ఫోటో తన భర్త పర్సులో ఎందుకుంది?

పర్సులోంచి ఐదురూపాయిల నోటు తీసుకుని ఆమె బయటకు వెళ్ళిపోయింది. కాస్సేపట్లో గదిలోకి తిరిగి వచ్చింది.

భర్త దుస్తులు ధరిస్తున్నాడు. ఆమెవైపు అతడు నవ్వుతూ చూశాడు.

"మీ పర్సులోంచి ఐదురూపాయిలనోటు తీసుకుని నౌఖరుకిచ్చాను" అందామె.

"నాతో చెప్పడం దేనికి?" అని అతడు ఆమెకంక సూటిగా చూశాడు.

"సావిత్రీ, పర్సులో వున్న యువతి ఫోటో చూశావా?" ప్రశ్నించాడతను.

"చూశాను" అందామె.

"ఆమె ఎలా వుంది?"

"చాలా అందంగా వుంది. ఎవరామె?"

అతడు నవ్వుతూ ఆమె దగ్గరకు జరిగాడు.

"ఆమెను పెళ్ళిచేసుకోవచ్చంటావా?"

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"నా మిత్రుడు కేశవ్ ఆ ఫోటో నాకు పంపాడు. ఆ అమ్మాయిని అతడు పెళ్ళాడబోతున్నాడట."

"తప్పక చేసుకోమనండి. పిల్ల బాగుంది."

"అతడికి రాస్తాను."

అతడివైపు చూస్తూ ఆమె భుజంమీద చెయ్యివేసింది.

"ఆ ఫోటో మీ పర్సులో వుండడం నాకిష్టంలేదు!" అందామె.

"ఇవాళ కేశవ్‌కి పంపించేస్తాను" అన్నాడతను నవ్వుతూ.

భర్త అలా అన్నా ఆమెలో తలెత్తిన అనుమానం

పూర్తిగా తొలగిపోలేదు. కేశవ్ ఎవరు?

"మీ మిత్రుడు కేశవ్ ఎక్కడుంటున్నాడు?"

"మద్రాసులోనే. ప్రియా రబ్బర్ ఫాక్టరీలో పని చేస్తున్నాడు. పెళ్ళికి మనం వెళ్ళాలి" అన్నాడతను.

"ఎప్పుడు పెళ్ళి?"

"ఇప్పుడే కాదులే. అతడి చెల్లెల్కి పెళ్ళయినాక అతడు పెళ్ళి చేసుకుంటానన్నాడు."

"మీ మిత్రుడు గొప్ప హృదయం కలవాడు. ఆమె పెళ్ళి త్వరగా అవాలని దేవుడికి ప్రార్థించుదాం" అందామె.

## 5

నాగేశ్వరరావు తన రొటేటింగ్ కుర్చీలో కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

తన పెళ్ళయి ఆరేళ్ళు దాటింది. తన భార్య సావిత్రి ఎక్కువగా మాట్లాడదు. నిండు కుండలా తొణకదు. ఆమె మెదడులో ఏ ఆలోచనలు సాగుతున్నాయో కనుక్కోడం కష్టం.

తను అనుభవించే ఆస్తంతా యిప్పుడు ఆమె పేరనే వుంది. ఆమె ఏ మాత్రం అనుమానించినా తనకు యెదురు తిరగొచ్చు!

ఫోన్ చేసి అతడు సత్యభామను తన గదికి రమ్మన్నాడు.

నవ్వుతూ ఆమె అతడి ఏర్ కండిషండ్ గదిలోకి వచ్చింది. ఖరీదు తక్కువయినా ఆమె ధరించిన కాటన్ చీర, జాకెట్టు యింపుగా వున్నాయి. చెవులకు దుద్దులు, మెళ్లో సన్నటి గొలుసు మాత్రం వున్నాయి.

ఆమె అతడి టేబుల్ పక్కనే నిలబడింది.

"భామా!" పిల్చాడతను.

ఆమె నవ్వింది.

"ఇలా నా ఒళ్ళో కూర్చో!"

"అదంతా యిప్పుడు వద్దని చెప్పానుగా!"

"కూర్చుంటే ఏమైపోతుంది? ఎప్పుడో అప్పుడు నువ్వు ఎలాగైనా నాకు లొంగవలసిందే."

"ఆ సమయం వచ్చాక చూద్దాం."

"భామా, దైవర్సు కేసు పూర్తవడానికి కొంత టైము పడుతుంది. రాత్రి ఆలోచించి నేను ఒక నిశ్చయానికి వచ్చాను."

"ఏమిటో చెప్పండి."

"మనిద్దరం రహస్యంగా దేవాలయంలో పెళ్ళిచేసుకుందాం. నీకోసం ప్రత్యేకంగా నేనొక యిల్లు తీసుకుంటాను. మనం సుఖంగా జీవించవచ్చు!"

"భార్య వుండగా మీరు నన్ను పెళ్ళాడ్డం ఇల్లీగల్! అటువంటి చర్యలు నాకు నచ్చవు."

అతడామె చెయ్యి పట్టుకుని తనవైపు లాగాడు. అతడి మీదపడి ఆమె లేచి పక్కకు కదిలింది.

"ఎవరేనా గదిలోకొస్తే చూస్తారు. వాగుతారు. యిక్కడ పనిచేసేవాళ్ళు మనల్ని గురించి మాట్లాడ్డం నాకిష్టంలేదు."

"నేను రమ్మంటేగాని యీ గదిలోకి యెవ్వరూ రారు!" అన్నాడతను.

"అకౌంటెంట్ యెన్నిసార్లో లోపలకు రావడం నేను చూశాను."

"అతనా, ఓల్డు ఫెలో! అతను ఏదేనా చూసినా ఎక్కడా వాగడు. అరవై ఏళ్ళు దాటినా నేను అతడిని

ఉద్యోగంలో వుండనిచ్చాను."

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది.

"బెంగుళూరులో మనకెంతో ప్రయివసీ వుంది. కాని అక్కడ ఏం చేయగలిగాం? మనం వాదించి లాభంలేదు. మొదట మీరు మీ యిల్లు సర్దుకోండి. రావలసిన సమయంలో మీ భార్యగా నేను అక్కడికొస్తాను" అందామె.

అతడివైపు తిరిగి చూడకుండా ఆమె బయటకి వెళ్ళిపోయింది.

ఆమెవైపే చూస్తూ అతడు వుండిపోయాడు. ఆమెను చూస్తూంటే అతిడిలోని వాంఛ పెరుగుతోంది.

స్ప్రింగ్ తలుపు మూసుకుపోయింది—అతడు సిగరెట్ వెలిగించి, పొగవదుల్తూ కుర్చీలో వెనక్కి వాలాడు.

ఏదో ఆలోచనతర్వాత టేబుల్ మీదున్న పెర్సనల్ ఫోన్ రిసీవర్ ఎత్తి అతడు ఒక నంబరు తిప్పాడు.

"హలో!" అదొక స్త్రీ కంఠం.

"సావిత్రీ, ఇప్పుడే కాశ్మీర్ ఏజంటు వచ్చి వెళ్ళాడు. మన్ని కాశ్మీర్ రమ్మన్నాడు. పదిహేను రోజులపాటు స్వర్గంలో వుంటాం. వెళ్దామా?"

"ఇప్పుడెందుకంత దూరం? అక్కడ ఏవో అల్లరు జరుగుతున్నాయని పేపర్లో చూశాను" అందామె.

"అల్లరు ఎప్పుడూ వుంటాయి, సావిత్రీ! మనం వుండే హోటల్లో మన అల్లరే వుంటుంది."

"ఇంటికొచ్చాక మాట్లాడుదాం."

"నువ్వు వస్తానంటే కాశ్మీర్ ఏజంటుతో చెప్పి మనకు కావలసినవన్నీ అరేంజి చేయమంటాను."

"ఆల్ రైట్, వెళ్దాం."

"చాలా సంతోషం. ఈ ఫాక్టరీ పనులతో నీకు

నా అటెన్షన్ యివ్వలేకపోతున్నాను. కాశ్మీర్‌లో పదిహేనురోజులు మనం హాయిగా గడపొచ్చు. వుంటాను" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

# 6

కారును తనే స్వయంగా నడుపుతూ నాగేశ్వరరావు ఎక్కడికో వెళ్ళాడు.

సావిత్రి వరండామీదకు వెళ్ళి రాజును పిల్చింది. డ్రయివరు రాజు వినయంగా దగ్గరకొచ్చాడు.

"రాజూ, మేడమీదకురా! నీతో మాట్లాడాలి" అందామె.

"అలాగేనమ్మా."

ఆమె పైకి వెళ్ళిపోయింది. మేడమీద ముందు వరండాలో సోఫాలో ఆమె కూర్చుంది. రాజు వచ్చి సమీపంలో నిలబడ్డాడు.

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది.

"రాజూ నాకు కొంత సమాచారం కావాలి."

"నేనేం చెప్పగలనమ్మా!"

"నువ్వు అయ్యగారికూడా వుంటూ వుంటావు. జరిగేదంతా చూస్తూ వుంటావు. సత్యభామ ఎవరు?"

"నాకు తెలీదమ్మా. ఆ పేరు నేనెప్పుడూ వినలేదు."

హేండ్ బాగ్ తెర్చి రెండువందల రూపాయిల నోట్లు తీసి ఆమె అతడికిచ్చింది.

"రాజూ, ఇంకా నీకిస్తాను. సత్యభామ ఎవరో చెప్పగలవా?"

"నేను చెప్పానని తెలిస్తే అయ్యగారు నన్ను పొమ్మంటారు."

అతడివైపు ఆమె నవ్వుతూ చూసింది.

"నువ్వు చెప్పినట్లు నేను చెప్పను. నన్ను నమ్ము. ఈ ఆస్తంతా నాది, అయ్యగారిది కాదు. ఆయన నిన్ను పొమ్మంటే నేను నీకు ఉద్యోగం యిస్తాను" అందామె.

"సత్యభామ అనే అమ్మాయి ఫాక్టరీలో పని చేస్తోందమ్మా. అయ్యగారు ఆమెతో కారులో బెంగుళూరు కూడా వెళ్ళారు" అన్నాడతను.

"వాళ్ళు బెంగుళూరులో ఎక్కడున్నారు?"

"ఫెయిరీలాండ్ హోటల్లో, రూమ్ నంబరు 20."

"ఆమెతో ఆయన యింకా ఎక్కడెక్కడికెళ్ళారు?"

"మైసూరు వెళ్ళారు. బెంగుళూరులో ఆమెకు నగలు, చీరలు కొని యిచ్చారు."

"వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటున్నారంటావా?"

"అది నేను చెప్పలేనమ్మా. ఆమె బీదపిల్లలా నాకు కనిపించింది. డబ్బుకోసం ఆయన వెంటబడి వుండాలి. అయ్యగారికి ఆమె అంటే మహా మోజమ్మా" అన్నాడతను.

"ఆమె అందంగా వుంటుందా?"

"చాలా అందంగా వుంటుందమ్మా."

కాసేపు ఆమె ఆలోచిస్తూ వుండిపోయింది. తన కళ్ళు కప్పడానికి సత్యభామని తన మిత్రుడు కేశవ్ పెళ్ళాడబోతున్నాడని భర్త ఆమెతో చెప్పాడు. కేశవ్ అనే మిత్రుడు తన భర్తకున్నాడా?

"రాజా, అయ్యగారి మిత్రుడు కేశవ్ నీకు తెలుసా?"

అతడు మౌనంగా వుండిపోయాడు.

"ఆ పేరుతో ఎవరూ లేరమ్మా."

"ప్రియా రబ్బరు ఫాక్టరీలో పనిచేస్తున్నాడట."

"ఆయన పేరు రామ్మూర్తిగారమ్మా. ఆయన ఇంట్లో పెళ్ళికావలసిన చెల్లెలు కూడా వుంది" అన్నాడు డ్రయివర్.

అబద్దాలాడేటప్పుడు మనకు తెలియకుండానే కొంత నిజం బయటకు దొర్లుతూ వుంటుంది, అనుకుంది సావిత్రి లోలోపల.

మరో రెండువందరూపాయిల నోట్లు తీసి ఆమె డ్రయివర్ చేతిలో పెట్టింది.

"రాజూ, ఇవాళనుంచి నువ్వు అయ్యగార్ని, సత్యభామనూ రహస్యంగా గమనిస్తూ వుండు. అయ్యగారితో ఆమెకు సంబంధం వుందా, లేక ఆమె వూరికే తిరుగుతోందా? అంతా తెల్సుకుని నాకు చెప్పాలి. సత్యభామ ఎక్కడ వుంటుందో? ఆమె యింట్లో ఎవరెవరున్నారు, అన్నీ నాకు కావాలి."

"తెల్సుకుని చెప్తానమ్మా."

"నీ సేవకు పారితోషికం యిస్తూనే వుంటాను" అందామె.

"మీ చెయ్యి పెద్దదమ్మా, నాకు తెలియనిదా!" అని డ్రయివర్ రాజు వెళ్ళిపోయాడు.

గోరంత అనుమానం యిప్పుడు కొండంత రూపం దాల్చింది. సావిత్రి ఆలోచిస్తూ కూర్చుంది.

భర్త తనను కాశ్మీర్ రమ్మనడం విచిత్రంగా వుంది. సత్యభామకు బదులు తనని భర్త కాశ్మీర్‌కు ఎందుకు తీసుకెళ్ళాలనుకుంటున్నాడు? తను జాగ్రత్తపడాలి! ఆలోచిస్తూ ఆమె సోఫాలోంచి లేచి లోపలకు వెళ్ళింది.

## 7

విమానంలో నాగేశ్వరరావు, సావిత్రి ఢిల్లీ వెళ్లారు. అక్కడనుంచి విమానంలో శ్రీనగర్ చేరుకున్నారు.

రవూఫ్ అబ్దుల్లా వాళ్ళకు స్వాగతం యిచ్చాడు. నాగేశ్వరరావు నవ్వుతూ తన భార్యను అతడికి పరిచయం చేశాడు.

"అబ్దుల్లా మన ఏజంటు. మనం తయారుచేసే బనియన్లు, టీ షర్టులు వగైరా యిక్కడ పంపిణీ చేస్తాడు" అన్నాడతను సావిత్రితో.

ఆమె నవ్వుతూ అబ్దుల్లాకు నమస్కరించింది. ముగ్గురూ కారులో కూర్చున్నారు. డ్రయివర్ కారును పోనిచ్చాడు.

ఒబరాయి హోటల్‌కి వాళ్ళు చేరుకున్నారు. వాళ్ళకు రిజర్వు చేసిన 50 నంబరు గది చాలా బాగుంది.

సావిత్రి బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది. నాగేశ్వరరావు అబ్దుల్లావైపు నవ్వుతూ చూశాడు.

"గత ఐదేళ్ళగా మీ డిస్ట్రిబ్యూషన్ ఒకేలావుంది. మీరు పాటుపడి అమ్మకాన్ని పెంచాలి" అన్నాడతను.

"హోజైరీలో కాంపిటీషన్ ఎక్కువగా వుంది. తిరువూర్‌నుంచి అనేక కంపెనీల సరుకు మార్కెట్‌లో చాలా చౌకగా అమ్మేస్తున్నారు" అన్నాడు అబ్దుల్లా.

"తతిమ్మాచోట్ల మా సేల్సు యెక్కువయినాయి. కాశ్మీర్‌లో మాత్రం పెరగకుండా వున్నాయి" అన్నాడు నాగేశ్వరరావు.

"మీరు వర్రీ అవకండి. ఎక్కువగా అమ్మితే మాకూ లాభిస్తుందిగా. అమ్మడానికి ప్రయత్నిస్తాం."

"గుడ్. మేం యిక్కడ వున్నంతకాలం మాకొక కారు కావాలి."

"రావు సాబ్, మనం యిక్కడికొచ్చిన ఫియట్ కారు మీరు వుంచుకోండి. డ్రయివర్ చాలా అనుభవం కలవాడు."

"థాంక్స్" అన్నాడు నాగేశ్వరరావు.

సావిత్రి వచ్చి సోఫాలో కూర్చుంది. ఆమె భర్త బాత్ రూమ్‌లోకి వెళ్ళి తలుపు మూసుకున్నాడు.

"మిస్టర్ అబ్దుల్లా, కాశ్మీర్ నిజంగా స్వర్గంలాగే వుంది. ఈమధ్య మీరు మద్రాసు వచ్చారుగా...."

"నేను రాలేదు" అన్నాడతను అడ్డొస్తూ.

"మీ కంపెనీనుంచి మరెవరైనా వచ్చారేమో!"

"నేను ఎవర్నీ మద్రాస్ పంపలేదు!"

"నేను పొరబడి వుంటాను" అందామె, బాత్ రూమ్ తలుపు తెరవడం గమనిస్తూ.

"కాశ్మీర్ రావడానికి యిది సరైన సమయం" అన్నాడు అబ్దుల్లా.

"అందుకే వచ్చాం. మాకు తెలిసిన మీలాంటి మిత్రులు యిక్కడ వుండడం మా అదృష్టం" అందామె.

"అన్నీ చూపించడానికి కావలిస్తే ఒక మనిషిని నేను మీతో పంపగలను" అన్నాడతను.

"డోంట్ బాదర్! నేనింతకుముందు కాశ్మీర్‌కు చాలాసార్లు వచ్చాను" అన్నాడు నాగేశ్వరరావు.

అబ్దుల్లా సోఫాలోంచి లేచాడు. వాళ్ళిద్దరివైపూ చూశాడు.

"ఏదేనా కావలిస్తే నాకు టెలిఫోన్ చేయండి" అని చెప్పి అతడు వెళ్ళిపోయాడు.

నాగేశ్వరరావు అతడితో బయటకు వెళ్ళాడు. సావిత్రి ఆలోచిస్తూ తెర్చి వున్న గుమ్మంవైపు నడిచింది.

తన భర్త తనతో అబద్ధం చెప్పాడు. కాశ్మీర్ ఏజంటు మద్రాసు వచ్చాడన్నాడు. అదంతా కల్పితం. తన భర్త తనని యింతదూరం ఎందుకు తీసుకొచ్చాడు?

ఆమె ఆలోచిస్తూ నడవమ్మట చూసింది. ఒకతను వేగంగా నడిచివస్తున్నాడు. ఆమె ముందునుంచి అతను మెల్లిగా కదిలాడు.

ఆమెను చూసి అతడు క్షణకాలం ఆగాడు. "ఫైన్ కాశ్మీర్!" అని అతడు వెళ్ళిపోయాడు.

పక్కగది తాళంతీసి లోపలకు వెళ్ళాడు. తనలో తను నవ్వుకుంటూ ఆమె గదిలోకి వచ్చేసింది.

బాత్‌రూంలోకి వెళ్ళి మొహం కడుక్కుంది. మొహాన్ని తుడుచుకుని సోఫాలో కూర్చుంది. గదిలో ఫాన్ తిరుగుతోంది. ఆమె మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. సత్యభామ కూడా తనకు తెలయకుండా కాశ్మీర్ వచ్చిందేమో! ఆమె మరో హోటల్లో వుంటోందేమో!

"హలో, డార్లింగ్ అలా తిరిగొద్దాం పద!" అన్నాడు నాగేశ్వరరావు.

# 8

ఎనిమిదింటికల్లా అతడు హుషారుగా ఆమెను లేపాడు. "సావిత్రీ, లే వెళ్ళాలి" అన్నాడతను.

"ఎక్కడకు?" అందామె.

"పదికిలోమీటర్ల దూరంలో ఏదో సరస్సు వుందిట."

"డాల్ లేక్కా?"

"కాదు. ఈ లేక్‌లో మనం స్నానం చేయొచ్చు. హాయిగా వుంటుంది."

కాస్సేపట్లో యిద్దరూ తయారయ్యారు. తలుపుమూసి

లాక్ చేశారు. ఏర్ బాగ్ అతడి చేతిలో వుంది.

నడవమ్మట యిద్దరూ నడిచి వెళ్ళారు. హోటల్ లోంచి బయటకు నడిచారు. ఫియట్ కారు డ్రయివర్ అహమద్ వాళ్ళకు సలామ్ చేశాడు.

"అహమ్మద్, కారులో మేమిద్దరం వెళ్తాం. నువ్వు రానవసరంలేదు" అన్నాడు నాగేశ్వరరావు.

"అతడు కూడా రావడం మంచిది" అందామె.

"సావిత్రీ, మనిద్దరిమధ్యా పానకంలో పుడకలా వీడెందుకు? మరో మనిషి కారులో వుంటే మనకు ప్రయివసీ వుండదు."

"మీ యిష్టం" అందామె.

ముందు సీటుమీద సావిత్రి కూర్చుంది. ఇగ్నిషన్ కీ తీసుకుని అతడు ఎక్కాడు.

ఏదేనా కొనుక్కోమని డ్రయివరు చేతిలో అతడు పదిరూపాయిలనోటు పెట్టాడు.

నాగేశ్వరరావు కారును పోనిచ్చాడు. రోడ్డు యిరు వైపులా సావిత్రి చూస్తోంది. ప్రకృతి సౌందర్యం బ్రహ్మాండంగా వుంది. రంగురంగుల పూల మొక్కలు. చెట్లనుంచి యాపిల్ పళ్ళు వేళ్ళాడుతున్నాయి.

అరగంట పైన రోడ్డమ్మట కారు ప్రయాణం చేస్తోంది. తన నరాలు బిగుసుకుపోయినట్లు అతడు కూర్చున్నాడు. ఎక్కడా జనసంచారంలేదు.

అతరు కారును ఆపాడు. ఆమె నలువైపులాచూసింది. ఎక్కడా చెరువులేదు.

"మీరు చెప్పిన లేక్ యిక్కడ లేదేే?" అందామె.

అతడు కిందకు దిగాడు. కు డి వై పు న రాళ్ళగుట్ట ఎత్తుగా కనిపిస్తోంది.

"ఆ గుట్టపైకి వెళ్దాం. అక్కడనుంచి నలువైపులా చూడొచ్చు. వ్యూ బాగుంటుంది."

"వామ్మో భయం! కళ్ళు తిరుగుతాయి!" అందామె.

"పక్కన నేనున్నానుగా!" అన్నాడతను.

ఆమె కిందకు దిగింది. కారు హారన్ మ్రోగింది. కాస్సేపట్లో ఒక కారొచ్చి వాళ్ళ కారు వెనకనే ఆగింది. కారులోంచి దిగిన వ్యక్తివైపు ఆమె నవ్వుతూ చూసింది. హోటల్ గది గుమ్మంలో నిలబడి వున్నపుడు అతడే

"ఫైన్ కాశ్మీర్" అంటూ తన ముందునుంచి వెళ్ళి పోయాడు.

అతడు ఒంటరిగాలేడు. అతడితో ఒక కాశ్మీర్ యువతి వుంది.

సావిత్రి భర్త దగ్గరకు నడిచింది.

"పదండి తొందరగా పైకి ఎక్కుదాం" అందామె.

రాళ్ళ గుట్టపైకి వెళ్ళాలన్న ఉత్సాహం అతడికిప్పుడు లేదు.

"వీళ్ళుపోయాక వెళ్దాం" అన్నాడతను.

కారులో వచ్చినవాళ్ళిద్దరూ రాళ్ళగుట్టపైకి ఎక్కారు. సావిత్రి పక్కనే భర్త నిలబడి సిగరెట్ పీలుస్తున్నాడు.

"వీళ్ళిద్దరూ శని దేవతల్లా దాపురించారు" అన్నాడతను.

"వాళ్ళు ఎప్పుడు పోతారో! మనం ఆ లేక్‌వైపు పోదాం పదండి" అందామె.

"గుడ్ ఐడియా" అని అతడు కారులో ఎక్కాడు.

ఆమె కూర్చుని తలుపు మూయగానే కారును పోనిచ్చాడు.

"వాళ్ళిద్దరూ అక్కడ ఏం చేస్తున్నారో!" అన్నా

డతను.

"వెళ్ళి చూద్దామా?" అందామె అమాయకంగా.

"సావిత్రీ, వాళ్ళకు కల్చర్ లేదు. ఒంటరిగా మనం వున్నప్పుడు మన దగ్గరే వాళ్ళు కారు దిగకూడదు. మరో చోటకుపోయి దిగాలి" అన్నాడతను.

"మనుషులు విచిత్రంగా ప్రవర్తిస్తారు" అందామె కష్టంగా.

అతడు కారును పోనిస్తున్నాడు. ఆప్యాయంగా ఆమె చేయి పట్టుకుని వేళ్ళు నిమురుతున్నాడు. చటుక్కున కారాపి, నలువైపులా చూసి, అతడామెను గట్టిగా కౌగలించుకుని ముద్దెట్టుకున్నాడు.

ఆమె వుక్కిరిబిక్కిరయింది.

"సావిత్రీ, ఐ లవ్ యూ! నీకోసం నా ప్రాణం కూడా యిస్తాను" అన్నాడతను.

"నాకోసం మీ ప్రాణం, మీకోసం నా ప్రాణం బలీయడం నాకు నచ్చదు. ఇద్దరం బ్రతుకుతూ ప్రేమించుకుందాం" అందామె.

రోడ్డుమీద జనసంచారంలేదు. రోడ్డు కిందకు దిగుతోంది. అనేక మలుపులు వున్నాయి. మరో పదినిమిషాల్లో ఒక సరస్సు పక్కనే అతడు కారు ఆపాడు.

ఇద్దరూ కిందకు దిగారు. దగ్గరగా వెళ్ళి సరస్సుకేసి చూశారు.

"హాయిగా స్నానంచేస్తే బాగుంటుంది" అన్నాడతను.

"చేయండి. నేను ఇక్కడ కూర్చుంటాను" అందామె.

"నువ్వు లేకుండా సరస్సులోకి దిగడం మజాగా వుండదు."

"నాకు ఈతరాదు. బాబోయ్, నేను రాను."

"నేను గజయీతగాడిని. నేనుండగా నువ్వు భయపడనవసరంలేదు."

ఆమె నలువైపులా చూసింది. ఎక్కడా ఎవ్వరూ లేరు. దూరంనుంచి కారు హారన్ వినపడింది.

"అయితే స్నానంచేద్దాం, పదండి. నా కాలును ఏ మొసలో పట్టుకుంటే మీరే కాపాడాలి" అందామె.

కాస్సేపట్లో మరో కారొచ్చి సమీపంలో ఆగింది. రాళ్ళగుట్ట దగ్గర కనిపించిన యిద్దరూ కారు దిగి సరస్సువైపు నడిచారు.

నాగేశ్వరరావు నిరుత్సాహంతో ఆమెవంక చూశాడు.

"మనం బయల్దేరిన క్షణం మంచిదికాదు, సావిత్రీ. శనిదేవత వీళ్ళ రూపాల్లో మళ్ళా వచ్చింది" అన్నాడతను.

ఆమె నవ్వి వూరుకుంది. పావుగంట తర్వాత అతడు సావిత్రి చెయ్యి పట్టుకున్నాడు.

"వీళ్ళు యిప్పట్లో వెళ్ళేటట్లులేరు. పద. పోదాం" అన్నాడతను.

"వాళ్ళు మన్ని ఎందుకిలా వెంటాడుతున్నారు? నాకు భయంగా వుంది" అందామె.

"కమాన్ భయపడకు! కాశ్మీర్‌కు వాళ్ళు మొదటిసారి వచ్చుంటారు. ఎక్కడికెళ్ళాలో తెలియక మన్ని ఫాలో అవుతున్నారు" అన్నాడతను.

ఇద్దరూ వెళ్ళి కార్లో కూర్చున్నారు. కారును వెనక్కి తిప్పి పోనిచ్చాడు నాగేశ్వరరావు. కొంచెం దూరం వెళ్ళేసరికి వెనకనుంచి కారు హారన్ వినపడింది.

"వాళ్ళు వస్తున్నారు, మన వెనక!" అన్నాడతను.

# 9

సందులో గబగబా నడిచాడతను. నిశ్శబ్దంగా ఒక గుడిసెలోకి అతడు ప్రవేశించాడు. గుడిసెలో పెద్ద కొవ్వొత్తిలు మూడు వెలుగుతున్నాయి. చాపమీద కూర్చున్నతను అతడివైపు చూశాడు.

"ఎవరు?" అడిగాడు కాసీమ్.

"నీతో పనుండి వచ్చాను."

"ఏం కావాలి?"

"ఈ ఫోటోలో వున్నామె జలగలా నన్ను అంటిపెట్టుకుని నా రక్తాన్ని పీల్చేస్తోంది. ఆమెను తొలగించాలి" అన్నాడతను.

"చంపాలా?" అడిగాడు కాసిమ్.

"చంపాలి."

"25 వేలు అడ్వాన్స్ యివ్వాలి. ఆమె శవాన్ని నీకు చూపించాక మరో 25 వేలు."

బాగ్ లోంచి ఐదు కట్టలు తీసి అతడు కాసీమ్‌కి ఇచ్చాడు. అతడు పళ్ళు యికిలిస్తూ డబ్బు తీసుకున్నాడు.

"ఆమె ప్రస్తుతం ఎక్కడుంది?"

"నా హోటల్ గదిలో.

"రేపుపొద్దుట తొమ్మిదింటికి ఆమెను షాపింగ్ చేసుకు రమ్మని ఒంటరిగా బయటకు పంపు. హోటల్ నుంచి నే నామెను వెంటాడతాను. పని పూర్తి చేస్తాను. రేపురాత్రి యిక్కడికొస్తే ఆమె శవాన్ని నువ్వు చూడొచ్చు."

"మంచిది."

"నా గురించి నీకెవరు చెప్పారు?" అడిగాడు కాసీమ్.

"నా కారు నడిపే డ్రయివర్ చెప్పాడు."

"ఆల్‌రైట్, వెళ్ళిరా!"

అతడు క్షణంసేపు కాసీమ్ వైపు చూశాడు. కాసీమ్ యమదూతలా వున్నాడు. అతడు బయటకు నడిచాడు. సందులో నడిచి వేగంగా వెళ్ళిపోయాడు.

* * *

సావిత్రి అతడి రాకకోసం ఎదురుచూస్తూ కూర్చుంది. ఎనిమిది తర్వాత వచ్చాడతను.

"ఎక్కడికి కెళ్ళారు?"

"మన డిస్ట్రిబ్యూటర్ ఆఫీసుకు వెళ్ళాను. వ్యాపార విషయాలు మాట్లాడుతూ కూర్చున్నాను"

"నేనూ మీతో వచ్చేదాన్నిగా! ఇక్కడ ఒంటరిగా వుంటే నాకు బోర్ కొడ్తోంది" అందామె.

"ఐ యామ్ సారీ ఇటుపైన నిన్ను హోటల్ గదిలో ఒంటరిగా వదలను" అని అతడామెను ముద్దెట్టుకున్నాడు.

"ఏదో తాగొచ్చినట్లు వున్నారు!" అందామె.

"మన ఏజంట్ స్కాచ్ విస్కీ యిచ్చాడు. వద్దంటే బాగోదని తాగేశాను."

"ఇప్పుడు మీ ప్రోగ్రామ్ ఏమిటి?"

"బయట చలిగా వుంది. డిన్నర్ ముగించి హాయిగా నిద్రపోదాం."

"నీకు నచ్చే ప్రోగ్రాము" అందామె.

# 10

పొద్దుటే యిద్దరూ గదిలోనే బ్రేక్ ఫాస్టు సేవిస్తున్నారు. అతడు టైమ్ చూశాడు. ఎనిమిదైంది.

సావిత్రీ, నువ్వు కాశ్మీర్ చీరలు కావాలన్నావుగా! అమృత్ సిల్క్ స్టోర్స్ అనే షాపులో చక్కటి చీరలు నేను చూశాను. నీకు నచ్చినవి చూసి కొనుక్కో!" అన్నాడతను.

"మీరు రండి, వెళ్దాం" అందామె.

"నేను యివాళ రాలేను. మద్రాసు ఆఫీసుకు ట్రంకాల్చేసి కొన్ని విషయాలు మాట్లాడాలి. అబ్బుల్లా అర్జంటుగా కొంత స్టాకు కావాలన్నాడు."

"మీరు వస్తేగాని నేను వెళ్ళను" అందామె.

అతడు నవ్వుతూ ఆమెవైపు చూశాడు.

"సావిత్రీ, అమృత్ సిల్క్ స్టోర్స్ మన హోటల్‌కి ఎదురుగా వున్న రోడ్డుమీద వుంది. హాయిగా నడిచి వెళ్ళు. ఐదునిమిషాలుకూడా పట్టదు. షాపు యజమానికి చెప్పాను. నిన్ను తొమ్మిదింటికి పంపుతానని."

"మీరు చెప్పాక వెళ్ళకపోతే బాగోదు. వెళ్తాను" అందామె.

తొమ్మిది అవుతుండగా అతడామెను హోటల్లోంచి బయటకు తీసుకెళ్ళాడు. ఎదురుగా వున్న రోడ్డు చూపించాడు.

"అక్కడే నిద్రపోకు! తొందరగా రా, లేకపోతే నాకు బోరుకొడ్తుంది" అన్నాడతను.

"డబ్బు పట్టుకెళ్ళొద్దూ?" అడిగిందామె.

"నీకెన్ని చీరలు కావలసినా వాటిని ఎన్నుకుని హోటల్‌కి తెచ్చి డెలివర్ చేయమను. వాళ్ళు అలా చేస్తారు" అన్నాడతను.

ఆమె గేటుదాటి వెళ్ళింది. నాగేశ్వరరావు నిలబడి ఆమెవైపే చూస్తూ వుండిపోయాడు.

అమాంతంగా ఏదో కారొచ్చి ఆమె పక్కనే ఆగింది. ఒకతను ఆమెను బలాత్కారంగా కార్లో ఎక్కించి తలుపు మూశాడు. కారు దూసుకుపోయింది.

అతడి గుండె దడదడలాడింది. అతడు వేగంగా

హోటల్ గదికి చేరుకున్నాడు. బజ్జర్ నొక్కాడు. హోటల్ బాయ్ పరుగెత్తుకొచ్చాడు.

"స్కాచ్ విస్కీ అండ్ సోడా! ఫుల్ బాటిల్ విస్కీ!" అన్నాడతను.

హోటల్ బాయ్ బాటిల్, సోడాబుడ్లు తెచ్చి అతడిముందు వుంచాడు. ఒక గ్లాసును టీపాయిమీద పెట్టాడు.

"ఇంకా ఏమైనా కావాలా, సార్?"

"నతింగ్, నువ్వు వెళ్ళొచ్చు" అన్నాడతను.

హోటల్ బాయ్ వెళ్ళిపోయాడు. తలుపు దగ్గరగా మూయబడింది.

గ్లాసులో ఎక్కువగా విస్కీపోసి అతడు సోడా కలిపాడు. గ్లాసులోని విస్కీని గడగడ తాగేసి సిగరెట్ వెలిగించాడు.

నిమిషాలు దొర్లిపోతున్నాయి. చీరలు కొనడానికి వెళ్ళిన సావిత్రి యింకా రాలేదు. ఆమె యింక రాదు!

అతడు టైము చూశాడు. పన్నెండు కావస్తోంది. టెలిఫోన్ రిసీవర్ ఎత్తి మద్రాసుకు ట్రంకాల్ బుక్ చేయమని చెప్పాడు. అర్జంటు కాల్!

అరగంట తర్వాత టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ ఎత్తాడు.

"హలో!" అన్నాడు.

"స్పీకవ్ టు సత్యభామ, మద్రాస్" అందో కంఠం.

"హలో, భామా!" అన్నాడతను.

"సత్యభామనే. కాశ్మీర్ ఎలా వుంది?"

"నువ్వు లేకుండా ఎలా వుంటుంది, నరకంలా తప్ప" అన్నాడతను.

"ఎప్పుడొస్తున్నారు?"

"రెండు మూడు రోజుల్లో."

"మీ రాకకోసం ఎదురుచూస్తూ వుంటాను."

"శ్యామా, అక్కడి న్యూస్ ఏమిటి?"

"అంతా మామూలే. చెప్పవలసిందేమీ లేదు—"

"ఆల్ రైట్, వుంటాను" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

హోటల్ బాయ్ గదిలోకొచ్చాడు.

"సార్, లంచ్ పట్రానా?"

"పట్రా" అన్నాడతను.

గది నలువైపులా చూసి, "ఇద్దరికేనా?" అడిగాడు బాయ్.

అతడు అవునన్నట్లు తలాడించాడు.

హోటల్ బాయ్ వెళ్ళిపోయాడు. అతడు విస్కీ గ్లాసును అందుకున్నాడు.

## 11

లంచ్ సేవించి అతడు పరుపుమీద వాలిపోయాడు. వెంటనే నిద్ర పట్టేసింది.

రెండుసార్లు హోటల్ బాయ్ తలుపుతోసి లోపలకు చూశాడు. అతడు నిద్రపోతున్నాడని గమనించి, లైట్ ఆన్ చేసి వెళ్ళిపోయాడు.

నాగేశ్వరరావు కళ్ళు తెర్చేసరికి గదిలో లైటు వెల్గుతోంది. అతడు టైమ్ చూశాడు. తొమ్మిది దాటింది.

కాసీమ్ అతడికి గుర్తుకొచ్చాడు. అతడు వెంటనే లేచాడు. బాత్ రూమ్‌లోకి వెళ్ళి మొహం కడుక్కున్నాడు. హేంగోవర్‌తో అతడు బాధపడుతున్నాడు. గ్లాసులో కొంత విస్కీ పోసుకుని అతడు తాగేశాడు.

దుస్తులు మార్చుకుని అతడు బయటకు వెళ్ళాడు. హోటల్ గది తలుపుమూసి లాక్ చేశాడు.

ఫియట్ కారుపక్కనే డ్రయివర్ నిలబడి వున్నాడు.

"అహమ్మద్, నువ్వెళ్ళు" అని అతడికి పదిరూపాయలు యిచ్చాడతను.

ఫియట్ కారును అతడు బయటకు పోనిచ్చాడు. రోడ్డు లైట్లు వెల్గుతున్నాయి.

ఒకచోట కారు ఆపి అతడు దిగాడు. కుడివైపున్న సందమ్మట వేగంగా నడిచాడు. ఒక గుడిసెలోకి ప్రవేశించాడు.

కాసీమ్ భయంకర రూపం అతడికి కనిపించింది.

"నీకోసమే చూస్తున్నా. పని పూర్తయింది" అని అతడు నాగేశ్వరరావువైపు చూశాడు.

"శవం ఎక్కడుంది?"

గోడవారగా తెల్లటి దుప్పటి పరచివుంది. కాసీమ్ దుప్పటిని వెనక్కిలాగాడు.

రక్తం చిమ్మిన ఆమె మొహంకేసి చూసి ఆమాంతంగా అతడు పక్కకు తిరిగాడు.

తన జేబులోంచి ఐదు నోట్లకట్టలు తీసి అతడు కాసీమ్‌కి యిచ్చాడు.

"ఈ శవాన్ని ఎక్కడేనా పారేస్తే పోలీసులకు దొరుకుతుంది. దాన్ని కాల్చిపారేస్తే నీకు ప్రమాదం వుండదు" అన్నాడు కాసీమ్.

"శవాన్ని కాల్చి పారేయండి" అన్నాడతను.

"ఆ పనికి మరో పదివేలు యివ్వాలి."

అతడు రెండు కట్టలుతీసి అతడికిచ్చాడు.

"ఈ రాత్రే కాల్చేస్తాను" అన్నాడు కాసీమ్.

"ఆమె ఒంటిమీదున్న నగలు నాకు రావాలి" అన్నాడు నాగేశ్వరరావు.

కాసీమ్ గంభీరంగా నవ్వాడు.

"ఆమె ఒంటిమీద వున్నదంతా మాదే. ఏదీ నీకు తిరిగిరాదు" అన్నాడు కాసీమ్.

"ఒప్పుకుంటున్నాను" అని అతడు బయటకు నడిచాడు.

కారు దగ్గరకు చేరుకున్నాడు. వెంటనే కారు దూసుకుపోయింది.

## 12

నాగేశ్వరరావు ఆమెవైపు నవ్వుతూ చూశాడు. అమాంతంగా ఆమెను కౌగలించుకుని, పెదిములమీద ఆవేశంతో ముద్దెట్టుకున్నాడు.

"భామా!" అన్నాడతను.

"చెప్పండి" అందామె.

"ఇటుపైన మన పెళ్ళికి ఏ అడ్డంకులూ లేవు."

"మీ భార్య?"

"దేవుడు ఆమెను తొలగించేశాడు. ఆమె బస్ యాక్సిడెంట్‌లో మరణించింది."

సత్యభామ నిర్ఘాంతపోతూ అతడివైపు చూసింది.

"ఏమైందో వివరంగా చెప్పండి."

"ఇద్దరం రోడ్డమ్మట నడుస్తున్నాం. వెనుకనుంచి ఒక బస్సు అమాంతంగా మావైపు వచ్చింది. నేను దూరంగా దూకేశాను. ఆమె టైర్ కిందపడి మరణించింది. పోలీసులు ఆమె శవాన్ని నాకు అందజేశాక అక్కడే దహనం చేసి వెనక్కు తిరిగి వచ్చేశాను" అన్నాడతను.

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"నాకోసం మీరామెను ఆ విధంగా చంపలేదుగా?"

ప్రశ్నించిందామె.

అతడు ఆమెతంక చూశాడు. అతడి కళ్ళమ్మట నీళ్ళు కారాయి.

"భామా, నిజం చెప్తున్నాను. ఆమెను నేను చంపలేదు. భగవద్గీత చేతిలో పట్టుకుని యిదే చెప్తాను."

ఆమె మౌనంగా అతడివైపు చూసింది.

"ఆమె ఆ విధంగా మరణించినందుకు విచారిస్తున్నాను" అందామె.

"భామా, అయిందేదో అయిపోయింది. ఆమె చావు గురించి ఏడ్వడానికి తలిదండ్రులు లేరు. ఆమెకు నేను తప్ప మరెవ్వరూ లేరు."

కొంతసేపు యిద్దరూ మౌనంగా వుండిపోయారు.

"భామా, మన పెళ్ళికి యింకా ఆలస్యం ఎందుకు?" అన్నాడతను.

"మీరు వచ్చి నాన్నతో మాట్లాడండి."

"ఎప్పుడు రమ్మంటావు?"

"ఇవాళ సాయంత్రం, ఆరు తర్వాత" అందామె.

ఆమె గదిలోంచి బయటకు వెళ్ళిపోయింది. అతడు ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాడు.

సావిత్రి మరణం గురించి యెవ్వరూ యెక్కువగా పట్టించుకోరు. ఆమెకు దగ్గర చుట్టాలు లేకపోవడం తన అదృష్టం.

సాయంత్రం ఆరింటికి అతడు కారులో సత్యభామ యింటికి వెళ్ళాడు.

రెండు గదుల్లో సత్యభామ తలిదండ్రులతో జీవిస్తోంది.

సత్యభామ అతడిని ముందు గదిలోకి తీసుకు వెళ్ళింది.

లుంగీ, బనియన్‌లో వున్నాడామె తండ్రి.

"రండి, కూర్చోండి" అన్నాడు కామరాజు.

నాగేశ్వరరావు కుర్చీలో కూర్చున్నాడు. కామరాజు అతడివైపు నవ్వుతూ చూశాడు.

"అమ్మాయి అంతా చెప్పింది. మీ భార్య యిప్పుడే మరణించిదిగా! రెండు మూడు నెలలు గడిచిన తర్వాత పెళ్ళి చేసుకోడం మంచిదేమో" అన్నాడతను.

"ఆలస్యం చేయడం నాకు వీలుకాదు. నాది పెద్ద యిల్లు. ఎందరో నౌఖర్లు. నేను రోజల్లా ఫ్యాక్టరీలో వుంటాను. ఎవరూ యింట్లో లేకపోతే నా యిల్లు గుల్లయి పోతుంది."

"అయితే ముహూర్తం పెట్టిస్తాను."

"వీలైనంత వేగంగా మా పెళ్ళి అవ్వాలి" అన్నాడతను.

"అలాగే అవుతుంది."

"మామగారూ, పెళ్ళి మా యింట్లోనే జరుగుతుంది. మీకు పైసా ఖర్చు వుండదు" అన్నాడతను.

"ఆలస్యంగానైనా సరైన అల్లుడు దొరికినందుకు సంతోషిస్తున్నాను" అన్నాడు కామరాజు.

## 13

నాగేశ్వరరావు కాంపౌండులో విశాలమైన పందిరి. పందిరిలో పెళ్ళి అవుతోంది.

వందలాది అతిథులు కుర్చీల్లో కూర్చుని వున్నారు. ముహూర్తం దగ్గరవుతోంది.

పందిరిలో చాలా సందడిగా వుంది. పురోహితుడు మంత్రాలు పఠిస్తున్నాడు.

పక్క కూర్చున్న సత్యభామవైపు నాగేశ్వరరావు నవ్వుతూ చూశాడు. ఇటువైపున ఆమె పూర్తిగా తనవు లొంగవలసిందే.

పీటమీద కూర్చున్న నాగేశ్వరరావు లేచి నిలబడ్డాడు. సమీపంలో నిలబడి వున్న వ్యక్తివైపు చూసి ఉలిక్కిపడ్డాడు.

పెళ్ళికూతురు వెనక సావిత్రి నిలబడివుంది!

ఆమెవైపే చూస్తున్నాడతను. అతడిచేతిలోని మంగళ సూత్రం కిందపడింది. అతడు భయంతో దూరంగా అడుగులు వేశాడు.

సావిత్రి అతడివైపు గబగబా నడిచింది.

"నన్ను చూసి భయపడకండి! నేను దయ్యాన్ని కాను" అర్చిందామె.

"నీ శవాన్ని నా కళ్ళతో చూశాను. నువ్వు బతికి యిక్కడికెలా వచ్చావు?" నాగేశ్వరరావు గాభరాగా అడిగాడు.

పందిరిలో నిశ్శబ్దంగా వుంది.

అందరి చూపూ సావిత్రిమీదే కేంద్రీకృతమైంది. సత్యభామ నిలబడి అంతా మౌనంగా చూస్తోంది.

సావిత్రి పందిరిలో వున్న పెద్దలవైపు చూసింది.

"నాగేశ్వరరావుగారు నా భర్త. మా పెళ్ళయి ఆరేళ్ళు దాటింది. అప్యాయంగా ఆయన నన్ను కాశ్మీర్ రమ్మన్నారు. ఆయనకంత ప్రేమ నామీద ఎందుకు పుట్టుకొచ్చింది? ఏదో అనుమానం నాలో తలెత్తింది. కాశ్మీర్ వస్తానని ఆయినతో చెప్పాను. కాని తగువిధంగా జాగ్రత్తపడ్డాను. మద్రాసులో వుండే డిటెక్టివ్ కాళిదాసుగార్ని కలుసుకున్నాను. కాశ్మీర్ వచ్చి ఏ ఆపదా

రావకుండా నన్ను కాపాడమన్నాను."

ఆమె ఆగింది.

"తర్వాత ఏమైంచో చెప్పండి" అన్నారెవరో.

"కాశ్మీర్ వెళ్ళాక ఏదోవిధంగా నన్ను చంపాలని ఆయన ప్రయత్నించారు. కాని అది సాధ్యంకాలేదు. ఆయన ఏదేనా చేసేముందే కాళిదాసుగారు మారు వేషంలో మేమున్నచోటకు వచ్చేవారు. ఆయనకు విసుగెత్తింది. డబ్బిచ్చి నన్ను చంపించాలని ఆయన నిశ్చయించుకున్నారు. కాశ్మీర్‌లో మా డ్రయివర్ అహమ్మద్ ద్వారా ఆ విషయం నాకు తెలిసింది. కాసీమ్ అనే కిరాతకుడు డబ్బిస్తే యెంతమందినేనా చంపుతాడని అహమ్మద్ చేత మేం ఆయనకు చెప్పించాం. ఒక గుడిసెను అద్దెకు తీసుకుని కాళిదాసుగారే కాసీమై అక్కడ వున్నారు. అది పాపం ఆయనకు తెలియదు. కాసీమ్ గుడిసెకు వెళ్ళి ఆయన డబ్బు చెల్లించారు, నన్ను చంపమని. రోడ్డమ్మట నేను వెళ్తూండగా కారులో కాళిదాసుగారొచ్చి నన్ను యెత్తుకుపోయారు. యెర్రరంగు పులిమిన నా ముఖాన్ని ఆ రాత్రి నా భర్తకు చూపించారు. నేను చంపబడ్డాననుకుని, నన్ను కాల్చిపారేయమని నా భర్త మరో పదివేలు చెల్లించి హోటల్‌కి వెళ్ళిపోయారు. అక్కడినుంచి మద్రాసువచ్చి తను మోజుపడ్డ సత్యభామను పెళ్ళాడ్డానికి సిద్ధపడ్డారు."

సావిత్రి ఆగింది. సమీపంలో వున్న సత్యభామవైపు చూసింది.

"నా భర్త మానసికంగా హంతకుడు. అటువంటి వ్యక్తిని యీమె పెళ్ళాడ్డానికి అంగీకరించినందుకు నేను చాలా విచారిస్తున్నాను."

సత్యభామ నాగేశ్వరరావువైపు కోపంగా చూసింది.

"ఆ కిరాతకుడిని నేను పెళ్ళాడను. మీరు బస్సు యాక్సిడెంట్‌లో మరణించారని నాతో అబద్ధమాడి ఆయన నన్ను పెళ్ళికి ఒప్పించారు" అంది సత్యభామ.

"తన కోర్కెలు తీర్చుకోడానికి ఆయన ఎంత నీచమైన పనైనా చేస్తారు" అంది సావిత్రి.

పందిరిలో వున్న పెద్దలు నాగేశ్వరరావు వైపు చెప్పులు విసిరారు. అతడు ఏడుస్తూ వెళ్ళి సావిత్రిముందు పడ్డాడు.

"సావిత్రీ, నన్ను క్షమించు. నీ యిష్టమొచ్చినట్లు నన్ను శిక్షించు! నేను కిరాతకుడిని" అర్చాడు నాగేశ్వరరావు, ఏడుస్తూ.

"లేవండి" అంది సావిత్రి.

అతడు లేచి నిలబడ్డాడు.

"మిమ్మల్ని మన్నిస్తున్నాను. ఆ నాటి సావిత్రి చనిపోయిన తన భర్తకు జీవంపోసి వెనక్కు తీసుకొచ్చింది. నేను యీనాటి సావిత్రిని భర్త చేతుల్లో చావకుండా ప్రాణాన్ని నిలుపుకుని తిరిగి రాగలిగాను" అందామె నవ్వుతూ.

—: అయిపోయింది: —

# విషకన్య

# సికిందర్

(గత సంచిక తరువాయి)

ఆమె తలుపు దగ్గరాగి హాండిల్ మీద చెయ్యి వేసింది. కుడిచేతిలో రివాల్వర్ ట్రిగ్గర్ మీద వేలువుంచి సిద్ధంగా పట్టుకుంది.

దబదబ మోగిపోతోంటే తలుపు — ఆమె అతి నెమ్మదిగా, తాపీగా హాండిల్‌ని తిప్పి పక్కకు తప్పుకుంది.

ఒక్కసారిగా తెరచుకున్న తలుపులోంచి లాల్ జొరబడ్డాడు, అతని వెనుక మరికొందరూ.

అందర్నీ నిశ్చేష్టుల్ని చేస్తూ పేల్చిందామె చేతిలో రివాల్వర్, సీలింగ్‌లోకి. ఒక్క గెంతు బయటికి వేసి, చెదిరిపోయి హాహాకారాలతో పరుగుతున్న జనంలోంచి పరుగెత్తింది.

ఆమె మెట్లు దగ్గరికి చేరుకుంటూండగానే లాల్ బయటకొచ్చి రివాల్వర్ తీశాడు. తనని తరుముకొస్తున్న అతన్ని చూసి మళ్ళీ పేల్చిందామె. బుల్లెట్ కారిడార్‌లో బల్బుని తునకలు చేసింది. అంధకారం వ్యాపించింది. ఆర్తనాదాలు మిన్నుముట్టాయి.

లాల్ మరింత వేగంతో ముందుకెళ్ళాడు. మెట్లు

చేరుకుంటూండగానే, కిందికి దిగిపోతున్న ఆమె మళ్ళీ పేల్చింది. బుల్లెట్ వచ్చి లాల్ కింద మెట్టుకు తగిలింది. అతను ఎగిరి వెనక్కి దూకి మళ్ళీ ముందుకు దౌడుతీశాడు.

ఆమె గబగబా మెట్లు దిగిపోసాగింది .... దిగుతూ రెండో అంతస్తులో కాలుజారి దొర్లుకుంటూ పోయింది.

పైకి రివాల్వర్ ప్రేల్చి లాల్, ఆమెని ఆగి పొమ్మంటూ హెచ్చరించాడు. కానీ అతను చేరుకునే లోపునే ఆమె లేచి తిరిగి వురికింది. క్షణాల్లో ఆమె బయట ఆవరణలో పరుగెత్తసాగింది....

అప్పుడు లాల్ చివరి మెట్టుమీద ఆగి గురిచూశాడు. ఆమె వేగంగా గేటును సమీపిస్తోంది. పెద్ద చప్పుడు చేస్తూ లాల్ చేతిలో రివాల్వర్ ప్రేలింది.

ఆమె రెండడుగులు గాల్లోకి లేచి పడింది కుడికాలు పట్టుకుంటూ. నిప్పులు కురుస్తున్న కళ్ళతో లాల్ వైపు చూసి షూట్ చేసింది.

లాల్ మెట్లు దిగిపోయి పరుగెత్తుకొన్నవాడల్లా పక్కకు గెంతేసి, మళ్ళీ పలాయనం చిత్తగిస్తున్న ఆమె కేసి షూట్ చేశాడు. ఈసారి ఆమె చేతులు పైకి లేచాయి. రివాల్వర్ ఎగిరిపడింది దూరంగా. ఆమె వీపు పట్టుకుంటూ తూలి ముందుకు పడిపోయింది—గేటు దగ్గర. ఆమె వీపులోంచి రక్తం చిమ్మసాగింది....

లాల్ పరుగెత్తాడు. వెనుక జనం పరుగుత్తుకొచ్చారు. రోడ్డుమీద పోతున్నవాళ్ళూ వచ్చారు. ఒక్కసారి ఆ ప్రాంతం కల్లోలితమైంది ...

జనాన్ని తోసుకుంటూ లాల్ ఆమెని చేరుకున్నాడు. గేటు దగ్గర లైటు వెలుగు ఆమెపై బాగా పడుతోంది. ఆ వెలుగులో ఆమె చీరంతా రక్తంతో తడిసి కని

స్తోంది. ఆమె అలాగే బోర్లా పడుకుని వుంది. ఆమె చేతులు, కాళ్ళు చిన్నగా కదులుతున్నాయి.

ఆమె పక్కన కూర్చుని లాల్ వెల్లకిలా తిప్పాడు. మూతపడుతున్న కళ్ళతో ఆమె చుట్టూ మూగినవాళ్ళని చూసి ఏదో గొణిగింది. ఆమెని చూసిన వాళ్ళంతో ఒక్కసారి అరిచారు. "సుహాసిని! సుహాసిని!"

ఆమె చేతులు ముఖంమీదికి కదులుతున్నాయి. ఆమెని లాల్ మౌనంగా గమనిస్తున్నాడు. ఆమె చేతులు ఒక్కసారి ముఖంమీద పొరని లాగేశాయి-మాస్క్‌ని!

జనంలోంచి మరోసారి అరుపులు, కలకలం. "కాదు! ఈమె సుహాసిని కాదు! సుహాసినికాదు!"

లాల్ తికమకగా చూశాడామెని. ఆమె అసలు రూపం అతని కళ్ళకింకా అనడంలేదు. మాస్క్‌ని పట్టుకుని పరిశీలించాడు. ఆమె భుజాలు పట్టి వూపుతూ, "ఎవరు-నువ్వెవరు?" అన్నాడు.

ఆమె తల అడ్డంగా వూపింది, "నేను సుహాసినిని కాదు. ఆమె రూపంలో తిరుగుతున్నాను. వాళ్ళు చెప్పిన హత్యలు చేస్తున్నాను. ఈ హత్యలన్నీ చేసింది నేనే! సుహాసిని కాదు! ఇలా చేస్తే నాకు చాలా డబ్బు వస్తుందన్నాడు బాలరాజ్ .... కానీ అతను చచ్చిపోయాడు! ఇప్పుడు నేనూ చచ్చిపోతున్నాను.... నేనూ చచ్చిపోతాను.... నేనూ...."

ఆమె చేతులకి గ్లవ్స్‌ని చూస్తున్నాడు లాల్, "నా సందేహాలు ఇప్పుడు తీరుతున్నాయి. అందుకే సతీష్‌ని నిర్దాక్షిణ్యంగా చంపేశావు. నన్ను బందీగా వున్నప్పుడు కల్సుకున్నప్పుడు సుహాసిని కన్నవాళ్ళ గురించి నిర్లక్ష్యంగా మాట్లాడావు. నువ్వు శత్రుపక్షమే అయినప్పుడు

నీవు వాళ్ళమీద పగ ఎలా వుంటుంది!"

ఆమె మాట్లాడలేదు. అతి కష్టంగా ఊపిరి తీసుకుం టోంది.

"ఓహ్, మా గ్యాంగ్ ఆశయానికి సుహాసిని ఫిగ్ లీఫ్ అనుకున్నాను. కానీ సుహాసినికే నువ్వు ఫిగ్ లీఫ్‌వి! ఇప్పుడెక్కడుండి సుహాసిని? బ్రతికే వుందా?"

"బ్రతికే వుంది...."

మూసుకున్న కళ్ళతో, ఊపిరందక ఆయాసపడుతూ చెప్పసాగిందామె....

దేవయాని.

•  •  •

సుహాసిని నిప్పుకణికల్లా మండుతున్న కళ్ళతో చూస్తోంది—

ఆ కళ్ళల్లో వున్న భావం ఒక్కటే—కసి, ప్రతీ కారం, కక్ష.

ఏదో చేయాలన్న తపన, తాపత్రయం.

అలసి, వడలిపోయిన ముఖంలో, అవిరామంగా పిడికిళ్ళు బిగుసుకుంటున్న చేతుల్తో ఆ మంచంమీద అశాంతిగా కదుల్తోందామె.

ఆమె కళ్ళముందు ఇంకా ఆ కాళరాత్రి మెదుల్తూనే వుంది—ఆ మూడు కుక్కలు కబళించిన రాత్రి. ఆ క్షణంలో ఆమెకు వళ్ళు జలదరింపు. మనసు ఆక్రందన భస్మీపటలమైన భవిష్యత్తుకు భరించలేని ఆవేదన. కానీ శుష్కించిన ఆమె కళ్ళు కన్నీళ్ళని స్రవించడంలేదు....

ఆ మరుక్షణం ఆమెకు అంతులేని తృప్తి. ప్రశాంతి. ఆ మూడు కుక్కల వధింపుకు వర్ణించలేని వివశత్వం.

కానీ—

ఆమె కళ్ళముందు తండ్రి చితిమంటలు ఇంకా ప్రజ్వరిల్లుతూ నే వున్నాయి!

తల్లి మరణవార్త చెవుల్లో మారు మోగుతూ నే వుంది!

నరేన్ ఛిద్రమైన శరీరం హృదయాన్ని తూట్లు పొడుస్తూ నే వుంది!

ఇంకా —

తన పేరుమీద జరుగుతున్న మారణ కాండ తెలుస్తూ నే వుంది!

తనకేం జరుగుతున్నదో బోధపడుతూ నే వుంది!

అప్పుడు ఆత్మ ఘోషిస్తూ నే వుంది — సహించకు. నీవాళ్ళకు జరిగిన అన్యాయాన్ని సహించకు. అంతాన్ని చూస్తూ తెచ్చుకోకు. పూసుకో! ఇప్పుడే, ఈ క్షణాన తెగించి నీచేతనయినంతవరకు చెయ్. ఒక్కొక్కర్ని చీల్చి చెండాడు.

కానీ ఇన్ని రోజుల ఖైదులో ఆమె నిస్సహాయురాలే అయింది. మనసు ఎంత ఘోష పెడుతున్నా నిరాశా నిస్పృహాలు కలుగుతూ నే వున్నాయి. ఇందులోంచి బయటపడే మార్గం కన్పించడంలేదు.

నిట్టూరుస్తూ ఆమె మంచం దిగింది. నీరసమైన శరీరాన్ని అడుగులో అడుగు వేసుకుంటూ తలుపు దగ్గరికి చేర్చింది....

బయట ఆమెకు లయబద్ధంగా అడుగులు విన్పించాయి. ఇంకే శబ్దమూ లేదు.

* * *

ఆ పక్క గదిలోనే జాన్ పరిస్థితి సరిగ్గా ఇలాగే వుంది.

మంచంమీద పొర్లుతూ, పాలమారి దగ్గుతూ, దిగ్గున లేచి కూర్చుంటూ, గదిలో తిరుగుతూ అశాంతిగా గడుపుతున్నాడు.

అతడాశించిన వాతావరణమే సిద్ధమయింది. ఇంట్లో చాలావరకు మనుషులు వెళ్ళిపోయారు. బయట యెవరో కాపలా వున్నారు. వున్నాడా? ఒకడా? ఇద్దరా? ఈ సందేహంతోనే అవకాశం తీసుకోవడానికి వెనుకాడుతున్నాడు జాన్. ఒక్కడైతే ఎదుర్కోవడం కష్టం గాదు. ఇద్దరయితే ప్రాణాలతో రిస్కు వుంటుంది.

జాన్ మళ్ళీ తలుపు దగ్గరకొచ్చి నిలబడ్డాడు.

బయట అడుగులే కానీ మాటలు లేవు.

శ్రద్ధగా విన్నాడు. ఆ అడుగులు ఒక్కడివే.

అప్పుడు నిర్ణయానికొచ్చాడు తెగింపుతో.

గాఢంగా ఊపిరి పీల్చుకుని, తలుపుమీద కొట్టాడు చిన్నగా.

వెంటనే బయట అడుగులాగిపోయాయి.

జాన్ మళ్ళీ కొట్టాడు.

అడుగులు దగ్గరకొచ్చి ఆగాయి.

"ఎవరవతల? కొంచెం తలుపుతీయ్...." అన్నాడు మళ్ళీ కొడుతూ.

"దేనికి?" అవతలనుంచి మాటలు విన్పించాయి.

"నేను అర్జంటుగా బాత్ రూం కెళ్ళాలి."

వెంటనే వచ్చింది జవాబు. "కుదరదు, మావాళ్ళు రావాలి."

"అంతదాకా ఆగలేను. బ్లాడర్ నిండిపోయి ప్రాణం తీస్తోంది. వెంటనే బాత్ రూం కెళ్ళిపోవాలి. లేకపోతే గది ఖరాబవుతుంది...."

"ఎత్తులు వేయకు మిస్టర్!"

"నాకంత సహనంలేదు! బాత్‌రూంకెళ్ళే తొందర్లో వున్నాను—ముందు బ్లాడర్ ఖాళీ అయితేగానీ మనసు నిలకడ కాదు. నీకంత అనుమానముంటే బాత్‌రూంలో కెళ్ళగానే తాళం వేసేయ్. అక్కడే వుంటాను, మీ వాళ్ళు వచ్చేవరకు. ప్లీజ్, ఆలస్యం చేయకు...."

కొన్ని క్షణాల్లో నిశ్శబ్దం.

"సరే, తీస్తాను. కానీ నా దగ్గర రివాల్వర్ వుందని మరువకు."

తాళం తీస్తున్న చప్పుడవుతూంటే జాన్ వేగంగా కదిలి మంచం పక్కనున్న స్టీలు ఫోల్డింగ్ ఛెయిర్‌ని పట్టుకుని తలుపుపక్కకొచ్చాడు. ఆ దేక్షణంలో తలుపు బార్లా తెరచుకుంది. బయటి వెలుగు కొంత లోపలికి పడింది. వెంటనే అతను లోపలికి రాలేదు, తొంగి చూడలేదు.

హాలు మధ్యకి వెళ్ళి నిలబడి రివాల్వర్ గురిపెట్టాడు.

"చేతులెత్తిపట్టుకుని బయటికిరా, ఆ చీకట్లోంచి!" అన్నాడతను.

జాన్ ఒక్కక్షణం తటపటాయించాడు.

"నా మాటలు విన్నారా?"

"విన్నాను. వస్తున్నాను."

ఛెయిర్‌ని తన కడ్డంగా పట్టుకుని ఒక్క పరుగుతీశాడు జాన్ బయటికి.

ఏం జరుగుతుందో ఆ మనిషి గ్రహించేలోపున జాన్ వెళ్ళి ఢీకొట్టేశాడు ఛెయిర్‌తో. ఇద్దరూ వెళ్ళి వెనుక సోఫామీద పడ్డారు. ఆ మనిషి రివాల్వర్ ప్రేల్చలేక పోయాడు. జాన్ చెయిర్ ఎత్తి బాదగానే తల పక్కకు

వాల్చేశాడు. రివాల్వర్ వదిలేశాడు. జాన్ అతనిమీద నుంచి లేచిపోయాడు.

ఆయాసం తీర్చుకుంటూనే రివాల్వర్ అందుకుని చుట్టూ చూశాడు. ఆ అలికిడికి యెవరూ రాలేదు. ఎక్కడా శబ్దం లేదు.

ఆ మనిషిని లాక్కెళ్ళి ఆ గదిలోనే పడేశాడు. మంచంమీద దుప్పటిని పేలికలుగా చించి కట్టేశాడు. అప్పుడు విసురుగా వచ్చి తలుపు తాళానికి వేలాడుతున్న కీ బంచ్‌ని తీసుకున్నాడు. గబగబా పక్క గది దగ్గరికెళ్లి దాని తాళం తెరిచేశాడు.

ఈ అలికిడి విని సుహాసిని దిగ్గున లేచి వచ్చింది. తలుపు తెరుచుకోగానే అమాంతంగా లంఘించింది జాన్ మీదికి, ఆడపులిలా. అది వూహించని జాన్ ఆమెతో సహా వెళ్ళి పడ్డాడు అయిదడుగుల దూరంలో. తల నేలకి కొట్టుకుని కళ్ళు గట్టిగా మూసుకున్నాడు, రివాల్వర్ వదిలేస్తూ. ఆమె రెచ్చిపోతూ అతన్ని రక్కసాగింది.

జాన్ తేరుకుని ఆమెని నెట్టేస్తూ అరిచాడు. "అరె, నేను శత్రువుని కాను! నిన్ను విడిపిస్తున్నాను!"

కానీ ఆమె వినిపించుకోలేదు.

రివాల్వర్ అందుకుంది. పళ్ళు బిగబట్టి దాన్ని జాన్ తలకానించి ట్రిగ్గర్ లాగబోయింది.

జాన్ ఆమె చెయ్యి పట్టుకుని మెలితిప్పేస్తూ రెండో చేత్తో మొహంమీద కొట్టాడు. ఆమె రివాల్వర్ వది లేసింది. మొహం పట్టుకుని అరవబోయింది. జాన్ లేచి అరవనీయలేదు. నోరు నొక్కిపెడుతూ, రివాల్వర్ అందుకుని తల వెనుక దెబ్బవేశాడు. కళ్ళు తేలవేసింది. మరో దెబ్బవేశాడు. తల వాల్చేసింది. దుబ్బుమని కింద

పడింది.

జాన్ వేగంగా ఊపిరి పీలుస్తూ నిలబడ్డాడు. ఆమెని కొన్ని క్షణాలు చూసి, అక్కడ్నించి పరుగుతీశాడు.

వేగంగా కింది గదులన్నీ చూసి, మేడమీదికి దారి తీశాడు. పైన మెట్లకెదురుగా వున్న గది దగ్గర జాగ్రత్త పడుతూ ఆగిపోయాడు.

ఆ గదిలో లైటు వెలుగుతోంది. ఫ్యాను తిరుగుతోంది కానీ ఎవరూ లేరు. అతను మరొక అడుగువేసి లోపలికి ఇరువైపులా తొంగి చూశాడు. ఎవరూ కన్పించలేదు. నిశ్శబ్దంగా వుంది. అతను కళ్ళు చిట్లిస్తూ వెనక్కి తిరగబోయాడు——

వెనకనుంచి మెడపై ఒక చల్లటి వస్తువు తగిలింది.

జాన్ స్తంభించిపోతూ చేతులు పైకెత్తాడు.

"గుడ్, ఆ రివాల్వర్‌ని పడెయ్యి!" అంది వెనుక గొంతు.

జాన్ రివాల్వర్ వదిలేశాడు.

అప్పుడతను విసురుగా వెళ్ళి, ధడాలున ఎదురుగా కుర్చీలో పడ్డాడు.

* * *

అతన్ని నెట్టిన మనిషి నవ్వుతూ లోపలికి అడుగుపెట్టి, కిందపడ్డ జాన్ రివాల్వర్‌ని కాలితో తలుపవతలకి తోసేశాడు.

జాన్ అతన్నే చూడసాగాడు, కళ్ళు పెద్దవిగా చేస్తూ.

మరో నవ్వు నవ్వి, యశ్వంత్‌రావ్ గయొక్వాడ్ నాలుగడుగులు ముందుకేసి నిల్చున్నాడు. అతని చేతిలో రివాల్వర్ జాన్‌కి గురిపెట్టి వుంది.

జాన్ అతన్నే గమనిస్తున్నాడు.

"అయితే నువ్వు బయటపడ్డా వన్నమాట?" అడిగాడతను.

జాన్ తలూపాడు అవునన్నట్లు.

యశ్వంత్ ఫెళ్ళున నవ్వాడు, జాన్ అదిరిపడేలా. "కల్ల! బయటపడడం కల్ల! నీవల్ల కాని పనికి పూనుకో వద్దు, మిష్టర్ జాన్. కమాన్, నిన్నా గదిలో వదిలి పెడతాను. నేను పంపించినప్పుడే నువ్వు పోవాలి...."

జాన్ అడ్డంగా తలూపాడు.

"కమాన్, బెట్టు చెయ్యకు! మరొక్క రోజు! ఆ తర్వాత నీ దారి నీది, మా దారి మాది!"

జాన్ మళ్ళీ తల అడ్డంగా వూపాడు.

"మిష్టర్ జాన్, అనవసరంగా మమ్మల్ని కష్టనష్టాలకు గురిచెయ్యకు. నువ్విక్కడ్నించి బయటపడితే మేము తక్షణం ఇల్లు ఖాళీచేయాల్సి వుంటుంది. మాకెక్కడ దొరుకుతుంది ఈ అర్ధరాత్రి తలదాచుకునే చోటు? ఈ ఒక్క రాత్రి ఇక్కడే వుండిపో...."

"నేను వుండను, నువ్వేం చేస్తావు?"

యశ్వంత్ కోపంగా చూశాడు. "జాన్, నన్ను రెచ్చ గొట్టకు. నేను మనిషిని కాను. నా గురించి నీకు తెలియదు. మంచిగా చెప్తున్నాను, నువ్వు తిరిగి ఆ గదిలో కెళ్ళిపో!"

జాన్ నవ్వాడు. "ఎందుకు? నాకీ గది బాగానే వుంది. ఇక్కడే వుంచి తలుపు మూయ్!"

"నో!" అరిచాడతను, "నో! నాకు మెదడుంది, మిష్టర్ జాన్! నువ్వా కిటికీలోంచి తప్పించుకుంటావ్!"

జాన్ వినోదంగా చూశాడతన్ని. "ఓహ్, నిజంగా నాకీ ఆలోచన రాలేదు. అయితే నువ్విలాగే కాపలా

కాయ్ నన్ను."

"నా సహనాన్ని పరీక్షించకు!"

"అయితే షూట్ చేయ్?"

"షూట్ — షూట్—" యశ్వంత్ చేతిలో రివాల్వర్ వణికింది.

జాన్ మళ్ళీ నవ్వాడు. "షూట్ చేయలేవు, అవునా? యూ హేవ్ నో గట్స్! మీరింతవరకూ రివాల్వర్ ప్రేళ్ళే అవసరం రాకుండా గడుపుకొచ్చారిక్కడ! సైలెన్సర్ లేదు. ఒక్క షాట్ పేలిస్తే ఏమవుతుందో నీకు తెలుసు. చుట్టుపక్కల జనం మేల్కొని పచ్చడి చేస్తారు నిన్ను — కమాన్, నీకు ధైర్యముంటే నన్ను షూట్ చేసి పారిపో! ఇంతకంటే మార్గంలేదు నీకు!"

యశ్వంత్ కళ్ళు చిట్లించసాగాడు. అతని నుదురు చెమట పట్టసాగింది. చేతిలో రివాల్వర్ వణుకుతూనే వుంది. జాన్ మాటలు అర్థంచేసుకుని తేరుకున్నాడు.

"నో, నో, నిన్ను నేను షూట్ చేయను. ఆ అవసరం రాదు. కాస్సేపట్లో మా వాళ్ళంతా వచ్చేస్తారు. వాళ్ళే నిన్ను హాండిల్ చేస్తారు.... ఈ కాస్సేపూ నిన్ను కదలకుండా చూడగలను."

"చూడలేవు—" అన్నాడు జాన్, "నే నిప్పుడు నీ మీదికొస్తున్నాను. నువ్వు ట్రిగ్గర్ లాగేస్తావు. కానీ నే నెలా తప్పించుకుంటానో నువ్వూహించవు. ఆ తర్వాత నీ తొందరపాటుకి జీవితాంతం చింతిస్తావు?"

"కదలకు —కదలకు నువ్వు!" అరిచాడు యశ్వంత్ ఒక్క అడుగు ముందుకేసి, "నేను చంపదల్చుకుంటే నువ్వు తప్పించుకోలేవు! కానీ నిన్ను చంపడం నాకిష్టం లేదు. నా జీవితంలో ఇంతవరకు ఎవర్నీ చంపలేదు!"

"అవును, నీ పిరికితనం తెలుస్తూనే వుంది" అన్నాడు జాన్, "నువ్వు నీ చేతుల్తో చంపలేవు. చంపిస్తున్నావు నీ తొత్తుల్తో. నా పక్క గదిలో సుహాసినిని బంధించి, ఆమె వేషంలో మరొకత్తితో చేయిస్తున్నావీ హత్యలు. ప్రజలంతా సుహాసినిగానే నమ్ముతున్నారు. వాళ్ళని పెడదారి పట్టించి పెట్టెలకొద్దీ డబ్బు గడిస్తున్నావు. కరపత్రాల్లో నువ్వు చాటుకున్న ఆదర్శాలన్నీ హంబక్. నీలాటి శాడిస్టుకి ఆదర్శాలుంటాయని యెవరంటారు? మర్డర్స్ ఫర్ ప్లెజర్. అంతే. ఆనందంకోసం హత్యలు చేయిస్తున్నావు. యూ ఆరే మీన్ హ్యూమన్ క్రీచర్!"

అంతవరకూ వున్న ఉద్రేకమంతా సడలిపోయింది యశ్వంత్ ముఖంలో. అతను తేలికపడుతూ గర్వంగా నవ్వాడు.

"అవును, జాన్. నువ్వు చెప్పింది నిజం. నా మైండ్‌ని సరిగ్గా అర్థంచేసుకున్నావు. కేవలం నా తృప్తికోసమే ఈ హత్యలు చేయిస్తున్నాను. భుక్తికోసం డబ్బు గడిస్తున్నాను. చూశావా, ఒకే దెబ్బకి రెండు పిట్టలు. ఆలోచన అంటే ఇలా వుండాలి. నాది ఇన్‌ఫీరియారిటీ అను, నన్ను ఇంట్రోవర్టు అను, పిరికివాడు అను—అన్నీ ఒప్పుకుంటాను. అలాటి నేను నా అశక్తతను పారద్రోలటానికే శాడిస్టునయ్యాను. నాలో అహం నిద్రలేచింది. శక్తిని నిరూపించుకోమంది. క్షుద్రమైన ఆలోచనల్ని కల్పించింది.... ఇంకేం చేయను?

ఇంకేం చేయాలి, జాన్? నా స్కోర్ బోర్డులో

ఒక్కో చావు పెరుగుతూంటే చెప్పమంటావా నాకెంత గర్వమో! ఇన్ని హత్యలు చేయించిన ఖ్యాతి ఇటీవల కాలంలో నాకే దక్కుతుందని చెప్పమంటావా ఢంకా బజాయించి!

"నా కెదురులేదు. నా కే బెదురూ లేదు! నేను పకడ్బందీగా సృష్టించి అమలుజరుపుతున్న ప్లాను విజయవంతమవుతోంది! సుహాసినిని ఎందుకు బంధించి వుంచానని అడుగు. ఆమె చేతనే ఎందుకు చంపించకూడదని అడుగు. అది చాలా పొరపాటవుతుంది, జాన్. ఆమె కోసం ప్రయత్నంలో ఆమె వాళ్ళని చంపవలసి వచ్చినందుకు కాదు. అసలు ముందే ఆమెతో హత్యలు చేయించే ఆలోచనలేదు. నా ప్లానుకోసం గాలిస్తున్న అమ్మాయితో అలాటి ఆలోచనే లేదు. ఎంతయినా ఆమె మా మనిషి కాదు. మా మాట వింటుందని నమ్మకం లేను. ఆమెమీద ఆధారపడలేం. కేవలం మా కలాపాలకి ఆమెను డమ్మీగా ఉపయోగించుకోవాలనుకున్నాను, అంతే.

"అంతే, జాన్ అంతే. ఔరంగాబాద్ రైతుబిడ్డ ఎంత ఔన్నత్యాన్ని సాధించాడు! ఈ డబ్బు! ఇన్ని చావులు! ఇవన్నీ నాకు క్రెడిట్స్! ఇంకొక్క రోజు—రేపొక్క రోజుతో యిక్కడ నా ఆపరేషన్ అయిపోతుంది. అప్పుడు నేనేం చేయబోతానో చెప్పను! ఎక్కడికెళ్తానో చెప్పను! కానీ ఒక్కటి మాత్రం చెప్తాను: నిన్ను సజీవంగా విడిచిపెట్టేస్తాను. సుహాసినిని—ఆమె విషయంలో నేను చేయగలిగిందేమీ లేదు. దట్ గాడ్—ఆ దేవుడు ఆమెను నిర్మూలించమంటున్నాడు నా సేఫ్టీ కోసం. దేవయాని ఆమెలా చలామణీ అవుతుంది అంతటా!"

యశ్వంత్ గర్వంగా చూసి, రివాల్వర్‌ని వూపుతూ మరింత ముందుకొచ్చాడు: "కాబట్టి జాన్, నా మాట విని నీ గది కెళ్ళిపో! లేకపోతే మా వాళ్ళు నిన్నేదైనా చేయవచ్చు. శంభూనాథ్ ఇలాటి పరిస్థితిలో విచక్షణ కోల్పోతాడు...."

జాన్ అతని కాళ్ళ సందులోంచి తలుపవతల రివాల్వర్ కోసం చూశాడు.

అది కన్పించలేదు.

అదే క్షణంలో బయట ఆ బంగళాకు చేరువగా వచ్చి ఆగాయి కొన్ని పోలీసు వాహనాలు.

జాన్ తలెత్తి యశ్వంత్‌ని చూశాడు. ఇప్పుడతని ముఖం క్రూరంగా వుంది. అతనింకొక్క క్షణం సహించేలా లేదు.

జాన్ వెంటనే అన్నాడు: "నీ వాళ్ళు వస్తారంటావా? నాకు నమ్మకం లేదు."

"ఎందుకు లేదు?"

నవ్వాడు జాన్, "వాళ్ళు వెళ్ళి చాలా సేపయింది—నాలుగు గంటలు దాటింది. నిన్న గంటలో తిరిగి వచ్చేశారు. ఇవ్వాళ కూడా నువ్వు పోలేదు. దేనికో భయపడి వుంటావు. నీ భయం వాళ్ళ కవకాశం యిచ్చింది.. అంత డబ్బుతో వాళ్ళనెలా నమ్ముతావు నువ్వు?"

"అంటే? ..." యశ్వంత్ ఆవేశమంతా చల్లారిపోయింది.

జాన్ మళ్ళీ నవ్వాడు: "యూ పూర్ ఫెలో, అంత డబ్బుతో వాళ్ళెప్పుడో పారిపోయి వుంటారు!"

"నాన్సెన్స్ మాట్లాడకు!" అసహనంగా అరిచాడు

యశ్వంత్.

"లేకపోతే ఇంతవరకూ ఎందుకు రాలేదు? పారిపోయే వుండాలి—లేదా ఏదో జరిగివుంటుంది—కొరికిపోయి వుంటారు పోలీసులకి!"

అతని ముహం చూసి గట్టిగా నవ్వాడు జాన్.

అప్పుడు పోలీస్ కమీషనర్, ఇన్స్పెక్టర్ కృష్ణన్, ఇన్స్పెక్టర్ రమణారెడ్డి, కొందరు కానిస్టేబిల్స్తో పాటు డిటెక్టివ్ లాల్ కూడా గబగబా సమీపిస్తున్నారా బంగళాని, కాలినడకన ఆయుధాలతో.

"నో! అలా జరుగదు! అలా జరిగివుండదు!" యశ్వంత్ ఉద్రేకంగా అరిచి, వాచీ చూసుకున్నాడు. అతని ముఖం మరింత ఎర్రబడింది. కళ్ళు భయంకరంగా మెరిశాయి. జాన్ని చూసి అతని పళ్ళు బిగుసుకున్నాయి. "నువ్వు—జాన్—నువ్విప్పుడు చావబోతున్నావు! చంపడం మినహా నాకు దారిలేదు! నిన్ను అడ్డు తొలగించి వెళ్ళిపోతాను—ఆ బాస్టర్డ్స్ ఎక్కడున్నారో చూస్తాను! గాలిస్తాను! వెతికి పట్టుకుంటాను—నువ్వన్నదే జరిగి వుండొచ్చు. థాంక్స్! చచ్చే ముందు కళ్ళు తెరిపించావ్. చాలా థాంక్స్! మై ఫ్రెండ్ ...."

జాన్ అతన్ని చూసి కదలకుండా కూర్చున్నాడు, చేతులలాగే ఎత్తిపట్టుకొని. అతని కళ్ళు రివాల్వర్ మీదే వున్నాయి. అతను పెదవులు బిగబట్టాడు, ముంచుకొస్తున్న ప్రమాదానికి నుదురంతా చెమట పడుతోంది.

గేటు తీసుకుని వాళ్ళంతా లోపలకొచ్చేయసాగారు చీకట్లో నీడల్లా కదుల్తూ.

సుహాసిని గబగబా పైకొచ్చేసింది....

ఆమె అరిపాదాలు యే మాత్రం అలికిడి చేయలేదు.

యశ్వంత్ వెనుక నుంచి ఆమెను చూసి జాన్ అదిరి పడ్డాడు.

కింద వాళ్ళంతా హాల్లోకి ప్రవేశించారు.

యశ్వంత్ వికృతంగా నవ్వుతూ ట్రిగ్గర్ మీద వేలిని చుట్టి పట్టాడు: "మొదటిసారి జాన్! జీవితంలో మొదటి సారి నా చేతుల్తో ప్రాణాలు తీస్తున్నాను....అది నువ్వు కావడం....నువ్వు కావడం...."

సుహాసిని పై మెట్టువరకూ వచ్చి అక్కడాగిపోయింది. కింద పడివున్న రివాల్వర్ ని చూసింది. జాన్ చూస్తూండ గానే వెనుకనుంచి ఎవరో తరుముకొచ్చినట్టు గదిలోకి జొరబడింది, రివాల్వర్ అందుకొని.

జాన్ స్తబ్ధుడయ్యాడు.

యశ్వంత్ ట్రిగ్గర్ లాగబోయాడు.

వెనుక నుంచి అతని తల పెద్ద శబ్దంతో బ్రద్ద లయింది.

సుహాసిని మరోసారి ట్రిగ్గర్ లాగింది—అతని వీపులో రంధ్రం పడింది.

ఆమె ఆవేశంతో మళ్ళీ లాగింది—నడుములో రంధ్రం పడింది.

ఉద్రేకాతిరేకంతో మళ్ళీ లాగిందామె—మెడలోకి దూసుకెళ్ళింది బుల్లెట్.

కిందనుంచి వాళ్ళంతా అరుపులతో పైకొచ్చారు. "స్టాప్ దట్ షూటింగ్ స్టుప్! యూ క్రేజీ! స్టాప్ దట్ షూటింగ్ స్టుప్!"

ఆమె మళ్ళీ లాగింది ట్రిగ్గర్. కానీ ప్రేలలేదు. అతను క్రింద పడివున్నాడు అడవి దున్నలా, రక్తాన్ని పిచికారి కొడుతూ. అతని చేతిలో రివాల్వర్ అలాగే వుంది పట్టు విడకక. అతన్ని చూస్తోంది సుహాసిని తనివిదీరా. మొదటిసారి ఆమె కళ్ళు జీవం నింపుకున్నాయి. వాటిలో తృప్తి తన్మయత్వం కదలాడుతున్నాయి.

ఆమెను చేరుకున్న అధికారులు విస్తుపోయి చూస్తున్నారు.

—: సమాప్తం :—

సీరియల్

బొమ్మిడి అచ్చారావు

"రేపే మీ ప్రయాణం! నేను చెప్పిన విషయాలన్నీ గుర్తున్నాయి కదూ!" తన అనుచరులవంక పరీక్షగా చూస్తూ అన్నాడు రెడ్‌సన్.

వాళ్ళు తలలూపారు.

"రాక్సన్! ఈ టీమ్‌కి నిన్ను నాయకుడిగా నియమిస్తున్నాను. ఎట్టి పరిస్థితుల్లోను విజయాన్ని సాధించి తీరాలి!" అన్నాడు రెడ్‌సన్.

పొడుగ్గా బలంగా పోతపోసిన కంచువిగ్రహంలా వున్న రాక్సన్ వినయంగా తల గుండెలదాకా వంచి అభివాదంచేసి "మీ మాట, నా మాట కూడా దక్కిస్తాను బాస్! ఆ నిధిని సాధించుకునే తిరిగి వస్తాము!" అన్నాడు ప్రమాణం చేస్తున్నట్టు.

"నికోలస్!" అని పిలిచాడు రెడ్‌సన్.

"ఎస్ బాస్!" పొట్టిగా, లావుగా వున్న వ్యక్తి ముందుకొచ్చి నిలబడ్డాడు. అతని ముఖంనిండా స్ఫోటక మచ్చలు వికృతంగా నిండిపోయున్నాయి. యోలాంటి

ఘాతుకాన్నయినా క్షణాలమీద నిస్సంకోచంగా చేసేలా వున్నాయి అతని ఉక్కు చేతులు. వాటిని వినయంగా ఛాతీమీదుగా తెచ్చుకుని అభివాదం చేశాడు.

"నువ్వు రాక్సన్‌కి కుడిభుజంగా వ్యవహరించాలి!"

"థాంక్యూ బాస్!"

"జావర్, రోమన్!" అని పిలిచాడు రెడ్‌సన్.

"ఎస్ బాస్" అంటూ యిద్దరు యువకులు ముందు కొచ్చి అభివాదం చేశారు. పచ్చి రక్తం తాగే గూండాల్లా వున్నారిద్దరు. జావర్ గళ్ళ బనీనును పాంటులోకి తోసి పైన వెడల్పాటి బెల్టు పెట్టుకున్నాడు. రోమన్ పైజామా లాల్చీ వేసుకున్నాడు. దుబ్బు మీసాలతో వికృతంగా కనిపిస్తున్నాడు.

"మీరిద్దరు రాక్సన్ వెంట వెళ్ళాలి. వాళ్ళేం చెబితే అది చెయ్యండి. తవ్వకాల విషయంలో మీరిద్దరు రెస్పాన్సిబులిటీ తీసుకోవాలి. ఓ.కే!?" అన్నాడు రెడ్‌సన్.

"సర్టెన్‌లీ ఓకే సార్!" అన్నారు వాళ్ళిద్దరు.

రెడ్‌సన్ మేప్‌లోకి చూపెడుతూ "ఇది నిధి నిక్షిప్తం చేసిన స్థలాన్ని సూచించే మేప్! ఇక్కడికి ఉత్తర దిశగా మీ ప్రయాణం మొదలవుతుంది. ఇదిగో ఇదంతా ఎర్ర రేగడి నేల. రోడ్డు చదునుగా వుండదు. మిట్టపల్లాలు. కంకర రాళ్ళు. ప్రయాణం చాలా కష్టంగా వుంటుంది. ఇదుగో యీ ప్రాంతాల వున్నాయి నైన్ హిల్స్. వీటినే 'టైగర్ హిల్స్' అని వ్యవహరిస్తారు. వరసగా తొమ్మిది పర్వతాలు ఒకదానికొకటి అనుకుని వున్నందున, వాటి శిఖరాలు పెద్దపులి పంజాగోళ్ళలాగా పదును దేరి వంగినట్టు కనిపించటంవల్ల ఆ పేరొచ్చిందని చెపుతారు.

"ఇదిగో, కొండ పైభాగాన వున్న యీ ఏరియా అంతా మీరు తవ్వకాలు జరపాల్సి ఉంటుంది. కొండల్లాగే తొమ్మిది గుహలు కూడా వున్నా యిక్కడ. వాటి లోపలికి పోయి చూసినవాళ్ళు అరుదు. అందులో క్రూర మృగాలే నివాసముంటున్నాయో, విష సర్పాలే నివాస మేర్పరుచుకున్నాయో యెవరికీ తెలీదు. మీరు వాటి విషయంలో ఆసక్తి చూపించుకోకుండా మీ పనిమీదే దృష్టి కేంద్రీకరించండి.

అయితే మీరు రాత్రిళ్ళు బస చెయ్యటానికి ఓ సురక్షితమైన స్థలం అవసరం! కాబట్టి మీరు అందులో ఓ గుహని మీరుండటానికి వీలుగా అమర్చుకోండి. నిధిని చేజిక్కించుకునేదాకా మీరు విశ్రమించకూడదు. మీరిక ప్రయాణానికి సిద్ధంకండి!" అన్నాడు రెడ్సన్.

రాక్సన్ మేప్ చుట్టి దుస్తుల్లో భద్రపరిచాడు.

"మీ ఉనికి మాత్రం యూడో కంటికి తెలియకూడదు. తవ్వకాలకి కావలసిన గడ్డపారలు, పలుగులు సిద్ధంగా ఉన్నాయి. జీప్ టాంకు నిండా పెట్రోలు పోసి వున్నది. స్పేర్ జెర్రీ కేన్స్‌లో పెట్రోలు కావలసినంత స్టాకుంది. రాత్రిళ్ళు జీప్ ఎవరికీ కళ్ళబడకుండా చెట్ల కొమ్మలు ఆకులలములతో కప్పిపెట్టండి.

ఈ కార్య సాధనలో ఎందరి ప్రాణాలు బలిగొన వలసి వచ్చినా వెనుదీయవద్దు. కొన్ని వేలకోట్ల రూపాయల విలువైన అపూర్వ నిధిని మన స్వంతం చేసుకొని తీరాలి. సాధ్యమైనంత తొందరగా పని ముగించుకొని రండి" అన్నాడు రెడ్సన్, రాక్సన్ భుజంతట్టి.

• • •

"మేప్ చూడనవసరంలేదు కరెక్టు దారి నే

పోతున్నాం" అన్నాడు రాక్సన్. నికోలస్ మేప్ మడిచాడు.

రాక్సన్ జీప్ నడుపుతున్నాడు. నికోలస్ అతని పక్కనే కూచుని ఉన్నాడు. బాడీలో జావర్, రోమన్ కూచుని ఉన్నారు. గడ్డపారలు, పలుగులు, తిండికి కావలసిన సామగ్రి యితర సరంజామా అంతా జీప్ నిండుగా ఉన్నాయి.

అప్పటికి సూర్యుడుదయించి చాలా సేపయింది.

"సాయంత్రానికి చేరుకుంటామా?" అన్నాడు జావర్.

"చేరుకోవాలి. మనం ఉండటానికి గుహని శుభ్రం చేసుకుని సిద్ధపరుచుకోవాలి కదా! లేకుంటే ఏ పులో సింహమో చక్కగా భోం చేస్తుంది" అన్నాడు రోమన్.

"పులులకి సింహాలకి భయపడితే నువ్వేం సాధించ గలుగుతావు జీవితంలో! నీ చేతిలో చేవ ఉంది చెంత మందుగుండు సామగ్రి ఉంది. యెలాంటి క్రూరమృగాన్నయినా నాశనం చెయ్యగలమన్న గుండె బలముంది. ఇంతా భయంగా వుందా నీకు?" అన్నాడు రాక్సన్ డ్రైవింగ్ నుంచి తల తిప్పకుండానే.

రోమన్ సిగ్గుపడిపోయాడు అవమానమనిపించి.

"సారీ రాక్సన్! నా ఉద్దేశం అదికాదు!" అన్నాడు.

"దట్సాల్ రైట్!" అన్నాడు రాక్సన్.

దూరంగా ఏవో పంట పొలాలు కనిపిస్తున్నాయి. దగ్గరకొచ్చేసరికి అది ఏపుగా పెరిగిన పచ్చగడ్డి, జనుము అని గ్రహించారు వాళ్ళు. అదంతా మెట్ట ప్రాంతం. ఎక్కడా నీటి వనరులు కూడా లేవు. వరి పండే అవకాశమున్నట్టు కనపడటంలేదు.

అక్కడ అక్కడ ఓ గుడిసె కనిపిస్తోంది, చెదురు మదురుగా. ఈ కొండ ప్రాంతంలో వీళ్ళెలా బతుకుతున్నారో ననిపించింది.

"రాక్సన్, జీపు ఆపు" అన్నాడు నికోలస్.

అప్రయత్నంగానే బ్రేక్ మీద కాలువేసి "దేనికి?" అన్నాడు రాక్సన్. జీప్ స్లో అయింది.

నికోలస్ జీప్ మీదినుంచి కిందికి దూకాడు. అతన్ని ఆకర్షించిన అంశం ఓ ఆడమనిషి!

చీరను తొడలదాకా లాక్కుని ఒంగుని గడ్డికోస్తోంది. ఆమె అందాలు పైట చెదిరిపోయి బయటపడుతున్నాయి. చూసేవాళ్ళకు పిచ్చెత్తించే భంగిమ.

నికోలస్ అమాంతం వెనకనుంచి ఆమెను వాటేసుకున్నాడు. ఆమె గింజుకుంది. అరవబోయింది. నికోలస్ ఆమె నోరు గట్టిగా నొక్కేశాడు. జావర్, రోమన్ అతనికి సాయంగా వెళ్ళారు.

రాక్సన్ వారించబోయాడు. కాని వాళ్ళెవరికీ అతని హెచ్చరిక వినిపించలేదు.

ఒత్తిగా పెరిగిన గడ్డిలో ఆమెను వెల్లకిలా పడేసి ఒంటిమీద గుడ్డలన్నీ చించి లాగిపారేశారు. పూర్తి నగ్నంగా ఆమె అందాలు ఎగిరెగిరి పడుతున్నాయి.

ముగ్గురికీ నరాలు జివ్వుమన్నాయి. చేతులు జావర్ అదిమిపట్టాడు తలపైనుంచి. రోమన్ ఆమె కాళ్ళవైపు కదలకుండా పట్టుకున్నాడు.

నికోలస్ ఆమెని అమాంతం ఆక్రమించుకున్నాడు.

ఒకరి తర్వాత ఒకరుగా ముగ్గురూ తమతమ ఆకలి తీర్చుకున్నారు.

వాళ్ళని వారించినా లాభంలేదని రాక్సన్‌కి తెలుసు!

మౌనంగా జీవ్‌లోనే కూచుండిపోయాను.

కాని యింతలో అనుకోని సంఘటన జరిగిపోయింది.

ఎవడో వ్యక్తి వాళ్ళు ముగ్గురు చేస్తూన్న పనిని చూసేశాడు! గట్టిగా అరిచి, దూరంగా కనిపిస్తూన్న గుడి సెలవంక పరుగెత్తబోయాడు.

ప్రమాదాన్ని ముందుగా గుర్తించినవాడు రాక్సన్! ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా రివాల్వర్ గురి చూసి కాల్చేశాడు.

ఆ వ్యక్తి వెన్నులోంచి దూసుకుపోయింది బుల్లెట్. అమాంతం ముందుకు విరుచుకు పడిపోయాడతను.

రివాల్వర్ శబ్దానికి నికోలస్, జావర్, రోమన్ అదిరి పడి చూశారు.

వాళ్ళ చేతుల్లో ఆ అమ్మాయి అచేతనంగా వేలాడుతోంది. ఆమె ప్రాణాలు యెప్పుడో పోయాయి! తమ ఘాతుకానికి ఆమె గుండె ఆగి మైకం కమ్మి యెప్పుడు చచ్చిపోయిందో కూడా గమనించే స్థితిలో లేరు వాళ్ళు!

"అరె, యీమె చనిపోయినట్టుందే!" అన్నాడు నికోలస్.

ఓ పక్క రాక్సన్ చేయెత్తి పిలుస్తున్నాడు. ముగ్గురు ఆమె నలాగే వదిలేసి జీప్ వైపు పరుగెత్తారు.

"మీరు చేస్తూన్న పని ఆ ముగమనిషి చూసేశాడు. తన గూడెం వాళ్ళకి చెప్పటానికి పరుగెడుతున్నాడు. కాల్చేశాను. వెంటనే మనం యిక్కడినుంచి తప్పించుకు పోవాలి! వాళ్ళెవరయినా గమనిస్తే మన ఉనికికే ప్రమాదం" అన్నాడు రాక్సన్ జీవ్‌ని ముందుకు పరుగెత్తిస్తూ.

ఆ మనిషి కేకలు యెవరికీ వినిపించలేదు. దగ్గర్లో యెవరూ లేకపోవటంవల్ల యెవరూ గమనించలేదు.

"అయినా, అదేం పని? ఎక్కడబడితే అక్కడేనా మీ కక్కుర్తి?" అన్నాడు రాక్సన్ చిరాకుగా.

"సారీ, రాక్సన్! పిల్ల పిటపిటలాడుతోంది. మూని నిగ్రహించుకోలేకపోయాను. వెంటనే అనుభవించేవరకు కోరిక ఆగలేదు. పోయి పట్టేసుకున్నాను" అన్నాడు నికోలస్. "అయితే అయిందిగాని భలే మజాగా వుందిలే. నువ్వు కూడా ఓ పట్టు పట్టుంటే...." అంటూ రాక్సన్ చురుగ్గా చూడటంతో వాక్యం పూర్తిచేయకుండా వదిలేశాడు.

జావర్ కోమన్ యింకా సుఖానుభూతిని నుంచి తేరుకున్నట్టు లేదు. ఊహాల్లో తేలిపోతున్నారు.

"మనం బయలుదేరిన పని యెంతో విలువైనది. గురుతరమయినది! మనం యిలాంటి చిన్న చిన్న బలహీనతలకు లొంగిపోతే మన పని సక్రమంగా నిర్వహించలేం! పని య్యాక మీ యిష్టం. ఏది కావాలన్నా అనుభవించవచ్చు" అన్నాడు రాక్సన్.

తక్కిన ముగ్గురు మాట్లాడలేదు.

అప్పటికే జీపు చాలా దూరం వచ్చేసింది! తమని యెవరూ చూడలేదు. తామే వాళ్ళ చావుకు కారణమని తాము చెపితేతప్ప ఎవరికీ తెలిసే అవకాశం కూడా లేదు! అదే ధైర్యం వాళ్ళకి!

•  •  •

రాను రాను దారి చాలా యిరుకుగా వుంది. అన్నీ మిట్టప్రదేశాలే! ఎక్కుడు దిగుడు. అన్నీ గులకరాళ్ళు, ఎర్రమట్టితో కలిసి దుర్గమంగా చేశాయి దారిని; ఆ

దారిన ఎన్నడూ వాహనాలు నడిచిన పాపాన పోలేదని తెలుస్తూనే వుంది!

"దగ్గర్లో ఎక్కడా మనుషులున్న జాడలేదు. ఇక్కడి నుంచి అంతా డొంక దారి! జీప్ నడవటమే కష్టమయ్యేట్టుంది" అన్నాడు రాక్సన్.

జీప్ యింజన్‌లో గరగరమని చప్పుడయింది.

రాక్సన్ యింజను ఆపుచేశాడు.

"ఏమాయింది?" అందరూ దిగారు.

కోవన్ బోనెట్ యెత్తాడు. రేడియేటర్ పొగలు చిమ్ముతోంది. బాడీలో వున్న నీటిని కేనతో తెచ్చి యింజన్‌లో పోశాడు.

పది నిమిషాల తర్వాత మళ్ళీ జీపు బయల్దేరింది.

దూరంగా నున్నగా, నీలంగా కొండలు కనిపిస్తున్నాయి.

"అరే టైగర్ హిల్స్!" అన్నాడు రాక్సన్.

ఏరియా మేప్ అతని మస్తిష్కంలో ముద్ర పడిపోయింది. కళ్ళు మూసినా తెరిచినా టైగర్ హిల్సే అతని స్మృతిపథంలో మెదులుతున్నాయి!

"అయితే దగ్గరపడ్డామన్న మాట!" అన్నాడు నికోలస్ సంబరంగా.

"అప్పుడే ఎక్కడ? మనది అంతా చుట్టుదారి. ఇక్కడి కెంతో దగ్గరగా కనపడుతున్న ఆ కొండల్ని చేరటానికి కనీసం నాయిగెదు గంటలు పట్టొచ్చు."

రాక్సన్ మాటలతో ముగ్గురూ ఊసురన్నారు.

* * *

సాయంత్రం నాలుగున్నర అయింది.

జీప్ కొండల దిగువభాగానికి చేరుకుంది.

"కొండపైకి మనం నడిచిపోవాల్సిందే!" అన్నాడు రాక్సన్.

కొండ ఏటవాలుగా వుంది. పర్వతాలు ఒకదాని కొకటి అనుకుని వరసగ వున్నాయి. నికోలస్ లెక్క పెడ్తున్నాడు.

"జీవ్ యిక్కడ వదిలేద్దాం. సరంజామా అంతా కొండమీదకి మోసుకుపోవాలి" అన్నాడు రాక్సన్.

"మరి మనం యీ రాత్రికి ఎక్కడ గడపాలి?" రోమన్ సందేహం వెలిబుచ్చాడు.

"జీవ్ లోనే! ఇప్పుడు కొండెక్కి గుహల్లో ఏది అనుకూలంగా వుందో చూసుకోవటానికి. శుభ్రపరచుకోవటానికి టైం సరిపోదు. అయినా మీ ఇద్దరు యిక్కడే వుండండి. నేను నికోలస్ పైకి ఎక్కి ఓసారి స్పాట్ చూసివస్తాం!" అన్నాడు రాక్సన్ జీవ్ దిగుతూ.

ఇద్దరు రివాల్వర్ తీసుకున్నారు. రౌండ్స్ జేబుల్లో నింపుకొన్నారు. నికోలస్ రౌండ్సు బెల్టు కట్టుకున్నాడు.

రోమన్, జావర్ జీవ్ దగ్గరే వుండిపోయారు.

రాక్సన్, నికోలస్ చుట్టూ పరీక్షగా చూసి కొండ ఎక్కటం ఆరంభించారు.

కొండ యెక్కటానికి అనువుగా లేదు. కొండపైన పిచ్చిమొక్కలు, తుప్పలు దుబ్బులు కట్టి వున్నాయి.

ఎప్పుడూ యెవరూ ఆ కొండ యెక్కిన సూచనల్లేవు. నికోలస్ గున్న ఏనుగులా వున్నాడేమో రెండుసార్లు జారి పడబోయాడు. రాక్సన్ అతన్ని పట్టి జారిపోకుండా ఆపుచేశాడు.

రాను రాను మరీ నిట్టనిలువుగా వున్నట్టు అనిపించింది. కాని పైకి ఎక్కేసరికి అక్కడంతా సమ మట్టంగా

వున్నట్టు కనిపించింది. అక్కడ పిచ్చిమొక్కలు తుప్పలు చెదురుమదురుగా వున్నాయి. నేల చాలా విశాలంగా మైదానంలాగా కనిపిస్తోంది.

"అవిగో అవే మన బాస్ చెప్పిన కొండగుహల్లా వున్నాయి!" అన్నాడు రాక్సన్ దూరంగా కనిపిస్తున్న గుహలవైపు వేలితో చూపిస్తూ.

నికోలస్ తలూపాడు. అక్కడినుంచి కిందికి చూస్తే జీపు ఓ చిన్న నలకలా కనిపిస్తోంది. జావర్, రోమన్ దృష్టికే కనిపించటంలేదు.

"అబ్బ, చాలా ఎత్తుంది కొండ!" అన్నాడు నికోలస్.

రాక్సన్ ఆ తొమ్మిది పర్వతాల్నీ తన్మయత్వంతో చూస్తున్నాడు.

నికోలస్ మేప్ తెరిచి చూశాడు. బాస్ గుర్తించినట్టే కనిపిస్తోంది ఆ ప్రాంతం.

సూర్యుడు అస్తమించబోతున్నాడు.

"ఆ గుహలు యిప్పుడు చూద్దామా?" అన్నాడు నికోలస్.

"ఇప్పుడిక అనవసరం! లోపల యేం కనిపిస్తుంది చీకటిపడ్డాక?"

"టార్చిలు తెచ్చాం కదా!"

"అయినా కష్టమేలే! ఈ రాత్రికి కిందే గడిపేస్తే మంచిదనిపిస్తోంది నాకు. రేపు తెల్లవార్తూనే పైకి ఎక్కి మనకావలసిన గుహ వెతుక్కుందాం! ఇక దిగిపోదామా?" అన్నాడు రాక్సన్.

కీచురాళ్ళ రొద ప్రారంభమయింది. గబ్బిలాలు రెండు మూడు వాళ్ళమీదుగా ఎగురుతూ కనిపించాయి. ఏవో గుర్తుతెలీని శబ్దాలు, అస్పష్టంగా వినిపిస్తున్నాయి.

రాను రాను పరిస్థితి కొంత భయానకంగా తరయావు తున్నట్టు తోచింది వాళ్ళకు!

"పద, దిగుదాం!" అన్నాడు రాక్సన్.

ఇద్దరు కొండ దిగుతుండగా మధ్యలోనే కారుచీకట్లు నలువైపులా కమ్ముకున్నాయి.

* * *

ఉదయం ఏడుగంటల సమయం.

ఒక్కొక్కటిగా అన్ని సామాన్లు, తన్వే పరం జామాతో పాటు కొండమీదికి చేర్చారు నలుగురు కలిసి. దాదాపు రెండు మూడుసార్లు కిందికి దిగి ఎక్కాల్సి వచ్చింది.

ఎనిమిదో గుహని తమ స్థావరంగా ఎన్నుకున్నారు. తక్కిన గుహాలు ఏవీ నివాసానికి అనుకూలంగా కనిపించ లేదు వాళ్ళకి. గబ్బిలాలతోను, సాలెగూళ్ళతోను, యింకా గుర్తు తెలీని జీవరాశుల్తోను, రాళ్ళురప్పలతో నిండివున్నాయి గుహాలన్నీ.

ఆ గుహాని కూడా నివాసయోగ్యం చేసుకోవటానికి వాళ్ళకు చాలా సమయం పట్టింది. ఆ గుహాలో కూడ గబ్బిలాలు స్థావరం యేర్పరచుకునే వున్నాయి. అయితే వాటిని రోమన్, జాకర్ కలిసి యెలాగో బయటికి తరిమే శారు. ఐదారింటిని కాల్చి చంపారు.

మధ్యాహ్నానికి తమ కార్యక్రమాన్ని అమల్లో పెట్టే శాడు రాక్సన్. నికోలస్ కూడా తక్కినవాళ్ళతో కలిసి

పలుగు, పార పట్టుకొన్నాడు.

తవ్వకాలు మొదలయ్యాయి.

* * *

"ధరణీ! వేన్ ఆపుచెయ్యి!" అన్నాడు ప్రొఫెసర్ శరశ్చంద్ర!

డ్రైవర్ వేన్ ఆపుచేశాడు.

"ఏం సార్ యివేనా నైన్ హిల్స్?...." అన్నాడు కార్తీక్.

"ఎస్, మై డియర్ స్టూడెంట్స్. ఇవే సో కాల్డ్ టైగర్ హిల్స్! ఇదే మన ఫీల్డు ట్రయినింగ్ కోసం ఎన్నిక చెయ్యబడ్డ స్పాటు. దిగండి!" అన్నాడు శరశ్చంద్ర వేన్ దిగుతూ.

కార్తీక్ వేన్ దిగబోతూ, దీప్తివంక చూసి, "మీరు దిగండి, లేడీస్ ఫస్ట్!" అన్నాడు.

దీప్తి నవ్వేసింది.

ఆమె నవ్వితే వెన్నెల విరిసినట్లు, సన్నటి పిల్ల తెమ్మెర చల్లగా వీచినట్లూ, సన్నజాజి పందిరి గుబాళించినట్లు అనుభూతి కలుగుతుంది. ఆమె నడుస్తే, మయూర నృత్యంలా వుందామె నడక.

దీప్తి నీలిరంగు చీరకు ఆకాశ రంగు మేచింగ్ బ్లౌజు వేసుకుంది. జుట్టు కొంత మేర అల్లుకుని చివర రిబ్బన్ కట్టుకుంది. సోగ కళ్ళకు సన్నగా కాజల్ దిద్దింది. సంపెంగను ధిక్కరించే నాసిక, సోగ కళ్ళతో పోటీ పడుతోంది. సన్నటి పల్చటి గులాబీ బుగ్గలు. కంఠం కవులు వర్ణించే శంఖాన్ని గుర్తుతెస్తూంది.

మెడలో సన్నటి ఒంటిపేట గొలుసు వేసుకుంది.

చివర నక్షత్రం లాకెట్ ఆమె గుండె లోతుల్లో చిక్కు కుంది. పచ్చటి పసిమిఛాయలో, మరీ పొడవు పొట్టి గాని విగ్రహంతో చూపరుల దృష్టిని కొన్నిక్షణాలు తప్పని సరిగా నిలిపే సౌష్టవం ఆమెది.

దీప్తి దిగిన తర్వాత వెనక నే కార్తీక్ దిగాడు. అతని వెంట అభిలాష్, హిమవంత్, అశ్విని మిత్రబృందం ఒక రొకరుగా దిగారు.

"ఇక్కడ నుంచి కొంత డొంకదారిన నడవాల్సి వుంటుంది. ఆ తర్వాత నుంచి ఎక్కుడు ప్రారంభమవు తుంది. మనం నడుస్తూనే మాట్లాడుకుందాం. మీకు ఎలాట్ చేసిన టాపిక్స్ మీద మీ రెలా ప్రొసీడ్ కావాలో స్పాటులో వివరిస్తాను" అన్నాడు ప్రొఫెసర్ శరశ్చంద్ర.

"టైగర్ హిల్స్ అనే పేరెలా వచ్చింది సార్ యీ కొండలకి? ఇక్కడ పెద్దపులులు, సింహాలవంటి క్రూర మృగా లేమయినా........" ఆరోకిలోనే ఆగిపోయాడు అశ్విని.

"చెప్పండిసార్, పాపం అశ్వినికుమార్ ఓసారి పెద్ద పులిని జూలో చూసి జడుసుకుని జ్వరంతెచ్చుకున్నాడు" అన్నాడు హిమవంత్.

అశ్విని సన్నగా, నాజూకుగా ఆడపిల్లలా సుకుమా రంగా వుంటాడు. శరీర నిర్మాణంలోనే గాక, ముఖంలో ముఖ్యంగా కళ్ళలో, చక్కటి వర్చస్సు, తేజస్సు వుండి మగవాళ్ళకే మోహం పుట్టించేలా వుంటాడు. స్కూలు రోజుల్లో ఓసారి నాటకంలో ఆడవేషం కూడా వేశాడు. అది తెలిసి హిమవంత్, తక్కిన సహాధ్యాయులు సర

దాగా ఆటపట్టిస్తూంటారు. అతని పూర్తి పేరు అశ్విని కుమార్ అయినా ఫ్రెండ్సంతా అతనిని 'అశ్విని' అనే పిలుస్తుంటారు.

అశ్వినికి ఉక్రోషం వచ్చింది. "మరీ అంత చిన్న పిల్లాడిలాగా చేసి మాట్లాడకు హిమవంత్! యెలాంటి క్రూర మృగంతోనయినా పోట్లాడడానికి నేను సిద్ధం!" అన్నాడు.

ప్రొఫెసర్ నవ్వి, "గుడ్, ఆ స్పోర్టివ్‌నెస్ ఉండాలి!" అన్నాడు.

"ఈ కొండలకి అవతలపక్క యేముంది సార్?" అడిగాడు హిమవంత్. ఎర్రగా తగు మాత్రం ఎత్తుతో, చక్కటి శరీర సౌష్టవంతో కళ్ళు ఎప్పుడూ దేనికోసమో అన్వేషిస్తూన్నట్టు క్యూరియాసిటీతో వుంటాయి. ప్రతిదీ తెలుసుకోవాలనే జిజ్ఞాస అతనికి!

"అది యిప్పటిదాకా మాకూ యెవరికీ తెలీదు. గతంలో ఓసారి చింతపల్లె—అదే మనం యిప్పుడు బస చేసిన వూరు—కేంద్రంగా చేసుకుని ఈ హిల్స్‌కి ఎడమ పక్క నుండే రాక్స్, యిగ్నియిస్ రాక్స్ వాటి సిగ్నిఫికన్స్ గురించి థీసిస్ రాశాడు ఒక రిసెర్చి స్టూడెంట్. అయితే అతని రిసెర్చి పూర్తికాకుండానే పాపం మెంటల్ పేషెంటయిపోయాడు. ఆ తర్వాత మళ్ళీ యిటే రావటం నేనుకూడా!" అన్నాడు ప్రొఫెసర్ శరశ్చంద్ర.

డొంకదారి పూర్తయి కొండ ఎక్కడు ఆరంభమయిన చోట ఆగి అందరివంకా చూశాడు ప్రొఫెసర్.

"కొండ ఏటవాలుగా వుంది, జాగ్రత్తగా ఎక్కండి! మిస్టర్ కార్తీక్, మీరి కొండ దిగువ ప్రాంతంలో సర్వే

చేయండి. మీ కిచ్చిన టాపిక్ గుర్తుంది కదూ!" అన్నాడు శరశ్చంద్ర.

"ఎస్ సర్! నాది 'ఇంజనీరింగ్ జియాలజీ యిన్ కనెక్షన్ విత్ ప్రాజెక్ట్స్ అండ్ వాటర్ రిసోర్సెస్' (నీటిపారుదల, ప్రాజెక్టులకు సంబంధించిన యాంత్రిక భూగర్భశాస్త్రం) అనే టాపిక్!" అన్నాడు కార్తీక్.

కార్తీక్ మరీ అంత పొడవు పొట్టీగాని విగ్రహంతో, చామనఛాయకన్న కొంత మెరుగనిపించే శరీరఛాయతో, ఊహాలోకాల్లో తేలియాడుతున్నట్టుండే కళ్ళతో, తన దైన ప్రత్యేక హుందాతనంతో పెద్దమనిషి తరహాగా వుంటాడు. భావకవి. అతనిలో పైకి కనిపించని సూర్యుడున్నాడు. సమాజంలోని కుళ్ళుమీద విసుర్లు, చెణుకులను కురిపించే సెటైర్‌లు కొన్ని రాసి ప్రచురించాడు.

"గుడ్! మీరు ఆ టాపిక్‌పై కాన్సన్‌ట్రేట్ చెయ్యండి. ప్రస్తుతానికి మాతో కొండపైకి రండి! రేపట్నుంచి కొండ దిగువ చెయ్యవచ్చు....మిష్టర్ అభిలాష్, మీది 'ఆయిల్ అండ్ నాచురల్ గాసెస్' (చమురు, ఖనిజవాయువులకు సంబంధించిన భూగర్భశాస్త్రం) గురించిన టాపిక్ కాబట్టి మీరు కార్తీక్. ఓ.కే!" అన్నాడు ప్రొఫెసర్.

"ఓ.కే సర్!" అన్నాడు అభిలాష్. అతను మితభాషి. చాలా నెమ్మదస్తుడు, ఎక్కువగా ఊహల్లోనే గడుపుతుంటాడు. అయితే చాలా బ్రిలియంట్, ముఖ్యంగా లెక్కల్లో. ఎంత క్లిష్టమైన ప్రాబ్లెమ్ అయినా అయిదు నిమిషాల్లో సాల్వ్ చేసి రిజల్టు చెప్పగల దిట్ట.

కొండ ఎక్కుతున్నా రందరూ.

ప్రొఫెసర్ ముందు, ఆయన వెనుక కార్తీక్, అతని వెంట అభిలాష్, దీప్తి, హిమవంత్ చివరగా అశ్విని వరుసగా ఎక్కుతున్నారు. డ్రైవర్ భరణి వేన్ దగ్గర వుండిపోయాడు.

శరశ్చంద్ర ఆగి దీప్తి వంక చూసి, "అమ్మా, కొండెక్కటం కొంచెం కష్టంగా వుంటుంది. జాగ్రత్త! ఆడపిల్లలకు ఫీల్డు ట్రయినింగ్ కష్టమేనని మాకు తెలుసు. కాని మా కోర్సులో యీ పదిరోజుల ఫీల్డు డిమాన్‌స్ట్రేషన్ తప్పనిసరి కావటంవల్ల మిమ్మల్ని తీసుకురావాల్సి వచ్చింది!" అన్నాడు.

"అదేమిటి సార్, నాకు కష్టమేముంది? ఇలాటి ఫీల్డు ట్రయినింగ్ మా కెంతో ఉపయోగకరమైనది. ఇప్పుడు తెలుసుకోలేకపోతే యింకెప్పుడు వీలవుతుంది? రెండు నెలల్లో యూనివర్శిటీ వదిలెయ్యబోతున్నాం కదా! అప్పుడు చెప్పేవాళ్ళుండద్దూ?...." అన్నది దీప్తి.

"చూడమ్మా దీప్తీ! నీ సబ్జక్టు చాలా క్రిటికల్. అయినా అందరికన్న స్కోప్ యెక్కువున్న టాపిక్. మినరాలజీ అండ్ స్కోప్ ఆఫ్ మైన్స్ (గనులకు సంబంధించిన భూగర్భశాస్త్రం) అన్న విషయంమీద అభ్రకం గురించి, దాని ఉనికి తెలుసుకోవటానికి మీ కెలాంటి మట్టి నమూనాలు ఎలా సేకరించి పరీక్షించాలన్నది తెలుసుకుంటే చాలు! గనులు తవ్వి చూపించక్కర్లేదు!" అన్నాడు శరశ్చంద్ర నవ్వుతూ.

"అలాగే సార్! నేను కూడా కొండ దిగువన సర్వే చేయమంటారా?" అన్నది దీప్తి.

"ఆ సంగతి నేనోసారి యీ స్పాట్ అంతా వెరిఫై

చేశాక చెపుతాను. ఆ....మిష్టర్ అశ్విని, నీ టాపిక్ గుర్తుంది కదూ!"

"ఎస్సర్! 'ఎర్త్‌క్వేక్స్-అక్కురెన్స్ అండ్ రీజన్స్' భూకంపం ఏర్పడటానికి కారణాలు గురించి ఈ ప్రాంతం యెప్పుడయినా భూమి కంపించిందా, కంపించి వుంటే ఆ లక్షణాలు యేమిటి? — అన్న విషయం కనుక్కోమన్నారు."

"గుడ్! ఈ కొండప్రాంతమంతా మీ సామ్రాజ్యమే! యెక్కడయినా సర్వే చేసుకోండి. ఇక పోతే మిస్టర్ హిమవంత్, మీ కోసమే యీ కొండ యెక్కడంతా.... మీది 'రాక్స్ అండ్ యిగ్నియస్ రాక్స్—దెయిర్ సిగ్నిఫికెన్స్ యిన్ జియాలజీ' (భూగర్భశాస్త్రంలో రాళ్ళకు భూగర్భరాళ్ళకు వున్న ప్రాధాన్యత) అన్న టాపిక్ కాబట్టి, యీ కొండమీద యెలాంటి రాళ్ళు లభ్యమవుతున్నాయో, అవి చెప్పే చరిత్రేమిటో మీరు స్టడీ చెయ్యాలి!" అని ప్రొఫెసర్ చెపుతుండగానే ఎక్కుడు పూర్తయి సమతల ప్రదేశం చేరుకున్నారందరూ.

కార్తీక్ నాలుగడుగులు వేశాక, "సార్ యిక్కడ యిదివరకే యెవరో సర్వే చేసినట్లు కనపడుతోందేమిటి? చూశారా, నేల కొత్తగా తవ్వినట్టనిపిస్తోంది కదూ!" అన్నాడు.

ప్రొఫెసర్ శరశ్చంద్ర కార్తీక్ మాటల్ని బలపరుస్తూ, "యూ ఆర్ రైట్! సాధారణంగా యిక్కడికి మానవమాత్రుడు యెవరూ రారు. మనం కూడా రెండు బేచ్‌లు మాత్రం యిక్కడికి ఫీల్డు ట్రయినింగ్ నిమిత్తం గతంలో తీసుకొచ్చాం. ఎవరు తవ్వి వుంటారు చెప్మా....?"

అన్నాడు.

"హేండ్సప్! ఎవరూ కదలొద్దు!" అన్న మాటలు వినపడి అందరూ ఉలిక్కిపడి చూశారు. ఎదురుగా వున్న భయంకర వ్యక్తులను చూస్తూనే అందరూ చేష్టలు దక్కి చిత్తరువుల్లా నిలబడిపోయారు!

*                    *                    *

ఎదురుగా యమకింకరుల్లా వున్న నలుగురు వ్యక్తులు రివాల్వర్స్ తమకు గురిచేసి నిల్చున్నారు.

"ఎవరు మీరు? ఇక్కడికెందుకొచ్చారు?" కర్కశంగా ధ్వనించింది రాక్సన్ గొంతు.

ప్రొఫెసర్ శరశ్చంద్ర తేరుకుని, "మీరెవరో మాకు తెలీదు. మామీద యెందుకు తుపాకులు గురి చేశారో అంతకన్న తెలీదు. మేము హానిచేసేవాళ్ళం కాదు. శత్రువులం అసలే కాదు. దయచేసి ఆ పిస్తోళ్ళు దించండి, వివరంగా చెపుతాను" అన్నాడు.

"ఏం, యిప్పుడయితే చెప్పలేవా? ఫరవాలేదు చెప్పు. మీరు శత్రువులు కాదని మాకు పూర్తి నమ్మకం కలిగితే మీ కెలాంటి హాని కలుగ జెయ్యం!" అన్నాడు నికోలస్.

జావర్, కోమన్ క్రూరంగా చూస్తున్నారు వారి వంక.

"సరే, చెపుతాను. మేము యూనివర్శిటీ నుంచి వస్తున్నాం. జియాలజీ పోస్టు గ్రాడ్యుయేటు స్టూడెంట్సు వీళ్ళు అయిదుగురు. నేను ప్రొఫెసర్ని. వీళ్ళను ఫీల్డు డెమాన్స్ట్రేషన్ కోసం యిక్కడికి తీసుకొచ్చాను. అది వీళ్ళ కోర్సులో ఓ భాగం" అన్నాడు

ప్రొఫెసర్.

"కింద యేదో వేన్ కూడా వున్నట్టుంది. ఏమున్నాయి ఆ వేన్ లో?" రాక్సన్ అడిగాడు.

"ఏమున్నాయి, సర్వే మెటీరియల్. డ్రిల్లింగ్ మెషీను, స్కేల్సు, టేపులు వగయిరా. ఈ ఏరియాలో మా స్టూడెంట్సుకి కావలసిన పూర్తి యిన్ఫర్మేషన్ దొరుకుతుందని, రాళ్ళు మట్టి నమూనాలు సేకరించుకొని వెళ్ళొచ్చునని వచ్చాము. అంతే!" అన్నాడు శరశ్చంద్ర.

"ఎన్నాళ్ళుంటా రిక్కడ?"

"ఏ రోజుకా రోజు మేము బసచేసిన చింతపల్లె గ్రామం వెళ్ళిపోతుంటాం. దాదాపు పదిరోజుల ట్రయినింగ్ ప్రోగ్రాం! ఈలోపలే మా పని పూర్తయితే ముందుగానే వెళ్ళిపోతాం!"

రాక్సన్ కళ్ళతోనే నికోలస్‌కి యేవో సందేశాలు పంపాడు.

"మీ రెవరో తెలుసుకోవచ్చా....?" అన్నాడు శరశ్చంద్ర.

"ఆ విషయం మీకు అనవసరం. మేము మీకేం అపకారం చెయ్యం. అయితే మీ సంగతి తేలేవరకు మీరు మా అతిథులుగా వుండాలి, అంతే!" అన్నాడు రాక్సన్.

"అతిథులుగానా? అంటే...." శరశ్చంద్ర ఆశ్చర్యంగా అన్నాడు.

"అదే, యిక్కడ మా స్థావరంలోనే మీకు బస

యేర్పాటవుతుంది. అక్కడ మా కనుసన్నల్లో మెలగాలి. మేము చెప్పేవరకు అక్కడే నుంచి మీరు వెళ్ళటానికి వీల్లేదు! అంతే!"

"అంటే మీ బందీలుగా వుండాలా? ఎందుకు?" అశ్వినికి అసలే కోపం జాస్తి.

"నో, యంగ్ మాన్, అంత పెద్ద మాటలు వాడనవసరంలేదు. మీ భోజన సదుపాయాలు, మీ అవసరాలు అన్నీ మేము చూస్తాం! మీరు నిజంగా స్టూడెంట్సు అని మాకు నమ్మకం కలిగేవరకు మిమ్మల్ని అట్టే పెడతాం! తర్వాత క్షేమంగా పంపేస్తాం!"

"మేము నిజంగా స్టూడెంట్సే. అబద్దం చెప్పాల్సిన అగత్యం మాకేముంది? అదుగో ఆయన మా ప్రొఫెసర్ శ్రీ శరశ్చంద్ర. నా పేరు కార్తీక్. ఇప్పుడు మీతో మాట్లాడిన అతను అశ్విని. ఈ స్టూడెంటు పేరు అభిలాష్, అతని పేరు హిమవంత్. ఈమె మిస్ దీప్తి. ఇప్పుడే యెవరయినా కిందికిపోయి మా వేన్ దగ్గరికి వెళ్ళి చూస్తే మీకు మా వివరాలు తెలిపే ఫైల్స్, పుస్తకాలు, మా సర్వే మెటీరియల్ మొత్తం కనిపిస్తాయి. ప్లీజ్ గో అండ్ వెరిఫై!" అన్నాడు కార్తీక్.

"బాగా గుర్తుచేశావు. కింద మీ వాడింకొకడు వుండిపోయాడు కదూ, అతన్ని కూడా యిక్కడికి రప్పిస్తాం. అందర్నూ ఒకేచోట వుండటం మర్యాద!" అంటూ నికోలస్ జావర్ కి సైగ చేశాడు.

"ఇంతకీ మీరెవరో చెప్పనేలేదు. మా గురించి పూర్తి వివరాలు చెప్పినప్పుడు మీ గురించి పరిచయం చేసుకోవటం కనీస మర్యాద!" అన్నాడు శరశ్చంద్ర.

"మాతో రండి, చెబుతాం!" అన్నాడు రాక్సన్ ముందుకు దారితీస్తూ.

నికోలస్, గోమన్ రివాల్వర్లు యింకా తమకే గురి పెట్టి వుండటం చూసి శరశ్చంద్ర, "మేము పూర్తిగా నిరాయుధులం! మావల్ల మీ కెలాంటి హానీ లేదని మీ ఈసరికే గ్రహించి వుంటారు. అలాంటపుడు పిస్తోళ్ళు యింకా మాకు గురి పెట్టి వుంచాల్సిన పనే లేదు!" అన్నాడు.

"ఆ పిస్తోళ్ళు ఎలాగూ మీమీద ప్రయోగించటంలేదు. మీరు మంచివాళ్ళని మాకు తెలుసు. కానీ ముందుజాగ్రత్త కోసం అవి మా చేతుల్లో వుండకతప్పదు. మీ స్టూడెంట్సు కొంత చురుకుపాలెక్కువ వున్నవాళ్ళులా కన్పిస్తున్నారు. మా కెందుకు అతిథులుగా వుండాలని తిరగబడితే పడొచ్చు సరదాగా! అందుకని...." అన్నాడు రాక్సన్ తమ గుహలోకి అడుగు పెడుతూ.

అందరూ గుహ దగ్గరకు చేరారు.

రాక్సన్ వెనక్కి తిరిగి అందర్నీ ఓసారి చూసి, "వెల్ కం టు అవర్ గెస్ట్స్!" అన్నాడు తలవంచి అభివాదం చేస్తూన్న ధోరణిలో.

కార్తీక్ ప్రొఫెసర్ వంక చూశాడు. హిమవంత్ చెవిలో గుసగుసలాడాడు అశ్విని "వీళ్ళ రాక్షసమర్యాద అడుక్కుతిన్నట్టే వుంది!" అంటూ.

నికోలస్ కేదో అస్పష్టంగా వినిపించి, "ఏమిటి మై డియర్ ఫ్రెండ్ యేదో అంటున్నట్టున్నావు!" అన్నాడు అశ్వినితో.

"అబ్బే, అతిథి మర్యాదలో మీకు సాటి యెవరూ లేరంటున్నాను!" అన్నాడు అశ్విని.

అతని మాటల్లోని వ్యంగ్యం అర్థం చేసుకున్నట్టు రాక్సన్ పెద్దగా నవ్వాడు. "సారీ ఫ్రెండ్స్! మీ కిది బందిఖానాలా వుంటుందని నాకు తెలుసు! మిమ్మల్ని తప్పనిసరి పరిస్థితుల్లో యిక్కడ బంధించాల్సి వస్తోంది! మీ రేమీ అనుకోనంటే మీ చేతులు వెనక్కి కట్టి వుంచుతాం, అంతే! అదయినా ముందు జాగ్రత్తకోసమే. అంతే!" అన్నాడు.

అందరూ బలవంతాన కోపాన్ని నిగ్రహించుకుంటున్నట్టు రాక్సన్ గమనించకపోలేదు.

"ప్రొఫెసర్ సాబ్, క్షమించాలి! మనుషుల ప్రాణాలు రెయింలో అవసరమైతే తప్ప నేను తియ్యను. మా మనుషులు కూడా అంతే! మీ ప్రాణాలు తీయటం మాకు నిమిషాలమీద పని! కాని అది మా కిష్టంలేదు. మీవల్ల మాకు ఏ విధమైన ఆటంకంలేదని మీరు మీ ప్రవర్తనవల్ల రుజావు చేసుకోవాలి. మాకు అభ్యంతరకరంగా మీ ప్రవర్తన వున్నదని మాకే మాత్రం అనుమానం వచ్చినా క్షణాలమీద మిమ్మల్నందర్నీ యిక్కడ పూడ్చివేయగలం! సో బీ ఫ్రెండ్లీ అండ్ పేషెంట్లీ!" అన్నాడు రాక్సన్.

ఈలోపల రోమన్ నికోలస్ ఒక్కొక్కర్ని బంధిస్తూ వచ్చారు. ప్రొఫెసర్ యెంత చెప్పినా వాళ్ళు వినిపించుకునే స్థితిలో లేరు. ఓ పెద్ద తాడును తెచ్చి ఒకరి చేతుల నుంచి మరొకరి చేతులమీదుగా నలుగురికీ ఒకే బంధనం

లాగా కట్టి, తాడు చివర అక్కడున్న ఓ బండకు చుట్టారు.

"మిస్ దీప్తిని, ప్రొఫెసర్ గార్ని బంధించవద్దు!" అన్నాడు రాక్సన్.

నికోలస్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"ప్రొఫెసర్ గారు పెద్దమనిషి. గౌరవనీయులు ఆయన్ని బంధించి అవమానించవద్దు. పోతే మిస్ దీప్తి ఆడపిల్ల. అబలను, అసహాయురాలను బంధించటం మనకు అవమానకరం! ఆమెకు చిన్నతనం. అందుకని వారిద్దర్నీ ఫ్రీగా మూవ్ కానివ్వండి!" అన్నాడు రాక్సన్.

అశ్విని హిమవంత్ ఉక్రోషాన్ని, కోపాన్ని బలవంతాన గుటకలు మింగుతున్నారు.

రాక్సన్ వాళ్ళదగ్గరగా వచ్చి, "భోజనం చేసేందుకు, తక్కిన అవసరమైన పనులకు మిమ్మల్ని ఒకరొకరిగా బంధనాలు విప్పి రిలీజ్ చేస్తాం. ఇలా బంధించాల్సి వచ్చినందుకు నాకు చాలా బాధగా వుంది. కాని తప్పలేదు!" అన్నాడు.

ప్రొఫెసర్ శరశ్చంద్ర అతని మాటల్ని ఎటూ అర్థం చేసుకోలేకపోతున్నాడు. అలాంటప్పుడు తమని బంధించటం దేనికి? తమవల్ల వాళ్ళకెలాంటి అపకారం లేదని వాళ్ళకూ తెలుసు. ఇంకా తమగురించి నిర్ధారణ చేసుకోవలసిందేముంది? వాళ్ళు తలపెట్టిన పనేమిటి?

"ఎందుకు సార్, పిలిపించారుట?" అంటూ డ్రైవర్ భరణి, అతని వెనుక జావర్ లోనికొచ్చారు.

భరణి పరిస్థితిని వెంటనే అర్థం చేసుకుని మెరుపుదాడి

చేయబోయాడు. కాని వెనుక జావర్ చేతిలోని పిస్తోలు అతని వెన్నును తాకింది.

"మిస్టర్, అనవసరంగా హైరానపడకు. మీ వాళ్ళు మాతో ఒప్పందాని కొచ్చేశారు. నువ్వుకూడా వాళ్ళ దారిన నడవటం పెద్దమనిషి తరహాగా వుంటుంది!" అన్నాడు రాక్సన్.

నికోలస్ నవ్వుతూ దగ్గరకొచ్చి భగణినికూడా చేతులు బంధించి, తాటితో కట్టేశాడు. మళ్ళీ తాడు చివరను బండకి బిగించాడు.

"ప్రొఫెసర్ మా పరిచయాల గురించి అడిగారు కదూ! చెప్తాను వినండి. నా పేరు రవి! ఇతని పేరు నాథ్, యితను జాన్, యితను రామ్!" అంటూ వరసగా నికోలస్‌ని, జావర్‌ని, రోమన్‌ని చూపించాడు.

"ఇకపోతే, యిక్కడ మా పనేమిటో చెప్పాలిన వుంది! ఒకప్పుడు ఈ ప్రాంతాన్ని ఓ చక్రవర్తి పరిపాలించాడు. ఆయన పేరు కళ్యాణవర్మ!

"కళ్యాణవర్మ హయంలో ఎన్నో వేల కోట్ల రూపాయల విలువచేసే బంగారు ఆభరణాలు, బంగారు నాణేలు యీ కొండల్లో తవ్వి పాతాడని ఆ నిధికోసం కొంత మంది ప్రయత్నించి విఫలమయ్యారనీ, ప్రాణాలుకూడా కోల్పోయారనీ లోకానికి తెలియదుగాని, మాకు తెలుసు! అందుకే మేము బయల్దేరి వచ్చాం. మా దగ్గర యీ నిధి ప్లాను, ఆ నిధి పాతబడ్డ ప్రదేశం గురించిన వివరాలు వున్నాయి.

మేము నాలుగు రోజుల నించీ తవ్వకాలు సాగిస్తు

న్నాం. ఇప్పటివరకూ ఎలాంటి ఆధారమూ దొరకలేదు. కాని త్వరలోనే మా ప్రయత్నాలు ఫలించి నిధి చేజిక్కించుకోగలమన్న ధైర్యం, ఆత్మవిశ్వాసం మాకున్నాయి. ఈ నిధి మా హస్తగతం అయిన మరుక్షణం మేం యీ చోటు వదిలిపోతాం! మేము పోయిన వెంటనే మీరు హాయిగా మీ స్వస్థలాలకే పోతారో, మీ సర్వే చూసుకుని వెళ్తారో మా కనవసరం! అంతదాకా మీకీ బంధనాలు తప్పవు!" అని ముగించాడు రాక్సన్!

అతను చెప్పిన విషయాలు వింటూ అందరూ శిలా ప్రతిమల్లా చేష్టలుదక్కి వుండిపోయారు. కొద్ది క్షణాలు యెవరి నోటివెంటా మాటలు రాలేదు. జనావాస ప్రాంతానికి దూరంగా వున్న యీ కొండల వెనక ఇంత నిగూఢ రహస్యం దాగివుందా? ఎవరికీ రాక్సన్ ఉరఫ్ రవి చెపుతున్న మాటలు నమ్మబుద్ధి కావటంలేదు. కాని నిజం కాకపోతే, యీ తవ్వకాలు దేనికి? తమని యిలా బంధించాల్సిన అవసరం వాళ్ళకేముంది?

ప్రొఫెసర్, రాక్సన్ చెప్పిన విషయాల్ని తనకున్న అనుభవంతోను, పరిజ్ఞానంతోను ఆత్మావలోకనం చేసుకుంటున్నాడు. ఒకప్పుడు యీ ప్రాంతం రాజుల పాలనలో వున్న విషయం చరిత్ర చెపుతోంది. అయితే యిక్కడ నిధి పాతిన విషయం యెవరికీ తెలీదు ఈ రవి ముఠాకెలా తెలుసు?

"నేను చెప్పిన సంగతులు మీరెవరూ నమ్మటంలేదని నాకు మీ ముఖాలు చూస్తూంటే తెలుస్తోంది. అందుకే యింతవరకు యీ నిధి యెవరికీ చెందకుండా భూమిలో

మూలుగుతోంది. అది త్వరలో మా పాలపడబోతోంది! అందరికీ తెలిసుంటే యెప్పుడో ఎవడి చేతిలోనో పడి పోయి వుండేది!" అన్నాడు రాక్సన్.

"అయితే ఎన్నాళ్ళు మాకీ చెర?" అశ్విని అడిగాడు.

రాక్సన్ అతని వంక నవ్వుతూ చూసి, "నీకు మరీ సహనం తక్కువలా వుంది బ్రదర్! చెప్పానుకదా, ఎంత తొందరగా మా పని పూర్తయితే అంత తొందరగా మిమ్మల్ని వదిలేస్తాను. ఆ తర్వాత మీ దారి మీది, మా దారి మాది! అది కొన్ని రోజులు పట్టొచ్చు, వారాలు పట్టొచ్చు! మరో నలభై ఎనిమిది గంటల్లో తేలిపోవచ్చు. ఏం చెప్పగలం? మీరు జియాలజీ స్టూడెంట్సు కదా! గనుల గురించి మట్టినయినా సేకరించి అక్కడ ఏ ఖనిజం వుందో చెప్పగలరనుకుంటాను. ఇక్కడి మట్టిని పరీక్షించి నిధి ఎక్కడుందో చెప్పగలరా?" అన్నాడు.

ప్రొఫెసర్ శరశ్చంద్ర, "అది అసంభవం! గనుల గురించి అయితే చెప్పవచ్చు. అదయినా సాయిల్ టెస్టులు యెన్నో చెయ్యాలి. కెమికల్ యెనాలిసిస్‌కి పంపాలి. లాబ్‌లో పరీక్షలు చెయ్యాలి. అది గనుల విషయం తెలుసుకోవలసి వచ్చినపుడు! కాని, యిది నిధి అని చెప్తున్నారు కదా! నిధి పాతిపెట్టబడివుంటే దాని గుర్తులు తవ్వే మట్టిలో యెలా దొరుకుతాయి? ప్లాన్‌లో ఇచ్చిన ఆధారాల ప్రకారం ఓపిగ్గా తవ్వకుని చూడడమే!" అన్నాడు.

ఆయనకు రవిగా పరిచయమైన రాక్సన్ మీద, అతని

ముఠామీద చాలా కోపంగా వుంది. వాళ్ళు సంఘ విద్రోహశక్తులు! ప్రభుత్వాన్ని మోసగించి యిక్కడ అక్రమంగా నిధికోసం తవ్వకాలు జరుపుతున్నారు. ఆ పనిలో అడ్డువచ్చిన వాళ్ళను నిర్దాక్షిణ్యంగా చంపి పారేస్తారు.

కాని ఎందుకో తమని చంపటానికి వీళ్ళు సుముఖంగా లేరు. బహుశా తమవల్ల ప్రమాదంలేదని వాళ్ళకు నమ్మకం కలగటంవల్ల అలక్ష్యంగా వదిలేస్తున్నారు. ఆ కోణంలో ఆలోచించిచూస్తే రవి మీద ఆయనకు సదభిప్రాయం కలుగుతోంది. తనని బంధించకుండా ఫ్రీగా వదలటం కూడా ఉచ్ఛనీచాలు ఆలోచించే వాళ్ళుండటం అరుదు.

హిమవంత్ రాక్సన్ వంక సూటిగా చూసి, "మీ పని అయ్యాక మమ్మల్ని వదిలేస్తారు సరే, ఆ తర్వాత మీ గురించి మేము లోకానికి చెప్పమని గ్యారంటీ ఏమిటి?" అన్నాడు.

రాక్సన్ నవ్వి, "ఆ తర్వాత యీ లోకమంతా దండెత్తి వచ్చినా మాకేం నష్టం? నిధి మా చేతికి చిక్కాక నే కదా మిమ్మల్ని విడిచిపెట్టేది! మీరు యీ లోకానికి చెప్పేలోపల మేం యీ దేశంలోనే వుండం! మమ్మల్ని పట్టుకోవటం బ్రహ్మతరం కూడా కాదు!" అన్నాడు.

"దట్సాల్ రైట్! మీకేం చెయ్యదల్చుకున్నారో అలా చెయ్యండి! మేము మీ పనులకు ఎట్టి పరిస్థితుల్లోను అడ్డురాము! యింకా మీ పని తొందరగా తేలాలంటే మేం కూడా సేల తవ్వి పెడతాం. కావాలంటే మా

సర్వీసెస్ కూడా ఉపయోగించుకోవచ్చు!" అన్నాడు ప్రొఫెసర్ ఒక నిశ్చయానికొస్తూ.

ప్రొఫెసర్ మాటలతో రాక్సన్ బృందం ముఖాలు వికసించాయి.

రాక్సన్ వెంటనే, "థాంక్యూ మిస్టర్ ప్రొఫెసర్! మీకంత శ్రమిస్తామా? మీరు మా విషయాల్లో జోక్యం కలగజేసుకోకుండా వుండటమే మీరు మాకు చెయ్యగల సహాయం! మాక్కావలసింది మీ కోపరేషన్, అంతే! మాకు యిక్కడ వున్నన్ని రోజులు మీ కేలో టూ రానివ్వం, అందుకు నాదీ హామీ!" అన్నాడు.

హిమవంత్, అశ్విని యిబ్బందిగా చూశారు ప్రొఫెసర్ వంక. కార్తీక్, అభిలాష్ సాలోచనగా చూశారు. దీప్తి నిర్లిప్తంగా చూస్తోంది. క్రూరమృగాల్లాంటి ఆ మనుషుల ప్రవర్తన ఎలా అంచనా వేసుకోవాలో ఆమె వూహకందటంలేదు. ఆమె మనసులో చెలరేగుతున్న సంక్షోభం భాష కందనిది!

ప్రొఫెసర్ శరశ్చంద్ర అందరివంకా ఓదార్పుగా చూశాడు.

రాక్సన్ చెప్పిన ప్రతిపాదన అంగీకరించటం మినహా తాము చేయగలిగిందేమీ లేదు. తిరగబడ్డా, ప్రాణాలు పోగొట్టుకోవటం తప్ప అక్కడ్నుంచి బయటపడే అవకాశాలు చాలా తక్కువ! అందుకే రాక్సన్ వాళ్ళు తెలివిగా తమని ఒకరి కొకరికి బంధాలు వేసేశారు!

• • •

రాత్రి పన్నెండు గంటల సమయంలో అకస్మాత్తుగా

మెలకువ వచ్చింది దీప్తికి. అప్పటికే అందరూ మేలుకునే వున్నారు. యెవరికీ నిద్ర రాలేదు. తమలో తాము ఫ్రీగా మాట్లాడుకోవటానిక్కూడా అవకాశమివ్వలేదు వాళ్లు! తమను వేయి కళ్ళతో కాపలా కాస్తున్నారు.

ఎవరి మటుకు వాళ్ళు రాక్సన్ బృందం ఏదో యింత పెడితే తిన్నామనిపించుకుని, ఉన్నచోటనే నడుములు వాల్చారు. అందరికీ కలత నిద్ర అప్పుడే పట్టినట్టుంది. ప్రొఫెసర్, దీప్తికి మాత్రం పక్క గుడ్డలు, చాపలు యిచ్చారు వాళ్ళు! అలాగే మేను వాల్చారు.

తనకి మెలకువ రావటానికి కారణం వెంటనే బోధ పడింది దీప్తికి. నికోలస్ తనమీద దాడిచేయబోతున్నాడని అర్థమయిపోయిందామెకు.

చటుక్కున అతన్ని చేతుల్తో జాట్టుపట్టి తోసేసింది. అతను మళ్ళీ చువ్వలా వంగి ఆమెమీద పడ్డాడు. అంత వరకూ దూరంగా వున్న జావర్, రోమన్‌లు కూడా దగ్గరకొచ్చి, నికోలస్ పనిలో సాయపడ్డారు. ఆమె చేతులు రెండూ వెనక్కి మడిచి పట్టుకున్నాడు జావర్. రోమన్ ఆమె కాళ్ళు పట్టుకున్నాడు.

అప్పటికే దీప్తి జాకెట్టు, చీర స్థానభ్రంశమై వున్నాయి. ఆమె శరీరం దాదాపు బహిరంగంగానే కనిపిస్తోంది. నగ్నంగా ఆమె అందాన్ని ఆస్వాదిస్తూనే ఆమెని తన స్వాధీనంలోకి తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు నికోలస్.

కొద్ది క్షణాల్లో ఆమె శీలం మంటగలిసిపోయుండేది! ఆమె కదలటానికి, అరవటానికి కూడా అవకాశమివ్వ

గుండా వాళ్ళు ముగ్గురు ఆమెని గట్టిగా పట్టుకున్నారు. గింజుకుంటోంది.

నికోలస్‌ని వున్నట్టుండి వెనకనుంచి యెవరో బలంగా తన్నారు. ఆ ఊపుకు గాల్లో లేచిపోయి గుహగోడకు కొట్టుకున్నాడు నికోలస్. తల చిట్లింది. నెత్తురు చిమ్మింది.

కోపోద్రేకంతో ఆ పక్కకు చూసిన నికోలస్‌కు ప్రొఫెసర్ శరశ్చంద్ర ప్రళయకాల రుద్రుడిలా కని పించాడు—కొవ్వొత్తుల గుడ్డి వెలుర్లో!

శరశ్చంద్ర జావర్‌ని, రోమన్‌కూడా ఈడ్చితన్నాడు. జావర్ చెంపలు రెండూ వాచిపోయాయి.

రాక్సన్ అంతదాకా నిద్రపోతున్నాడు. చటుక్కున లేచాడు. ఈ హడావిడి కొంతసేపటిదాకా అతనికి అవ గాహన కాలేదు. కాని, గుడ్డలు కట్టుకుంటూ కన్నీరు మున్నీరుగా విలపిస్తూన్న శ్రీప్రిని చూడగానే జరిగిం దేమిటో అతనికి తెలిసివచ్చింది.

"నికోలస్, ఏమిటి నువ్వు చేస్తున్న పని?" అని అరిచాడు రాక్సన్. కాని అప్పటికే ఆలస్యమయి పోయింది.

నికోలస్ రివాల్వర్‌నుంచి వచ్చిన గుండు ప్రొఫెసర్ గుండెల్లోంచి దూసుకుపోయింది. ఒకటి తర్వాత మరొకటి!

"హే రామ్!" అంటూ నేలకూలిపోయాడు ప్రొఫెసర్ శరశ్చంద్ర. ఆయన చుట్టూ నెత్తురు మడుగు కట్టింది.

రివాల్వర్ చప్పుళ్ళకి అందరూ ఉలిక్కిపడి లేచి

పోయారు. కొద్ది క్షణాలవరకు ఆ గుడి వెలుగుల్లో జరుగుతున్న దేమిటో యెవరికీ అర్థం కాలేదు.

ముందుగా వాళ్ళకు కనిపించిన దృశ్యం నెత్తుటి మడుగులో తమ ప్రొఫెసర్ కొట్టుకోవటం! అదీ కొద్ది క్షణాలే! తన స్టూడెంట్సుకి మాటమాత్రమైనా యేమీ చెప్పకుండానే ప్రొఫెసర్ మరో లోకాన్ని అన్వేషించుకుంటూ వెళ్ళిపోయాడు.

“మిస్టర్ రవీ! యేమిటీ ఘోరం? యెందుకు మా ప్రొఫెసర్ గార్ని చంపారు? మీ మాట ప్రకారం మీ బందీలుగా అంగీకరించాక యిలా చెయ్యటం దారుణం, రాక్షసత్వం! అమానుషత్వం!” అరిచాడు కార్తీక్, అతని కంఠం దుఃఖంతో బొంగురుపోయింది.

అందరి కళ్ళలోను కన్నీటి జలపాతాలు ఉబికి వస్తున్నాయి. తమ ప్రొఫెసర్, అంతదాకా చలాకీగా తమ కంటె చిన్నవాడిలాగా కేరింతలు కొడుతూ తమతో కొండ యెక్కి, తమ క్షేమంకోసం దొంగల ముఠా చెప్పిందానికి తలవొగ్గి చివరికి శవంగా తమకళ్ళముందే మారిపోవటం చూసి వాళ్ళ గుండెలు వేదనతో భారమయ్యాయి. ప్రతీకార వాంఛతో అందరి రక్తం సలసల మరిగింది.

“సారీ ఫ్రెండ్స్! అనుకోకుండా మా సాథ్ తొందరపడ్డాడు. అతని తరఫున నేను క్షమాపణ చెప్పుకుంటున్నాను. ప్రొఫెసర్ గారి మరణానికి నేను చాలా చింతిస్తున్నాను. అనుకోని ఈ సంఘటన మీ మనసుల్లో మాపట్ల ద్వేషాగ్నిని రగిల్చి వుండొచ్చు. అదంతా మరచి

పోండి. మనం స్నేహభావంతో సామరస్యంతో గడుపుదాం. ఇకపై మీ కెవరికీ యెలాంటి హాని జరక్కుండా నేను చూసుకుంటాను" రాక్సన్ కంఠంలో నిజాయితీ, వేడికోలు ధ్వనించాయి.

"అసలు ప్రొఫెసర్ గార్ని యెందుకు కాల్చారు? అది చెప్పమంటు!" అశ్విని కోపంతో అరిచాడు.

"మీ అందరికీ సంజాయిషీ యిచ్చుకోవలసిన అవసరం మాకు లేదు. మెదలకుండా పడున్నారా సరే, లేకపోతే అందర్నీ పిట్టల్ని కాల్చినట్టు కాల్చి పారేస్తాను" రివాల్వర్ గురిగా పట్టుకుని హెచ్చరించాడు నికోలస్.

దీప్తిలో ఆవేశం పెల్లుబికింది. భద్రకాళిలా అతని మీద విరుచుకుపడి ఆ చెంపా యీ చెంపా వాయించింది.

"దుర్మార్గుడా! నా మానాన్ని హరించాలనుకున్నావా? నీకు ఒంటరి ఆడది కనిపిస్తే ఒళ్ళు పొగర్లు కమ్ముతాయా? ఆశ్రయమిచ్చినట్టే యిచ్చి అత్యాచారం చేసే నీలాంటి పేడిగాళ్ళను ఉప్పుపాతర వెయ్యాలి!" అన్నది దీప్తి ఆదిశక్తిలా.

ఆమె కళ్ళనుంచి విస్ఫులింగాలు రాలుతున్నాయా అనిపించింది. అందరికీ కారణం బోధపడింది. తాము నిద్రల్లో ఉండగా ఆమెపై జరిగిన అత్యాచారం అందరి నరాల్లోను ప్రతీకార జ్వాలను మరింత ప్రజ్వరిల్ల చేసింది. ఆమె శీలాన్ని కాపాడటానికి తమ గురువుగారు చేసిన ప్రాణ త్యాగం తలచుకోగానే అందరికీ కళ్ళు మళ్ళీ సజలాలయ్యాయి. రాక్సన్ బృందాన్ని ప్రాణాలతో

వదలకూడదన్న నిశ్చయం బలపడింది, అందరి మనసుల లోను.

కార్తీక్ బంధనాలు వదిలించుకునే అవకాశంకోసం చూస్తున్నాడు. దీప్తి అది గమనించింది.

నికోలస్ దీప్తిచేత చెంప దెబ్బలు తిని పళ్ళు పటపట కొరుకుతున్నాడు. అతని చేతిలోని రివాల్వర్ ఏ క్షణంలో నైనా మళ్ళీ గర్జించేలా వుంది. రోమన్, జావర్ కూడా రివాల్వర్లు పట్టుకుని సిద్ధంగా వున్నారు.

రాక్సన్ ఒక్కడే వివేకంతో వ్యవహరిస్తున్నాడు. సామరస్య వాతావరణం కల్పించటానికి అవస్థపడుతున్నట్టు కనిపించింది అతని ధోరణి చూసినవాళ్ళకి. తన వాళ్ళని శాంతపర్చటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

ఆ అదను చూసి దీప్తి బండకు కట్టిన తాడు నెమ్మదిగా విప్పేసింది. కార్తీక్ బంధనాలనుంచి తన చేతుల్ని అతికష్టంమీద తప్పించుకున్నాడు. కొవ్వొత్తుల వెలుగు అంతంత మాత్రంగా వుంది!

కార్తీక్ తన పక్కనున్న అభిలాష్ చేతికట్లను వదిలించాడు. అభిలాష్ హిమవంత్ ని, హిమవంత్ అశ్వినిని, అతను డ్రయివర్ భరణిని వరసగా బంధవిముక్తుల్ని చేశారు. ఇదంతా చాలా గుంభనగా క్షణాలలో జరిగి పోయింది.

రాక్సన్ అనుచరులు ఇదేదీ గమనించటంలేదు. తమ నాయకుడి మాటలు వింటూ ఏదో గొణుగుతున్నారు.

కార్తీక్ చుట్టూ పరికించి చూశాడు. తవ్వటానికి ఉపయోగించిన పలుగులు, గడ్డపారలు తనకి అందేటంత

దూరంలోనే వున్నాయి. వాటి సాయంతో వాళ్ళ నెగుర్కొవటం సాధ్యమా?

కార్తీక్ చకచక తన ఆలోచనను ఒకరివెంట మరొకరికి చెప్పేశాడు. దీప్తి ఏమాత్రం అవకాశమున్నా నికోలస్ చేతిలోని రివాల్వర్ ఎగరగొట్టాలని చూస్తోంది.

రాక్సన్ ఇంకా తన అనుచరులతో మంతనాలు సాగిస్తూనే వున్నాడు.

జావర్, రోమన్ రివాల్వర్లు పాంటు జేబుల్లో పెట్టేసుకున్నారు.

రోమన్ ఎలా గుర్తించాడో బండనుంచి తాడు జారి పడివుండటం చూశాడు. అటువైపు కదిలాడు. తమని గుర్తించాడని కార్తీక్ గమనించి "ఎటాక్!" అన్నాడు మెల్లగా.

కార్తీక్ మెరుపులా లేచాడు. అతనివెంట తక్కిన నలుగురు కూడా ఒక్కసారిగా లేచి నించున్నారు. క్షణాల్లో గడ్డపలుగుల్ని చేతుల్లోకి తీసుకున్నారు. జరగబోయేది ఊహించేలోపల నికోలస్ పొట్టలో బలంగా తన పలుగు దించేశాడు కార్తీక్. అదే క్షణంలో నికోలస్ చేతిలోని రివాల్వర్ లాఘవంగా అందుకుంది దీప్తి.

రాక్సన్ తేరుకుని కార్తీక్‌ని కాల్చబోయాడు. సమయానికి అతని చేతిలోని రివాల్వర్‌ను దీప్తి పేల్చిన బుల్లెట్ ఎగరగొట్టేసింది. ఆమె ఎన్.సి.సి. కేడెట్.

అప్పటికే జావర్, రోమన్ రివాల్వర్లు పేంటు జేబుల్లోంచి తీసేలోపల అశ్విని, అభిలాష్ వాళ్ళిద్దరి అంతూ

చూసేశారు. వాళ్ళ చేతుల్లోని గడ్డపలుగులు వాళ్ళిద్దరి వెచ్చటి రుధిరాన్ని రుచిచూశాయి.

రాక్సన్ ఆయుధం ఎగిరిపోవటంతో వూరుకోలేదు. చటుక్కున కిందనున్న గడ్డపారను అందుకున్నాడు. దాన్ని ధరణి క్షణాలమీద యెగరగొట్టేసి, రాక్సన్ గుండెల్లో గడ్డపలుగును నిలువునా దించేశాడు.

నలుగురు గుండాగులు రక్తం మడుగుల్లో గిలగిల కొట్టు కుంటున్నారు.

*　　　　*　　　　*

ఒక్కసారి శత్రుసంహారం జరిగిపోవటంతో తమ ప్రతీకార జ్వాల చల్లారింది అందరిలోను.

"పీడింకా చావలేదు, మొండి ప్రాణం!" అన్నది దీప్తి నికోలస్‌వంక చూస్తూ. అతనింకా కదులుతున్నాడు. దీప్తి అతని గుండెలగు గురి చూసి కాల్చేసింది.

నికోలస్ శరీరంలో కూడా చలనం పూర్తిగా ఆగిపోయింది.

"నీమీద అత్యాచారం చేయబోతున్నందుకు వాడు నీ చేతుల్లో చావటమే న్యాయం! అందుకే నీ గుండుదెబ్బ కోసం కొనప్రాణంతో మిగిలాడు" అన్నాడు అశ్విని, అతని ఆవేశం అప్పటికిగాని చల్లారలేదు.

అప్పుడు అందరి దృష్టి ప్రొఫెసర్ శరశ్చంద్రవైపు మళ్ళింది.

దీప్తి వంగి ఆయన పాదాలను కళ్ళకు హత్తుకుంది.

ఆయన తన మాన ప్రాణాన్నిల్ని కాపాడాడు! ఏం చేసి తను ఆ ఋణం తీర్చుకోగలుగుతుంది? కన్నీటితో ఆయన పాదాలను అభిషేకం చేసిందామె.

"ఆచార్యుడు తండ్రితో సమానం! ఈయన దీక్షపట్ల తన ధర్మాన్ని నెరవేర్చారు. మనకందరికీ మార్గదర్శకు లయ్యారు. ఆయనకు మన జోహార్లు....!" అన్నాడు కార్తీక్.

అందరు శరశ్చంద్ర పాదాలంటి నమస్కరించారు.

కార్తీక్ శరశ్చంద్ర శరీరాన్ని దహనపరుస్తే బావుం టుందని ప్రతిపాదించాడు. కాని ఆ అర్ధరాత్రి ఆ పని చేయటం భావ్యంగా వుండదని అందరికీ అనిపించింది. అప్పటికప్పుడే ఆయన శరీరాన్ని మోసుకుని వెళ్ళి అప్ప టికే సిద్ధంగా తీయబడి వున్న గోతుల్లో ఆయన్ను పది లంగా దించి, ఖననం చేశారు.

కొద్ది నిమిషాలు ప్రొఫెసర్ ఆత్మశాంతికి అందరు మౌనం పాటించారు.

"నిధులున్న చోట ధనపిశాచి బలి కోరుతుందం టారు, యిదేనేమో! చేతులారా మన ఆచార్యులవారిని యీ కొండల్లో మట్టి చేశాం!" కార్తీక్ మాటలకు అంద రికీ దుఃఖం పెల్లుబికింది.

"సార్, పదండి మన వేన్ దగ్గరికి పోదాం! తెల్లారే సరికి మనం మళ్ళాం చేసిన చింతపల్లె పోవచ్చును!" అన్నాడు డ్రయివర్ భరణి.

అప్పుడు తెల్లవారుఝాము నాలుగు గంటలయింది.

"ఈ రాత్రి సమయంలో కొండ దిగటానికే దాదాపు గంటపైగా పడుతుంది. కాస్త వెలుగొచ్చాక బయలుదేరితే మంచిది కదా!" అన్నాడు కార్తీక్ దీప్తిని దృష్టిలో పెట్టుకుని.

"కరెక్ట్! కాని యీ శవాల మధ్య జాగరణ చెయ్యాలంటే యెందుకో నా మనస్సంగీకరించటంలేదు" అన్నది దీప్తి బెంగగా.

ఆమె మనోస్థితిని అందరూ గుర్తించారు. ఆమె గుండె దిటవు చేసుకుని వ్యవహరించిన తీరు, చూపిన సాహసం అందరికీ అద్భుతంగా అనిపిస్తోంది.

"వీళ్ళ గుహలో టార్చిలైట్సున్నాయేమో తీసుకువస్తాను....!" అన్నాడు భరణి వెళ్ళటానికి తయారవుతూ.

"ఒక్కడివే యేం వెళ్తావు? నేనూ వస్తున్నాను" అంటూ అశ్విని తనూ బయల్దేరాడు.

అయిదు నిమిషాల్లో మూడు టార్చిలైట్సుతో యిద్దరు తిరిగొచ్చారు. చాలా శక్తివంతమయిన టార్చిలు! అందులో ఒకటి పెద్దసైజు సెర్చిలైటులా వుంది! తవ్వకాలు రాత్రిళ్ళు కూడా జరుపుకోవటానికి వీలుంటుందని అడుగు పొడవు, అరడుగు వెడల్పు వున్న ప్రత్యేకమయిన టార్చిలైటు వెంట తెచ్చుకున్నారు రాక్షస్ వాళ్ళు. దాన్ని పట్టుకోవటానికి హేండిలుంది. దీర్ఘ చతురస్రాకారపు అద్దముంది దానికి.

"గుడ్, ఈ ఒక్క టార్చి చాలు!...." అన్నాడు కార్తీక్.

టార్చి వెలుతుర్లో గుహలు వరసగా కనిపిస్తున్నాయి. గుహల పక్కనుంచి కొండ దిగటానికి దారి మొదలవు తుంది. ముందుగా డ్రైవర్ భరణి దారితీశాడు.

అది సన్నటి దారి! ఒకరి వెంట మరొకరు క్యూలో నించున్న మాదిరి నడచి వెళ్ళాల్సినంత యిరుకుగా వుంది.

భరణి వెనక అభిలాష్, అతని వెనుక అశ్విని, ఆ వెనుక కార్తీక్, దీప్తి చివరగా హిమవంత్ నడుస్తు న్నారు. కొద్దిదూరం నడిచారు.

ఏదో చెబుతూ వెనక్కు తిరిగిన కార్తీక్‌కి దీప్తి కని పించలేదు. ఆమె వెనుక వుండాల్సిన హిమవంత్ కూడా లేదు!

* * *

"భరణీ, ఆగు!" అంటూ అరిచిన కార్తీక్ అరుపుని అందరూ ఉలిక్కిపడి చూశారు. తన చేతిలో వున్న టార్చిని వెనక్కు ఫోకస్ చేసి చూశాడు కార్తీక్. భరణి చేతిలో హేండిల్ టార్చి, అశ్విని చేతిలో మరో టార్చి వున్నాయి.

వెనక ఎక్కడా వాళ్ళిద్దరి జాడా లేదు. భరణి కంగారుగా వాళ్ళదగ్గరి కొచ్చాడు.

"ఇంతదాకా నా వెనుకే దీప్తి, హిమవంత్ నడుస్తు న్నారు. నేనేదో చెప్తుంటే వాళ్ళు కూడా ఏదో సమా ధానమిస్తూనే వున్నారు. అకస్మాత్తుగా ఎటు మాయ మయ్యారు!" అన్నాడు కార్తీక్.

అందరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. టార్చిలైట్ల

వెలుతురు టైగర్ హిల్స్ అంతటినీ ప్రకాశవంతం చేస్తున్నాయి. ఎక్కడా వారిద్దరి జాడా కనిపించ లేదు.

కార్తీక్ గుహలవైపు ఫోకస్ చేసి, "ఈ గుహలు దాటేలోపలే వాళ్ళు మాయమయ్యారు. నా అనుమానమే నిజమయితే వాళ్ళెక్కడి గుహల్లోనే యెక్కడో మాయమయి వుండాలి!" అన్నాడు.

"పదండి, వెతుకుదాం! ఆలస్యం చేస్తే, వాళ్ళిద్దరు యేలాంటి ప్రమాదంలో చిక్కుకుంటారో!" అన్నాడు అభిలాష్.

"ఈ గుహలన్నీ ఓసారి వెరిఫై చేసుకుందాం. అసలు యీ గుహల్లో జంతువులేమయినా వున్నాయేమో! వీళ్ళు గుహ పక్కగా వస్తుండగా లోపలికి లాక్కుపోయాయేమో!" అన్నాడు అశ్విని.

అందరి గుండెలు ఓ క్షణం ఆగి కొట్టుకున్నాయి.

"అయితే రెండు బేచ్‌లుగా యేర్పడి యీ గుహలన్నీ వెరిఫై చేద్దాం. నేను, అభిలాష్ ఓ జతగా వెళ్తాం. ధరణి, నువ్వు ఓ జతగా వెళ్ళండి!" అన్నాడు కార్తీక్ అశ్వినితో.

"అలాగే, మాకీ పెద్ద టార్చి చాలు! అభిలాష్, నువ్వీ టార్చి తీసుకో!" అంటూ అశ్విని తన దగ్గరున్న టార్చిలైటు అభిలాష్ కిచ్చాడు.

ఓ చివరినుంచి మొదలుపెట్టి గుహలు వెతకాలని నిర్ణయించుకున్నారు.

నాలుగు గుహలు వెతికారు. ఒకరి నొకరు కలుసుకొని మాట్లాడుకొన్నారు. దీప్తి, హిమవంత్‌ల జాడ

లేదు!

అయిదో గుహాలో కార్తీక్, అభిలాష్, ఆరో దానిలో భరణి, ఆశ్విని ప్రవేశించారు.

అభిలాష్, కార్తీక్ గుహాలో ప్రవేశిస్తూనే ముక్కులు మూసుకున్నారు. ఏదో దుర్గంధం ముక్కుపుటాలని అదరగొడుతోంది. అది గబ్బిలాల కంపు కాదు—అది తక్కిన గుహల్లో తమకు అనుభవమయింది.

రెండు టార్చిలైట్లు ఫోకస్ చేశారు. ఎదుట పొడవైన సొరంగంలా వున్నది. కనుచూపుమేరలో యేమీ కనిపించటంలేదు. గుహంతా జారుడుగా వుంది. నెమ్మదిగా అడుగుతీసి అడుగు వేస్తున్నారు.

"ఈ గుహాలో యేవో అడుగుజాడలు కనిపిస్తున్నాయి గమనించావా?" అన్నాడు గుస గుసగా కార్తీక్.

ఇసక అంటిన పాదాల గుర్తులు కనిపిస్తున్నాయి.

"ఎస్, యిందులో యెవరో మసలుతుంటారు, అనుమానం లేదు!"

"అయితే మనం ముందుకి వెళ్ళటం వివేకం అవుతుందా? భరణిని అశ్విని కూడా పిలుద్దామా?"

"ఇప్పుడు మళ్ళీ వెనక్కి వెళ్ళటం దేనికి? ఇంకాస్త ముందుకి పోయి చూద్దాం. అనుమానం తగిలితే వెనక్కి వెళ్ళి వాళ్ళను పిలుద్దాం!"

గుహ ఓ చివరికొచ్చేసింది. ఎక్కడా యెవరూ కనిపించ లేదు. ఇసకపాదాల గుర్తులు అక్కడితో ఆగిపోయాయి. గుహ పూర్తయిందనుకున్న సమయంలో కిందికి

మెట్లలాంటి రాళ్ళు కనిపించాయి.

అక్కడికి యక్కడినుంచో సన్నటి వెలుతురు పడు తోంది.

"దిగుదామా?" అన్నాడు అభిలాష్.

కార్తీక్ తలూపాడు.

ఇద్దరూ జాగ్రత్తగా మెట్లు దిగారు. కిందికి యేదో నేలమాళిగ లాంటిది వుందని యిద్దరికీ అర్థమయి పోయింది. మెట్లు అంతమై ఓ సమతల ప్రదేశానికి చేరు కున్నారు.

అక్కడి దృశ్యాన్ని చూసి నిశ్చేష్టులై అలాగే నిల్చుండిపోయారు కార్తీక్, అభిలాష్.

* * *

భరణి, అశ్విని గుహ బయటికి వచ్చారు. అయిదో గుహదగ్గిర నిలబడి కార్తీక్ అభిలాష్‌ల కోసం చూశారు.

"ఇంకా వాళ్ళు తిరిగిరాలేదు, లోపల యేమయినా జాడ దొరికిందేమో!" అన్నాడు అశ్విని.

మరో పదినిమిషాలు అక్కడే నించున్నారు.

"వాళ్ళు తాపీగా చూస్తున్నారేమో! మనం యేడో గుహలోకి వెళ్దామా?" అన్నాడు భరణి.

"అదెలా? ఇంతదాకా మనం నలుగురం కలిసి పరస్పర విషయం తెలియజేసుకున్న మీదటేకదా మరో గుహలోకి వెళ్తున్నాం! అదృష్టం బావుండి దీప్తి, హిమవంత్ యీ గుహలో మన వాళ్ళకి కనిపించారేమో!" అన్నాడు అశ్విని సాలోచనగా.

"అయితే, ఆలోచన దేనికి? పదండి లోనికి పోదాం!"

అన్నాడు భరణి ముందుకు దారితీస్తూ.

అశ్విని మెదడు చురుగ్గా పనిచేస్తోంది.

"భరణీ మనచేతుల్లో ఆయుధాలేవీ లేవు. దొంగల గుహలోనించి రివాల్వర్ తెచ్చుకోవలసింది" అన్నాడు.

భరణి అని "అవును సుమా, నాకా ఆలోచనే రాలేదు!" అన్నాడు.

"కార్తీక్, అభిలాష్ అలాగే వెళ్ళిపోయారు. ఎవరికీ ఆయుధాల ప్రసక్తి రానేలేదు!" అంటూ అశ్విని గుహల్ని లెక్కించబోయి ఆశ్చర్యంతో ఆగిపోయాడు.

అక్కడ ఎనిమిదో గుహలో రాక్షస్ వాళ్ళు తమని బంధించారు. కాని వరసలో అది తొమ్మిదో గుహలాగా కనిపిస్తోంది. మొత్తం పదిగుహాలున్నాయి!

"భరణీ, గుహాలు ఎన్ని అనుకున్నాం ముందు?" అన్నాడు.

"తొమ్మిది కొండలు తొమ్మిది గుహాలు అని అయ్యగారు చెప్పారుకదా, నేను లెక్కపెట్టలేదు!"

"గుహాలు ఇప్పుడు పది వున్నాయి. దొంగలున్న గుహ ఎనిమిదో గుహ— నేను నిన్న సాయంకాలం గుర్తుపెట్టుకున్నాను. కాని అది ఇప్పుడు తొమ్మిదో గుహలా కనిపిస్తోంది."

హేండిల్ టార్చితో భరణి లెక్కపెట్టాడు.

మొత్తం పదిగుహాలున్నాయి!"

"అర్థమయింది!" ఉత్సాహంగా అరిచాడు అశ్విని.

"ఏమిటది?"

"ఇదిగో కార్తీక్ అభిలాష్ లోపలికి వెళ్ళిన గుహని

చెక్క బండరాయి పలక!"

"అయితే....?"

"ఇది మామూలుగా తెరిచివుండే బండరాయి పలక కాదు! ఎవరో కావాలని మూసివుంచారీ గుహని! ఇప్పుడా పలక తెరుచుకుని ఏదో గుహని మన కళ్ళముందుంచింది."

భరణి ఆశ్చర్యంగా చూస్తున్నాడు. సుకుమారంగా వుండే యీ కుర్రాడిలో యింత తెలివెక్కడిది? అనుకుంటున్నాడు.

"సో, మన డీ పి హిమకంత్ ఖచ్చితంగా యీ గుహలోనే తప్పిపోయుంటారు. కార్తీక్, అభిలాష్ కూడా యీ గుహనించి బయటికి రాలేదు. అంటే, యీ గుహలో ఏదో విశేషం జరిగుండాలి!" అన్నాడు అశ్విని.

ఇద్దరు రాక్సన్ వాళ్ళ గుహలో ప్రవేశించారు. చకచక రివాల్వర్ వెతికాయి. మూడు కనిపించాయి. నాలుగోది దొరకలేదు.

"సరే, టైం వేస్టు చెయ్యొద్దు. పద, పోదాం. రౌండ్స్ వెతుక్కోవటాని క్కూడా టైంలేదు" అంటూ బయటికి పరుగెత్తాడు అశ్విని శవాల్ని తొక్కుకుంటూ.

భరణి అనుసరించాడు.

అయిదో గుహలో ప్రవేశించారు. ఇద్దరు రివాల్వర్లు చేత సిద్ధంగా వున్నారు.

"ఎలా ప్రయోగించాలో తెలుసు కదా!" అన్నాడు. అశ్విని రివాల్వర్ పొజిషన్ చూసుకుంటూ.

"తెలుసు సార్! నేను ఎస్సెల్సీ వరకు చదువుకున్నాను స్కూల్లో ఎన్.సి.సి.లో శిక్షణ పొందాను,

గుర్తుంది!” అన్నాడు భరణి.

ఇద్దరు ఆ గుహాలోని దుర్గంధాన్ని భరిస్తూ నడుస్తు న్నారు. ఇసుక పాదాల గుర్తులు కనిపిస్తున్నాయి.

గుహ అంతపైమెట్లు కనిపించాయి. నెమ్మదిగా దిగారు. సమతల ప్రదేశానికొచ్చారు.

“భరణీ, టార్చి ఆపెయ్య” అన్నాడు అశ్విని చిన్నగా.

ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి భరణికి ఒళ్ళు ఝలదరించింది. చటుక్కున టార్చి ఆర్పేశాడు. వెన్నున జరజరమని ఒణుకు పుట్టింది యిద్దరికీ!

  

ఎదురుగా నిలువెత్తు కాళి విగ్రహం భయంకరంగా నాలుక బయటకు చాపివుంది. ఎర్రటి సింధూరంతో విగ్రహాన్ని అలంకరించారు. ఆమె మెడలో కపాలాలు దండ గుచ్చి వేయబడి వున్నాయి. ఎర్రటి కాగడా వెలుగులో విగ్రహం మరింత ఎర్రగా కనిపించి చూపరుల గుండెని స్తంభింపచేసేలా వున్నది!

విగ్రహం కాళ్ళచెంత ఏవేవో ముగ్గులు వేయబడు న్నాయి. కాళ్ళ చేతుల ఎముకలతో, పుర్రెలతో ముగ్గు మీద అలంకరణ చేసినట్టు పేర్చబడున్నాయి. విగ్రహాం కాళ్ళచెంత నిడుపాటి కత్తి ఆ వెలుగులో తళతళ మెరు స్తోంది. కత్తికి కూడా సింధూరపు బొట్లు పెట్టబడు న్నాయి!

విగ్రహానికి అటు యిటు యిద్దరు వ్యక్తులు కూచుని అగ్ని రాజేసి అందులో ఏదో ద్రవం పోస్తున్నారు.

వాళ్ళిద్దరు ఒంటికి విబూది పూసుకున్నారు. నుదుట సింధూరపు బొట్లు పెట్టుకున్నారు. మొలచుట్టూ జింక చర్మాలు కట్టుకున్నారు.

సరిగ్గా విగ్రహానికి ముందు ఓ మాంత్రికుడు కూచుని వున్నాడు. అతని ముఖం విగ్రహానికి అభిముఖంగా వుంది. అతని వీపుభాగం కనిపిస్తోంది. అతని మెడచుట్టూ కపాలాల దండ కనిపిస్తోంది. ఒంటికి విబూదిపట్టీలు కనిపిస్తున్నాయి. మొలచుట్టూ జంతు చర్మమేదో కట్టుకుని వున్నాడు. అది తప్ప అతని ఒంటిమీద మరే అచ్ఛాదనా లేదు.

అతని పెదాలు మౌనంగా ఏదో ఉచ్చరిస్తున్నాయి!

విగ్రహానికి ఎడమపక్కగా పొడవాటి గుంజలకు దీప్తి, ఆమె పక్కగా హిమవంత్ పెడరెక్కలు విరిచి కట్టబడి వున్నారు. వాళ్ళ ముఖాలకు సింధూర బొట్లు పెట్టబడి వున్నాయి. విగ్రహానికి కుడిపక్కగా కార్తీక్, అభిలాష్ అదే పరిస్థితిలో వున్నారు. నలుగురు మొహాలలో ప్రేతకళ కనిపిస్తూంది. భయాందోళనలతో అటూ ఇటూ గింజుకుంటున్నారు.

దీప్తి దాదాపు అర్ధనగ్నంగా వుంది. ఆమె ఒంటిమీద బ్లౌజు లేదు. చీరను పసుపులో ముంచెత్తినట్టు పచ్చగా వుంది! మెడలో ఏవో కాయలు, పువ్వులు కట్టిన దండ వేశారు. అలాంటి దండనే హిమవంత్ మెళ్లో కూడా వేశారు. అతని షర్టు తీసేశారు. పాంటు ఒకటే వుంది శరీరాన్నంటుక్కుని.

అదేవిధంగా కార్తీక్‌ని, అభిలాష్‌ని అలంకరించారు.

మంత్రగాడు లేచి విగ్రహం దగ్గరికి వచ్చాడు. అతని నోటివెంట మంత్రఘోష తారస్థాయి నందుకున్నది. అతని అనుచరులుకూడా లేచి నిలబడ్డారు.

ముందుగా హిమవంత్‌ని బంధనాలు తప్పించి తీసుకు వచ్చారు.

విగ్రహం ముందు అతన్ని సాష్టాంగపడేలా చేశారు. అతని తలను అక్కడే వున్న వధ్యశిలమీదకు మధ్యగా వచ్చేలా పడుకోబెట్టారు.

హిమవంత్ మనసు నిశ్చలంగా వుంది! ఆ క్షణంతో తన జీవితం అంతమయి పోయిందనుకున్నాడు. చివరి సారిగా భగవంతుడ్ని మనసారా స్మరించుకొంటున్నాడు.

దీ పి, శారీక్, అభిలాష్ తమకి కూడా అదే స్థితి పట్టబోతున్నందుకు పుట్టెడు దుఃఖంతో అలాగే చూస్తూన్నారు! తమ సహాధ్యాయి తమ కళ్ళముందే అమానుషంగా బలైపోతున్నందుకు వాళ్ళందరికీ హృదయాలు వేదనతో బరువెక్కుతున్నాయి.

మంత్రగాడు దేవిపాదాల ముందున్న నిడుపాటి కత్తిని పైకి తీశాడు. కుడి చేతితో దాన్ని పట్టుకొన్నాడు.

మరుక్షణం కత్తి గాలిలో లేచింది. ఇంకో క్షణంలో హిమవంత్ తల మొండెం నుంచి వేరుపడేదే! ఇంతలో అశ్విని చేతిలోని రివాల్వర్ గర్జించింది.

బుల్లెట్ సరాసరి పోయి మంత్రగాడి చేతిని గాయపరిచింది. కత్తి ఖంగున నేలమీదపడి బ్రహ్మాండమయిన శబ్దాన్ని సృష్టించింది.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

మంత్రగాడు అదిరిపడ్డాడు. కింద వున్న ముంజేతి ఎముకను చేతిలోకి తీసుకున్నాడు. ఈలోపల భరణి ఒక్క అంగలో కార్తీక్, అభిలాష్‌ల దగ్గరకు పరుగెత్తి వాళ్ళ బంధాలు విప్పేశాడు. కార్తీక్‌కి మూడో రివాల్వర్ అందించాడు.

కార్తీక్ రివాల్వర్‌తో యిద్దరు అనుచరుల్లో ఒకడిని నేలకూల్చేశాడు. రెండోవాడు చటుక్కున కిందపడిన కత్తి నందుకుని బలంగా అడ్డొచ్చిన భరణి పొట్టలో దించేశాడు.

భరణి అనుకోని యీ దాడి నెదుర్కోవటానికి సిద్ధంగాలేడు. అమాంతం నేలకూలిపోయాడు. ఈలోపల అశ్విని ఆ అనుచరుడ్ని కాల్చేశాడు.

మంత్రగాడు చేతిలోని ఎముకను రెండుసార్లు గాల్లో ఆడించాడు. ఏదో ఉచ్చరించాడు.

గాల్లో సయ్‌మంటూ యేవేవో వింత వింత శబ్దాలు వినిపించాయి.

కార్తీక్‌కి పరిస్థితి అర్థమయిపోయింది. మంత్రగాడు తన మంత్రశక్తిని ప్రయోగించి, క్షుద్రదేవతల్ని ఆహ్వానిస్తున్నాడు. అవి అక్కడికి చేరుకుంటే ఇక మంత్రగాడ్ని ఎదుర్కొనే శక్తి తమకు ఉండదు! అతని శక్తి వెయ్యింతలవుతుంది.

కార్తీక్ నిర్దాక్షిణ్యంగా మంత్రగాడిని కాల్చబోయాడు కాని మేగజైన్‌లో గుళ్ళు అయిపోయాయి. బర్రున తిరిగిపోయింది.

సరిగ్గా అదే సమయంలో అశ్విని కూడా మంత్రగాడి మీద బుల్లెట్ ప్రయోగించబోయాడు. కాని చిత్రంగా అతని రివాల్వర్‌లో కూడా గుళ్ళు అయిపోయాయి. భరణి

దగ్గిరుండాల్సిన రివాల్వర్ యెక్కడో యెగిరి పడి పోయింది.

ఇక యెంతో సమయం లేదు. గాల్లో వింత శబ్దాల ఉధృతం పెరిగిపోతోంది. మంత్రగాడు నిశ్చలంగా మంత్రాలు జపిస్తూనే వున్నాడు. అశ్విని ఒక్క పరుగున దీప్తి, హిమవంత్ ల దగ్గరకు చేరాడు. రాళ్ళబంధనాలు విప్పేశాడు.

ఈలోపల అభిలాష్ మంత్రగాడి చేతిలోని ఎముక వైపు దీక్షగా చూసి. దాన్ని గాల్లో ఆడించి అతను మంత్రశక్తుల్ని ఆహ్వానిస్తూన్నట్టు కనిపెట్టాడు. అతని చేతిలో ఆ ఎముక వుండగా తామెవరూ అతన్నేమీ చెయ్యలేరని అర్థమయిపోయిం దతనికి. అటు యిటు చూశాడు. అమ్మవారి విగ్రహం చేతికున్న త్రిశూలం కనిపించింది.

అభిలాష్ యే మాత్రం ఆలస్యం చెయ్యకుండా విగ్రహం చెంతకు పరుగెత్తాడు. విగ్రహానికి అభివాదం చేస్తున్నట్టు ఒక్కక్షణం ఒంగి దండం పెట్టుకున్నాడు. త్రిశూలాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

మంత్రగాడి వెనగ్గా చేరి అతని చేతిలోని ఎముకను గురిచూసి ఎగరగొట్టేశాడు. మంత్రగాడి మంత్రం ఆగి పోయింది. అదురుపాటుతో వెనుతిరిగి చూశాడు.

ఆ ఒక్కక్షణాన్ని సక్రమంగా వినియోగించు కున్నాడు అభిలాష్. త్రిశూలాన్ని మంత్రగాడి గుండెల్లో దించేశాడు. మొదలు నరికిన చెట్టులా నేల కూలి పోయాడు మంత్రగాడు.

(సశేషం)

